# చంద్రస్మృతి
Chandrasmriti

మార్చి 01, 2014

ప్రతులు : 500

టైటిల్ డిజైన్ : ఎ.గిరిధర్, విజయవాడ

ప్రచురణ :

భువనగిరి చంద్రశేఖర్ స్మారక సంఘం

గుంటూరు

సంప్రదించవలసిన చిరునామా :

A. Subrahmanyam
GF1, Sudha Apartments
6/13A, Brodiepet
Guntur - 522 001
Mobile :9000389389
Mail:subrahmanyam.a@gmail.com

---

**Printed at :**

Don Bosco Tech. School Press, Ring Road, Guntur-7, Ph:0863-2350832

# విషయసూచిక

# ముందుమాట

మానవ హక్కుల నేత, ప్రముఖ న్యాయవాది భువనగిరి చంద్రశేఖర్ (జ. 1963- మ. 2013) గురించిన స్మృతులను ఒక సంపుటిగాను, అతని వ్యాసాలన్నింటినీ ఒక సంపుటిగాను ద్వితీయ స్మారకోపన్యాసం నాటికి తీసుకురాదల్చినట్లు బి. చంద్రశేఖర్ స్మారక సంఘం ప్రకటించింది. ఆ మేరకు మార్చి 1, 2014న జరగనున్న చంద్రశేఖర్ ద్వితీయ స్మారక ఉపన్యాసం సందర్భంగా ఈ రెండు సంపుటాలను ఆవిష్కరించనున్నాం.

చంద్రశేఖర్‌తో పరిచయమున్న వారెవరైనా అతనితో వారికున్న జ్ఞాపకాలను రాసి ముద్రణకు సహకరించవలసిందిగా పత్రికాముఖంగా కోరాము. స్పందించి రాసి పంపిన వారి స్మృతులను ఈ సంపుటిలో చేర్చాము.

చంద్రశేఖర్ మరణించిన వెంటనే **బహుజన కెరటాలు** మాస పత్రిక జనవరి - ఫిబ్రవరి 2013 సంచికలను కలిపి చంద్రశేఖర్ స్మారక సంచికగా వెలువరించింది. ఈ స్మారక సంచికలో అనేకమంది చంద్రశేఖర్‌తో తమకున్న జ్ఞాపకాలను వ్యాస రూపంలోను, కవిత్వ రూపంలోను పంచుకున్నారు. అలానే చంద్రశేఖర్ మరణానంతరం వివిధ దినపత్రికలలో వచ్చిన జ్ఞాపకాలలో కొన్నింటిని **బహుజన కెరటాలు** సంచికలో పునర్ముద్రించారు. ఈ స్మారక సంచికలోని సకల వ్యాసాలను, కవితలను ప్రస్తుత సంపుటిలో చేర్చాము. ఇలా చేర్చి, పునర్ముద్రించేందుకు అనుమతించిన **బహుజన కెరటాలు** మాసపత్రిక వ్యవస్థాపకులు పల్నాటి శ్రీరాములు గారికి (ఒంగోలు), పత్రిక సంపాదక వర్గానికి ధన్యవాదాలు. స్మారక సంచిక మృదు (సాఫ్ట్) ప్రతిని పంపించడంలో

సహకరించిన డా॥ నూకతోటి రవికుమార్, డిటిపి ఆపరేటర్ కోటిలకు ధన్యవాదాలు.

ఇవి కాక, వివిధ దినపత్రికలలో ప్రచురించబడిన చంద్ర జ్ఞాపకాల వ్యాసాలు కూడా ఈ సంపుటిలో చేర్చాము.

ప్రస్తుత సంపుటిలోని వ్యాస రచయితలకు, కవిత లందించిన వారందరికీ బి. చంద్రశేఖర్ స్మారక సంఘం తరపున ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి ఇచ్చిన డాన్‌బోస్కో టెక్నికల్ స్కూల్ ప్రెస్, గుంటూరు వారికి మా ధన్యవాదాలు.

ఫిబ్రవరి 20, 2014

**బి. చంద్రశేఖర్ స్మారక సంఘం**

గుంటూరు.

# 'చంద్రస్మృతి'

*Only those who will risk going too far can possibly find out how far one can go* *- T.S. Eliot*

సునిశిత, సృజనాత్మక మేధావి, శక్తివంతమైన వక్త, దళిత జన పక్షపాతి, నిరంతర అన్వేషి, హక్కుల తాత్త్వికుడు చంద్ర మరణించి సంవత్సరకాలం దాటిపోయినా ఆ చేదు నిజం ఇంకా మింగుడు పడటంలేదు. 2013 జనవరి 22వ తేదీన నిమ్స్‌లో తుదిశ్వాస విడిచిన చంద్ర రూపం కళ్ళల్లో కన్నీళ్ళతోపాటు సుళ్ళుతిరుగుతోంది. కన్నబిరాన్, బాలగోపాల్, చంద్రశేఖర్ లనే మూడు పేర్లు తెలుగు సమాజపు హక్కుల ఉద్యమ చరిత్రలో మూడు అధ్యాయాలు. ఐరోపా హక్కుల ఉద్యమ ప్రేరణలోంచి బయలుదేరిన ఈ ముగ్గురు తమ నిరంతర ఆలోచన, ఆచరణ క్రమంలో అనేక కొత్త ప్రశ్నలు ఎదుర్కొన్నారు. వాటికి సమాధానాలు వెతికే ప్రయత్నం చేశారు. ఆ ప్రయత్నంలో చంద్ర మరింత లోతులకు వెళ్ళాలనే సాహసం కూడా చేశాడు. వలసవాద ఆలోచనా చట్రాలలోంచి రూపొందిన న్యాయవ్యవస్థను, హక్కుల స్వరూప, స్వభావాలను బహిర్గతం చేసే ప్రయత్నమూ చేశాడు. మార్క్స్‌తో మొదలై బౌమన్ దాకా విస్తరించిన చంద్ర తాత్త్విక అధ్యయనం తన ఆలోచనలను పదును పెడుతూ వచ్చింది. అదే సందర్భంలో తన రాజకీయ ఆచరణకు సంబంధించిన సంశయాలు మొదలైనప్పటికీ అణగారిన వర్గాల పట్ల తనకున్న నిబద్ధత ఏ మాత్రమూ ఏ సందర్భంలోనూ సడలలేదు. ఆ నిబద్ధత నిజాయితీలతో పాటు వరవరరావు అన్నట్లు పాదరస సదృశ్యమైన చంద్ర జిజ్ఞాస తెలుగు మేధావుల్లో చంద్రను ఒక విశిష్టమైన వ్యక్తిగా నిలబెట్టింది.

పందొమ్మిది వందల ఎనభైలలో తెలుగు రాజకీయ, సాహిత్య, తాత్విక రంగాలలో కొన్ని ప్రతిమానాలు (Paradigms) మారటంతోపాటు, ఈ మూడు రంగాల ఆచరణలలో ఒక కొత్తతరం రంగం మీదకు రావటం జరిగింది. ఈ తరం అన్ని రంగాలలో Head Quarters ని bombard చేయటానికి వెనుకాడని తరం. పై మూడు రంగాల మధ్య ఉండే disciplinary boundaries ను అధిగమించి ఏకకాలంలో అన్ని రంగాలలో operate కాగలగటం ఈ తరం ప్రత్యేక లక్షణం. ఈ తరం రూపొందటానికి కీలక నేపథ్యం కల్పించింది, అందుకు అవసరమైన ధైర్యాన్నిచ్చింది నక్సల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాలే. అప్పటివరకు ఆచరణలోనూ, ఆలోచనలోనూ ఏదో ఒక రంగానికి పరిమితమైవుండే యువతరం నక్సల్‌బరీ, శ్రీకాకుళ పోరాటాలకి నాయకత్వం వహించిన రాజకీయ నాయకులు, సైద్ధాంతిక సమర్థనను చేకూర్చిన మేధావులు ఈ తరాన్ని విశేషంగా ప్రభావితం చేశారు. ప్రతిదాన్ని ప్రశ్నించే తత్వం వీళ్ళకు వ్యక్తిత్వంలో విడదీయరాని భాగం అయింది. ఈ ప్రశ్నించే స్వభావం ఏ స్థాయిలో ఏర్పడిందంటే తాము ఎవరినించయితే ప్రేరణ పొందారో, ఎవరినుంచి జ్ఞానగ్రహణ చేశారో వాళ్ళను కూడా ప్రశ్నించే స్థాయికి, నిలదీసే చైతన్యానికి దారితీసింది. ఈ తరంలో ఒక ప్రముఖుడు బి. చంద్రశేఖర్. చంద్ర నిరంతర అన్వేషి, చింతనాశీలి. అభిప్రాయ వ్యక్తీకరణలో ఎటువంటి మొహమాటాలు లేనటువంటివాడు. ఒక వ్యక్తి తాను నమ్మిన విషయాన్ని గురించి మాట్లాడటంలో, దాన్ని ఆచరించటంలో ఎటువంటి జంకు లేకుండా, ఎవ్వరినీ లెక్కచేయకుండా ఉండగలిగినప్పుడు ఆ వ్యక్తికి మనం ఏఏ విశేషణాలు వాడవచ్చో అవన్నీ చంద్రకు నప్పుతాయి. అయిదు పదుల అంచుల్లో అర్థాంతరంగా జీవితాన్ని ముగించిన చంద్ర వందేళ్ళకు సరిపడేంతగా సమాజంకోసం పనిచేశాడు. ఆచరణలో అది పౌరహక్కుల విషయంలో కానీ, రోజువారీ కేసుల విషయంలో కానీ. తన చుట్టూ వున్న వాళ్ళను activate చేయటమే కాక, కొన్ని సందర్భాలలో అతని ఆచరణ ప్రక్కవాళ్ళను ఒకానొక guilty consciousness కు గురిచేసేది. అంత తీవ్రంగా తాను తను నమ్మిన కార్యక్రమాలలో నిమగ్నమయిపోయేవాడు చంద్ర.

తన నలభై తొమ్మిది సంవత్సరాల జీవితంలో మూడు దశాబ్దాల పైగానే సామాజిక ఉద్యమాలలో, ఘటనలలో విశేషపాత్రని నిర్వర్తించాడు. పందొమ్మిది వందల ఎనభైలలో రాడికల్ విద్యార్థి సంఘంలో సభ్యుడిగా మొదలయిన అతని

రాజకీయ, సాహిత్య, తాత్విక జీవితం చాలా ఉధృతంగా మూడు దశాబ్దాలు కొనసాగింది. నిరంతరం సామాజిక సమస్యలలో చురుకుగా పనిచేసేవాళ్ళు అధ్యయనానికి ఎక్కువ సమయం కేటాయించటం కుదరదు. చంద్ర విషయంలో అది ఏ మాత్రం నిజం కాదు. చంద్ర నిరంతర అధ్యయనశీలి. 1989 నుంచి ఇవ్వాళ OUCIPగా పిలవబడుతున్న ఒకప్పటి ASRC ఈ మూడు దశాబ్దాల కాలంలో అతనికి అధ్యయన కేంద్రమయింది. వీలున్నప్పుడల్లా ASRCకి వెళ్ళి ఒక పరిశోధక విద్యార్థిలాగ చదువుకోవటం, ఎండాకాలంలో ఎక్కువ భాగం అక్కడే ఉండటం 1990ల నుంచి చంద్ర క్రమం తప్పకుండా చేస్తున్నపని. పగలంతా Libraryలో చదువుకుంటూ సాయంత్రానికి స్నేహితుల సాన్నిహిత్యంలో గడిపేవాడు. సాయంత్రాలు తన మిత్రులను కొంతమందిని ASRC కి ఆహ్వానించేవాడు చంద్ర. వీళ్ళలో ప్రముఖ పౌర హక్కుల నేత ఎం.టి. ఖాన్ నుంచి కవి ఎం.ఎస్. నాయుడు వరకు ఉండేవాళ్ళు. ఎం.టి.ఖాన్ ఉర్దూ కవితలు, ఉదహరిస్తూ మాట్లాడుతున్నప్పుడు చంద్ర పొందిన సాహిత్య ఉత్తేజం ఇంకా ఈ వ్యాస కర్త కళ్ళముందు మెరుస్తోంది. తన మొదటి పుస్తకం ''శాకొ-వాంజెట్టి'' రాయటం అనేది ASRC లేకుండా సాధ్యపడి వుండేది కాదు. ఆ పుస్తకం గత మూడు దశాబ్దాల కాలంలో వెలువడిన ఏ ఉత్తమ పరిశోధక గ్రంథాలకు ఏ మాత్రం తక్కువ కాదు. అది తన మొదటి పుస్తకం అంటే నమ్మశక్యం కాదు.

'శాకొ - వాంజెట్టి' పుస్తకపు మొదటి అధ్యాయంలో ఒక ఫుట్‌నోట్ ఇలా ఇచ్చాడు: ''గ్రీకు భాషలో 'అనార్కి' అనే పదానికి 'ప్రభుత్వం లేకపోవటం' అనే అర్థం ఉంది. తెలుగులో 'అరాచకం' అనే పదానికీ అదే అర్థం. అయితే వాడుకలో ఆ రెండింటికీ నెగిటివ్ అర్థాలున్నాయి. కానీ అరాచక వాదులు పాజిటివ్ అర్థంలో వాడారు'' (శాకొ-వాంజెట్టి, పు.2). ఈ పుస్తకం రాస్తున్న కాలంలో సరిగ్గా తనుకూడా అరాచకవాదాన్ని చాలా సానుకూలంగా చూశాడు. అరాచకవాదం గురించి కొంత విస్తృతంగా చదవటం మొదలు పెట్టాడు. ASRC నుంచి చాలా పుస్తకాలు photo-copy చేయించాడు. ఛోమ్స్కి అరాచకవాద స్కూల్ నుంచి వచ్చాడనే విషయం కూడా తనని ఉత్తేజపర్చింది. అరాచకవాదాన్ని గురించి నిర్దుష్టంగా ఒక పుస్తకం రాయాలని ప్రయత్నించాడు. అయితే ఆ రోజుల్లో తాను పౌరహక్కుల ఉద్యమాలలో తీరికలేకుండా పనిచేస్తూ వుండటం వల్ల అది సాధ్యపడలేదు. నిజానికి చంద్ర మూర్తిమత్వంలో ఒక ధిక్కార ధోరణి విద్యార్థిగా ఉండే రోజులనుంచి వుంది. అమలులో ఉన్న ఆలోచనా చట్రాల నుంచి ఆలోచించటం

అతనికిష్టముండదు. అలవాటు పడ్డ ఆలోచనా శైలికి తను వ్యతిరేకి. అయితే ఎప్పటికేది నమ్ముతాడో ఆ విషయంలో పూర్తిస్థాయి నిబద్ధతతో పనిచేసేవాడు. ఆ విషయం అతనితో పరిచయమున్న వాళ్ళందరికీ తెలుసు. రాడికల్ విద్యార్థిగా ఉన్న కాలంలో బీఫ్ తినటం నుంచి చనిపోవటానికి కొన్ని నెలల ముందు కాలంలో శివరాత్రికి ఉపవాసం ఉండటం వరకు అన్నింటిలోనూ తెలుస్తుంది. ఎక్కడ ఏ విషయాన్ని అతను దాచలేదు. తనకొచ్చిన క్యాన్సర్ గురించి తప్ప. తన సమస్య కేవలం 'వెన్నునొప్పి' అని నాలుగు నెలలపాటు అందర్ని భ్రమలో ఉంచాడు. చనిపోవటానికి పదిహేను రోజుల ముందు మాత్రమే ఫోన్ చేసి 'నాకు క్యాన్సర్' అని 'నాకు తలనొప్పి' అన్నంత మామూలుగా చెప్పాడు. అప్పటికి అది పూర్తిగా తగ్గిపోయిందనే నమ్మకంలోంచి మాత్రవే ఆ విషయం బయటపెట్టాడు.

గత దశాబ్ది కాలంలో చంద్ర ఆలోచనల్లో మౌలిక మార్పులు చోటు చేసుకుంటూ వచ్చాయి. ముఖ్యంగా క్రమంగా మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీల కార్యకలాపాలు కొంత తగ్గుముఖం పడుతూ చాలా మంది కమ్యూనిస్టు పార్టీల కార్యకర్తలు జేమ్స్ పెట్రాస్ రాసినట్టు ఎన్జీవోలుగా మారిపోవటం తనని చాలా బాధించింది. ఆ నేపథ్యంలో ఎన్జీవోల పుట్టు పూర్వోత్తరాలు, కార్యకలాపాలు, ఫండింగ్ గురించి చాలా లోతుగా అధ్యయనం చేశాడు. ఆ అధ్యయన ఫలితంగానే "ఎన్జీవోల కథ: సంక్షేమ సామ్రాజ్యవాద నూరేళ్ళ "విద్రోహ చరిత్ర" రాయటం జరిగింది. ఈ పుస్తకంలోని ఈ వాక్యాలు ఎన్జీవోల కార్యకలాపాలు పౌర సమాజంలో వామపక్ష రాజకీయాల సామాజిక పునాదులను చాపకింద నీరులా తొలిచేస్తున్నాయని చూపించాయి. వీటి చర్యలు కొన్నిసార్లు బాధితులకు తక్షణ సహాయంగానూ, సాంఘిక సంక్షేమ చర్యలుగానూ, మరికొన్ని సందర్భాలలో సమాజ రుగ్మతలను రూపుమాపే పనులుగానూ, దళిత, మహిళా, గిరిజన ఉద్ధరణగానూ, ఇంకొన్ని సార్లు ప్రజాస్వామ్యాన్ని పాదుకొలిపే పనులుగానూ దర్శనమిస్తున్నాయి. మానవ హక్కుల భాషను ఇవి మాట్లాడుతున్నాయి. జాతి, రాజ్యవ్యతిరేక చర్యలకు ఊతమిస్తున్నాయి. వామపక్ష మేధావులు చాలామంది ఎన్జీవోలుగా మారిపోవటం తనను చాలా బాధించింది. ఎన్జీవోలతో పని చేసేవాళ్ళతో చాలా సందర్భాలలో మామూలుగా మాట్లాడుతూ ఉన్నప్పటికీ కొన్ని సందర్భాలలో చాలా ఆవేశంగా, వాళ్ళను హర్ట్ చేసేటట్టు మాట్లాడటానికి

జంకేవాడు కాదు. ఒక సందర్భంలో ఈ వ్యాస కర్త నువ్వు అంత నిందా పూర్వకంగా మాట్లాడితే తను హర్ట్ అవ్వడా? అని ఎన్జీవోలతో ఉన్న ఒక వ్యక్తి గురించి అంటే 'ఆయన ఎన్జీవోలతో పనిచేస్తే నేను హర్ట్ అవుతానని తెలిసి ఆయన పనిచేస్తూ ఉంటే, నేనెందుకు తనని హర్ట్ చేయటానికి వెనుకాడాలి" అని మరింత ఆవేశంగా అన్నాడు. 'ఎన్జీవోల కథ' పుస్తకపు చివరి వాక్యం: "ఎన్జీవోల కార్యకలాపాలు దాతృత్వ సామ్రాజ్యవాదం తప్ప (philanthropic imperialism) మరేమికాదు. ఇంకా లోతుగా అధ్యయనం అవసరం ఉందని గుర్తిద్దాం. పారా హుషార్!".

అప్పట్లో జరుగుతున్న 'World Social Forum' కార్యకలాపాల గురించి 2004లోనే చర్చ లేవనెత్తాడు చంద్ర. ఈ సంస్థకు ఫోర్డ్ ఫౌండేషన్ నిధులు అందిస్తుందన్న విషయాన్ని బహిరంగ పర్చుతూ, ఆ నిధుల గురించి, ఆ నిధులు అందుకుంటున్న సంస్థల గురించి ప్రత్యేకంగా ప్రస్తావించాడు. 'WORLD SOCIAL FORUM' గురించిన కార్యకలాపాలలో పాల్గొంటున్న తన మిత్రులతో తీవ్రంగా విభేదించాడు.

చంద్ర ఆలోచనా సరళి ఎప్పుడు, ఆచరణలోనూ, సైద్ధాంతికంగానూ అన్ని రకాల అణచివేత రూపాలకు వ్యతిరేకంగా ఉంటుంది. ఈ ఆలోచనే తనని వామపక్ష పార్టీలు రాజ్యరూపాల్ని, లక్షణాల్ని సంతరించుకుంటున్న తీరును నిరసించేందుకు పురికొల్పాయి. దాని ఫలితంగానే APCLC నుంచి బాలగోపాల్ లాంటి వాళ్ళతో కలసి మానవ హక్కుల వేదికలోనికి వచ్చాడు. అయితే అక్కడకూడా తను ఎక్కువకాలం ఉండలేదు. నిజానికి 2000 సంవత్సరం నుండి తన ఆలోచనలు చాలా తీవ్రంగా మారుతూ వచ్చాయి. అధికారం, అధికార సంబంధాలు, అణిచివేత, జైళ్ళు, లైంగికాలు మొదలైన వాటి గురించి మరింత లోతుగా అధ్యయనం చేయటం మొదలు పెట్టాడు. Michel Foucault రచనలు కొంత శ్రద్ధగానే ఈ క్రమంలో చదివాడు. 'History of Sexuality' మొదటి సంపుటం మొదటి అధ్యయనాన్ని తెలుగులోకి అనువదించాడు. అది 'మరో దారి' పత్రికలో అచ్చయింది. ఇదే క్రమంలో తన దృష్టి Nativism వైపు కూడా మళ్ళింది. ఫలితంగా గూగి రచన 'Decolonizing Mind' చదివాడు. అందులో క్రైస్తవం, ఇంగ్లీషు భాష రెండు కూడా మానవ జాతిని వలసలకు గురిచేయటంలో కీలక పాత్ర నిర్వహించాయి అనే భావన చంద్రని తీవ్ర ఆలోచనకు గురిచేసింది.

వెంటనే ఆ పుస్తకాన్ని అనువదించే పనికి పూనుకొని ఒక అధ్యాయాన్ని పూర్తిచేశాడు. తెలుగులో అచ్చయిన గూగి రచన 'Devil on the Cross' 'మట్టికాళ్ళ మహారాక్షసి' పేరుతో వెలువడిందని, ఆ పేరు గూగి ఆలోచనలకు పూర్తి విరుద్ధమని, క్రైస్తవాన్ని సంకేతించేందుకే గూగి 'Devil on the Cross' అని వాడాడని, దాన్ని తొలగించి సామ్రాజ్యవాదాన్ని సంకేతిస్తూ ఇక్కడి వామపక్ష వాదులు మట్టికాళ్ళ మహారాక్షసి అని పేరు పెట్టారని చాలామంది మిత్రులతో చంద్ర అన్నాడు.

అఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లలో అమెరికా దాడులు జరుగుతున్న నేపథ్యంలో ప్రజాస్వామ్యాన్ని గురించి, పౌరహక్కుల గురించి మరింత లోతుగా ఆలోచించటం ప్రారంభించాడు. ఈ రెండింటికి వెనుకవున్న వికాస యుగ (Age of Enlightenment) తాత్విక పునాదులపై తనలో సంశయం మొదలైంది. ఈ సంశయం మొత్తంగా వికాసయుగ ప్రేరిత పాశ్చాత్య తాత్విక ధోరణి, సంప్రదాయాన్ని పూర్తిగా నిరాకరించే స్థాయికి చేరింది. వర్తమాన సమాజాల్లో మానవ హక్కుల గురించి గతంలో ఎన్నడూ లేనంతగా మాట్లాడటం జరుగుతున్నది. మరోవైపు ఇదే సందర్భంలో మానవ హక్కుల నిరాకరణ చాలా తీవ్రంగా జరుగుతోంది. ఈ paradox చంద్రను మానవ హక్కుల పుట్టు పూర్వోత్తరాలను గురించి చదివేందుకు పురికొల్పాయి. ఆ ప్రయత్నంలో Costas Douzinas రాసిన Justice Miscarried (1995), The End of Human Rights (2000) అనే పుస్తకాలు తన ఆలోచనకు పదును పెట్టాయి. చట్టానికి నైతికతకు ఉన్న సంబంధాన్ని గురించి చర్చించటం మొదలు పెట్టాడు. ఆధునిక యుగంవరకు మనిషి నిరంతరం అణిచివేతకు వ్యతిరేకంగా పోరాడుతున్నాడు. తద్వారా తన natural rights ను assert చేసుకుంటూ ఉన్నాడు. అయితే 18వ శతాబ్దం నుంచి వికాస యుగ ఆలోచనల ఫలితంగా హక్కులను మనుషుల మీద రుద్దే క్రమం మొదలయింది. ఈ క్రమాన్ని ప్రశ్నించాల్సిన అవసరాన్ని గుర్తించాడు. దీన్ని తాత్వికంగా నిర్దుష్ట రూపంలో ప్రతిపాదించక పోయినప్పటికీ అటువంటి ఆలోచనలను చేశాడు. 'హక్కులు వెంటపడుతున్నాయి, పారిపోండి' అని ఆ సమయంలో చంద్ర తన మిత్రులతో ఒక నినాదంలా అనేవాడు. అఫ్ఘనిస్తాన్, ఇరాక్‌లలో ప్రజాస్వామ్యం పేరుతో అమెరికా చేసింది ఈ హక్కులను మనుషులపై రుద్దే క్రమమే అని చంద్ర భావించాడు. ఆధునిక న్యాయ వ్యవస్థలో అంతర్ధానమైన నైతికత గురించి చంద్ర ఆలోచించాడు. ఆధునిక పూర్వ

సమాజాల్లో న్యాయానికి, నైతికతకు మధ్య సంబంధముండేదని, దాన్ని ఆధునికత ధ్వంసం చేసిందని నైతికత్వ సంబంధం తెంచుకున్న చట్టం న్యాయబద్ధంగా ఉండజాలదని చంద్ర ప్రగాఢంగా నమ్మాడు.

ఆధునిక పూర్వ సమాజాన్ని గురించి చంద్ర ఒకానొక నాస్టాలిజియా లోకి వెళ్ళాడు. ఆధునిక పూర్వ సమాజాల్లో, ముఖ్యంగా భారతీయ సమాజాన్ని అర్థం చేసుకోవటానికి సంస్కృతం నేర్చుకోవడం అనేది అవసరమని భావించాడు. ఆ గుర్తింపుతో ఒక ఉపాధ్యాయుడిని ఇంటికి పిలిపించుకుని సంస్కృతం నేర్చుకుంటూవున్నాడు. తనకి క్యాన్సర్ అని గుర్తించిన తరువాత కూడా ఈ సంస్కృతం నేర్చుకునే క్రమాన్ని కొనసాగిస్తూనే వచ్చాడు. మరొక వైపు పాశ్చాత్య స్థితిగతుల గురించిన తన అధ్యయనం క్రమంగా తనని ప్రముఖ సామాజిక శాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్ వైపు నడిపించింది. బౌమన్ భావాలు తనని చాలా తీవ్రంగా ఆకర్షించాయి. ముఖ్యంగా కమ్యూనిటేరియనిజం ధ్వంసం కావటం, మనుషులు వ్యక్తులుగా దిగజారటం, న్యాయం, నైతికత లాంటి అంశాల గురించి బౌమన్ చేసిన నిర్ధారణలు చంద్రను మూలాల్లోంచి కదిలించాయి. ఆ క్రమంలో బౌమన్ రచనలు మొత్తాన్ని సేకరించి చదవటం ప్రారంభించాడు. తన మిత్రులతో కలసి 'బౌమనీయం' అనే పుస్తకాన్ని కూడా రాయాలని సంకల్పించాడు. బౌమన్ దృష్టిలో వర్తమాన ప్రపంచం ఆధునికత మలి దశ, ద్రవ ఆధునికత (Liquid Modernity). ఈ ద్రవ ఆధునికతలో సంస్కృతి చేసే పని కొత్త అవసరాలను సృష్టించటం. ద్రవ ఆధునికత అంతకు ముందటి ఆధునికతలాగా ఏదో ఒక లక్ష్యాన్ని ముందుపెట్టుకొని సాగటం లేదు. అందుకు భిన్నంగా అది అభివృద్ధికోసమే అభివృద్ధి అన్నట్లుగా నడుస్తుంది. నిరంతర నూతనత్వం దాని అంతిమ లక్ష్యం. దీనికి లక్ష్యం లేదు. కేవలం ప్రయాణించటం మాత్రమే ఉంది. "for gardeners Utopia was the end of the road, while for hunters the road itself is the Utopia"అంటాడు బౌమన్. సారాంశంలో మనుషులు మళ్లీ ఇప్పుడు వేటగాళ్ళు అవుతున్నారు. ఆదిమ సమాజాలలోలాగా. ఈ స్థితి వ్యక్తి జీవితాన్ని నిరంతరం భయం గొలిపేదిగా చేస్తుంది. శకలీకరణ, అస్థిరత, రూపరాహిత్యం లాంటివి వర్తమాన వాస్తవికత లక్షణాలు. రాజకీయాలు, వ్యాపార ప్రకటనలు వ్యక్తిలో ఉండే ఈ భయాన్ని ఉపయోగించుకుంటున్నాయి. వ్యక్తులుగా పరివర్తనకు గురైన మనుషులు వీటి చేతిలో కీలుబొమ్మలవుతున్నారు. సమాజం

వ్యక్తులను భావజాలం ద్వారానే కాకుండా వినిమయ స్వేచ్ఛకు గురిచేయటం ద్వారా తనతో సమైక్య పరచుకుంటుంది. వినిమయ సంస్కృతిలో వ్యక్తికి వినియమం మాత్రమే గుర్తింపునిస్తుంది. వర్తమాన ద్రవ ఆధునికతలో మనిషి ఏమి కావాలన్నా మొదట వినియమదారుడు కావాలి. ఈ అంశాలన్నింటినీ చాలా విస్తృతంగా తన పుస్తకాల పరంపరలో బౌమన్ విశ్లేషించాడు. ఆ విశ్లేషణల ప్రభావం చంద్రపై చాలా గాఢంగా ఉంది. బౌమన్ ప్రేరణవల్ల చాలా రాయాలనుకున్నాడు. మనం సమాజంలో ఉదాసీనంగా గ్రహిస్తున్న చాలా అంశాలను చంద్ర పునర్మూల్యాంకనం చేయాలనుకున్నాడు. వలసవాదం గురించి నిర్దుష్టంగా అధ్యయనం చేయాలనుకున్నాడు. చనిపోవటానికి కొద్ది కాలం ముందుకూడా దేవదాసీ వ్యవస్థని గురించి అధ్యయనం చేసేందుకు అనేక పుస్తకాలు సేకరించాడు. ఇటీవల తన సంపాదనలో ఎక్కువ భాగం పుస్తకాల కోసమే కేటాయించాడు. చుండూరు కేసులో దళితుల విజయాన్ని కాంక్షించి అనేక నిద్రలేని రాత్రులు గడిపి విజయం సాధించాడు. ఆ విషయం వెనుక విస్తృతమైన అధ్యయనం ఉంది. ఇల్లు పట్టరాని పుస్తకాలను సేకరించినవాడు వాటిని పూర్తిగా చదవకుండానే, రాయాలనుకున్న వాటిని గురించి రాయకుండానే అర్ధాంతరంగా అంతర్ధానమయ్యాడు.

చంద్ర మరణంతో తెలుగు సమాజం ఒక గొప్ప ప్రామిసింగ్ ఇంటలెక్చువల్‌ని కోల్పోవటమే కాదు, డబ్బు ప్రభావం ఏ మాత్రం తన జీవన శైలిపై పడనీయకుండా జీవించిన ఒక అరుదైన వ్యక్తిని కోల్పోయింది.

చంద్ర మరణం తెలుగు సమాజంలో వేలమందిని కదిలించింది. ఆ కదలికను కొంతమంది అక్షరబద్ధం చేశారు. వాటిలో చాలా వ్యాసాలను **బహుజన కెరటాలు** పత్రిక ఒక ప్రత్యేక సంచికగా ప్రచురించింది. ఆ తరువాత కూడా కొంతమంది చంద్ర గురించి రాశారు. ఆ వ్యాసాలన్నిటినీ **చంద్రస్మృతి** లో చేర్చడం జరిగింది. చంద్ర గురించి రాయమని చాలామంది మిత్రుల్ని అడగటం జరిగింది. చాలామంది రాస్తామని వాగ్ధానం చేశారు. కాని రాయలేదు. బహుశా ఇంకా కొంతమంది రాస్తూ ఉండవచ్చు. వ్యవధిలేనందువలన ఇప్పటికి మాకు చేరిన వ్యాసాలతో కలిపి ప్రచురించటం జరిగింది. ఈ ప్రయత్నంలో సహకరించిన మిత్రులందరికీ, ముఖ్యంగా **బహుజన కెరటాలు** సంపాదక వర్గానికి కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాము.

# 1. దళిత హక్కుల గొంతుక చంద్రశేఖర్

**కలేకూరి ప్రసాద్,** గౌరవ సంపాదకులు, **బహుజన కెరటాలు**

చంద్రశేఖర్ మరణించాడు. అందరి మరణంలాగే అతని మరణం సహజ మరణమైతే నాలుగు కన్నీటి బొట్లు, ఐదారు సంతాప వాక్యాలు సరిపోయేవి. కానీ సహజ మరణంలా కనిపించే ఒక అసహజ మరణం చంద్రశేఖర్‌ది. మంచి లాయరుగా ఆంధ్ర దేశంలో చాలా మందికి అతని గురించి తెలుసు. మంచి వక్తగా మరెంతోమందికి తెలుసు. రచయితగా, ఉద్యమకారుడుగా ఇంకా చాలా మందికి తెలుసు. ఆయన అనుకోని రీతిలో అతిచిన్న వయస్సులోనే చనిపోవటం అనేది  పీడిత జనాలందరికీ ముఖ్యంగా దళిత బహుజనులకు ఒక తీరని లోటుగానే మిగిలిపోతుంది.

చంద్రశేఖర్ న్యాయవాదిగా ప్రజా జీవితంలో అడుగుపెట్టి, పౌరహక్కుల నాయకుడిగా గుంటూరు జిల్లాలోను, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమంతటా పేరు ప్రఖ్యాతులు పొందాడు. ఎంతోమంది న్యాయవాదులు ఉన్నారు, ఎంతో మంది మరణిస్తున్నారు. అందరి గురించి ప్రత్యేక ప్రస్థావనలు చేసుకోవటం గాని, విలాప వాక్యాలు రాసుకోవటం గాని చేయటంలేదు. దళితులు మరణించినప్పుడు మాత్రమే దుఃఖపడతామని, పతాకాలను అవనతం చేస్తామని కాదు. చుండూరు కేసును దగ్గరగా పరిశీలించిన ఎవరికైనా చంద్రశేఖర్ దళితులకు ఎంత దగ్గర బంధువో అర్థం అవుతుంది. ఆ కేసుకు అతను చేసిన కృషి లేకపోతే బహుశా అన్ని అత్యాచారాల కేసుల్లాగానే అందులోను ఓడిపోయే వాళ్ళం. అయితే అందుకు భిన్నంగా చుండూరు కేసు మనం గెలిచాం.  అందుకోసం చంద్రశేఖర్ ఎంతగా తపన పడ్డాడో, ఎవరెవరి దగ్గరకు తిరిగాడో, ఎన్నెన్ని వందల పేజీలు నోట్స్ రాసుకున్నాడో, దగ్గరగా చూసిన వాళ్ళందరికి తెలుసు.

జాతస్యః మరణం ధృవం, పుట్టిన ప్రతి ఒక్కరు చనిపోక తప్పదని అందరూ చెబుతూనే ఉన్న మాట. పుట్టడం, కుదిరినంత వరకు తినడం, నిద్రపోవడం, సుఖ దుఃఖాలలో మునిగితేలడం అందరూ చేసే పని. చంద్రశేఖర్ తన జీవితాన్ని ఈ కార్యకలాపాలకు మాత్రమే పరిమితం చేసుకోలేదు. అతను దళిత హక్కులు అనే మాటను పౌరహక్కుల ఎజెండాలోకి తీసుకొనివచ్చాడు. అప్పటి వరకు పౌరహక్కులంటే రాజ్యాంగం పేర్కొన్న హక్కులు మాత్రమేనని అంతకు మించి మరొకటి ఏమీకాదనే భావన ఉండేది.

మనిషి మలమూత్రాలను ఒట్టి చేతులతో ఎత్తివేసే అతి హీనమైన, హేయమైన, వృత్తిలో ఎంతోమంది దళితులు కొనసాగేవారు. బసివి, జోగిని, మాతమ్మ తదితర పేర్లతో కొనసాగుతూ ప్రతిరాత్రి ఎవరో ఒక తెలియని వ్యక్తికి భార్యగా జీవించవలసిన పరిస్థితి, ఇంకొక వైపున పాలుగారే ప్రాయంలోనే కాటికి కాలుచాపుకున్న ముసలివాళ్ళకు భార్యయై బాల్య వివాహ వ్యవస్థలో నలిగిపోతున్న పసిబిడ్డలు. ఇక రోజూ తెల్లవారక ముందే నిద్రలేచి పుస్తకాలు పట్టుకొని చదువుల బడులకు వెళ్ళవలసిన పిల్లలు, పలుగు పార పట్టుకొని పొలాలకు పనికి వెళుతున్న దృశ్యం. ఈ ఘటనలు అన్నీ చంద్రశేఖర్‌ని కలచి వేశాయి. కదలించి వేశాయి. తనకు తాను ఒక అగ్రకుల బ్రాహ్మణ విద్యావేత్తగాకాక ఒక సామాజిక కార్యకర్తగా బాధ్యతాయుతంగా తనదైన శైలిలో పని చేయడానికి ఆయనను పురికొల్పాయి. ఈ కర్తవ్యాలే ఆయనను మానవహక్కుల వైపు మరి ముఖ్యంగా దళిత హక్కుల వైపు నడిపించాయి. ఇవేవి లేకపోతే చంద్రశేఖర్ గురించి చెప్పుకోటానికి బహుశా మనకు, మన పత్రికకు ఏమి ఉండకపోవచ్చు. అయితే వీటన్నింటి కారణంగానే చంద్రశేఖర్‌కి తగిన రీతిలో తగిన స్థాయిలో గౌరవాన్ని ఇవ్వటానికి బహుజన కెరటాలు పత్రిక ఈ అంజలిని ఘటిస్తుంది. అగ్రకులాల్లో పుట్టినా దళితుల మిత్రులుగా వ్యవహరించిన వారిని, దళితుల చరిత్ర ఎప్పుడూ హృదయానికి హత్తుకునే ఉంటుందని బహుజన కెరటాలు తెలియజేస్తుంది. చంద్రశేఖర్ కుటుంబ సభ్యులకు అతని మిత్రులందరికీ సానుభూతిని సహానుభూతిని తెలుపుతుంది. ఆయన ఆశయాలను, కర్తవ్యాలను ముందుకు తీసుకుపోయే ప్రక్రియలో బహుజన కెరటాలు తనదైన క్రియాశీలక బాధ్యతను తీసుకుంటుందని తెలియజేస్తూ.. చంద్రశేఖర్‌కి జోహార్లు అర్పిస్తుంది.



## 2. దళితోద్యమ చెలికాడు.. చంద్రశేఖరుడు

**అమర్తలూరి రత్నప్రసాద్,** న్యాయవాది

ఉరుములు, మెరుపులు లేని వానలాగా చంద్రశేఖర్ మరణవార్త చేరింది. పాతికేళ్ళ పరిచయబంధం ఒక్కసారిగా ఆగిపోయింది. చెప్పా పెట్టకుండా వెళ్ళినట్లుంది ఆయన మరణం. ఏ మాత్రం ఊహకి అందని పరిణామం. ఎంతో చలాకీగా, ఆరోగ్యంగా కనబడుతూ న్యాయస్థాన ప్రాంగణంలో తనదైన 'స్టైల్'తో వేసిన అడుగులే గుర్తుకొస్తున్నాయ్. ఆయన మరణం అబద్ధమైతే ఎంత బాగుండు అనిపిస్తోంది. వెంటాడుతోన్న జ్ఞాపకాలతో గుండె దిటవుచేసుకొని రాయాల్సి వస్తోంది. హక్కులకోసం పరితపించినవాడు. తన దేహానికి కూడా హక్కులుంటాయని వాటిని పరిరక్షించుకోవాలనే లాజిక్‌ని మిస్సయ్యాడు. తన అనారోగ్యాన్ని ఎవరికీ తెలియనియ్యకుండా దాచుకున్నాడు.

సుమారు రెండున్నర దశాబ్దాల క్రితం మాచర్ల పట్టణంలో చంద్రశేఖర్ ఒక సంచలన విద్యార్థి. రాడికల్ విద్యార్థి ఉద్యమంలో మమేకమై సమాజాన్నే తన సిలబస్‌గా మార్చుకున్నాడు. సమాజ మార్పుని విద్యార్థి దశలోనే తన కర్తవ్యంగా ఎంచుకున్నాడు. అప్పటి పీపుల్స్‌వార్ పార్టీ పిలుపులో భాగంగా ''గ్రామాలకు తరలండి'' క్యాంపెయిన్‌లో క్రియాశీలకంగా పాల్గొని పల్నాడు ప్రజలతో మమేకమయ్యాడు. అవగాహనని పెంచుకుంటూ రణక్షేత్రంలో రాటుతేలాడు. అద్భుతమైన వాక్చాతుర్యంతో విప్లవ రాజకీయాలని విస్తృతంగా ప్రచారం చేశాడు. మార్క్సిజాన్ని తన వైధానికంగా స్వీకరించి పటిష్టమైన పునాదిని ఏర్పరచుకున్నాడు. ఆ తర్వాత గుంటూరు ఎ.సి. న్యాయ కళాశాలలో చేరి తన ప్రస్థానాన్ని కొనసాగించాడు. లా విద్యార్థిగా అప్పటి ప్రిన్సిపాల్‌కి వ్యతిరేకంగా 100 ప్రశ్నలతో

కరపత్రం ప్రచురించి సంచలనం సృష్టించాడు. వ్యవహారాలలో ఎంతో దూకుడుగా వ్యవహరించేవాడు. ఉదయం దినపత్రికలో పార్ట్‌టైం జర్నలిస్టుగా పనిచేస్తూ పలు సామాజిక కథనాలను రిపోర్టు చేశాడు. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలో చేరి ఆ తర్వాత జిల్లా కార్యదర్శిగా వ్యవహరించాడు. ఆ కాలంలోనే ఆయన నన్ను ఎపిసియల్‌సి సభ్యుడిగా చేర్చుకున్నాడు. ఎపిసియల్‌సి జిల్లా కార్యదర్శిగా పనిచేసిన కాలంలోనే చంద్ర విశ్వరూపం బయటపడింది. లాకప్ మరణాలు, బూటకపు ఎన్‌కౌంటర్లు, ఖైదీల మరణాలు, దళిత, మహిళలపై హత్య, అత్యాచారాల ఘటనలో ఎప్పటికప్పుడు స్పందిస్తూ నిజనిర్ధారణ కమిటీలను ఏర్పాటు చేసి నివేదికలను తయారు చేసేవాడు. డా॥ బాలగోపాల్ తర్వాత నిజనిర్ధారణ కమిటీ నివేదికలను తయారు చేయడంలో రాష్ట్రంలోనే చంద్రశేఖర్‌కి విశిష్టమైన స్థానముంది. నక్సలైట్స్, వారి సానుభూతిపరుల అరెస్టుల సందర్భంలో ఏ మారుమూల పల్లె తండా నుండి సమాచారం వచ్చినా వేగంగా స్పందించి జిల్లా పౌర, పోలీసు పరిపాలనా యంత్రాంగాన్ని నిలదీసే వాడు. ఎంతటి శక్తివంతమైన ఎస్.పి.లనైన తనపదునైన వాదనలతో, నివేదికలతో ముచ్చెమటలు పోయించాడు. Rule of Law ని ఖాతరు చేయని పోలీసు అధికారులపై విరుచుకుపడి చట్టబద్ధపోరాటం చేసాడు. Rule of Law, Jurisprudence అంశాలపట్ల చంద్రశేఖర్‌కి విపరీతమైన ఆసక్తి ఉండేది. న్యాయవాద వృత్తికి సామాజిక బాధ్యత తప్పనిసరని భావించాడు. నిరంతర అధ్యయనం, కార్యాచరణతో చంద్రశేఖర్ పౌరహక్కుల, ప్రజా ఉద్యమాలలో విలక్షణమైన పాత్రపోషించాడు. ఉద్యమాలలో సహజంగా మేధస్సు ఉంటే ఆచరణ ఉండదు. ఆచరణ ఉంటే మేధస్సు ఉండదు. కాని చంద్రశేఖర్ రెండిటినీ సమన్వయం చేసుకొని ఉద్యమించాడు. భాషలో సైతం తెలుగుని, ఇంగ్లీషుని జంటగా జమిలిగా ప్రేమించాడు. వీటిపై పట్టుకోసం నిరంతర విద్యార్థిగా కృషి చేశాడు. తెలుగులో చంద్రశేఖర్ వచనం ఎంతో చిక్కనైనది. కన్నబిరాన్ ఆంధ్రజ్యోతికి ఇంగ్లీషులో వ్యాసాలు రాస్తే చంద్రశేఖర్ వాటిని తెలుగు చేసేవాడు. శాక్కో - వాంజెట్టీ నవల, ఎన్‌జివో కథలు, ఆయన రాసిన ఇతర వ్యాసాలలో తెలుగు ఎంతో ముచ్చటేస్తుంది. కవులు, కళాకారులు, రచయితలతో స్నేహం చేసేవాడు. భావజాలంతో నిమిత్తంలేకుండా ఎంతోమంది స్నేహితులని సమకూర్చుకున్నాడు.

రాజ్యహింసతోపాటు పౌరసమాజంలో వ్యవస్థాగతమైన హింసని సైతం ప్రశ్నించాలనే ప్రాతిపదికగా ఎపిసియల్‌సి నుంచి బయటికివచ్చి మానవ హక్కుల వేదిక (హెచ్‌ఆర్‌ఎఫ్)లో సభ్యుడైనాడు. ఈ అవగాహనలో భాగంగానే ఆయన మహిళా ఉద్యమాలకి, దళిత ఉద్యమాలకి మిత్రుడయ్యాడు.

న్యాయస్థానాలలో న్యాయవాద వృత్తిలో రాణించినవాళ్ళు కోకొల్లలు. కాని ప్రజా క్షేత్రంలో చంద్రశేఖర్ పోషించిన లాయర్ పాత్రే ఆయనను సజీవంగా నిలిపింది. న్యాయవాద వృత్తికి అనుబంధంగా ఆయా సందర్భాలలో ప్రజల్ని సన్నద్ధం చేసిన తీరు ఆయన వ్యూహ నైపుణ్యాలకు నిదర్శనంగా నిలుస్తాయి. చిలకలూరిపేట బస్ దహనం కేసులో చలపతిరావు, విజయవర్ధన్‌లకు న్యాయస్థానాలు ఉరిశిక్ష ఖరారు చేసిన అనంతరం చంద్రశేఖర్ అప్రమత్తంగా వ్యవహరించి ఎంతో చాకచక్యాన్ని ప్రదర్శించారు. అప్పుడు నేను 'వార్త'లో లీగల్ రిపోర్టర్‌గా ఉండి ఆయనతో ప్రతిరోజూ interact అవుతుండేవాడిని. పరిణామ క్రమంలో కె.జి.సత్యమూర్తిగారి ప్రవేశంతో ఆ కేసు దళిత ఉద్యమంగా మలుపుతిరిగింది. దళితులకేనా ఉరిశిక్షలు? అంటూ ఉరిశిక్ష రద్దుకోసం పెద్ద ఎత్తున దళిత ఉద్యమం కొనసాగింది. కె.జి. సత్యమూర్తి నాయకత్వాన రాష్ట్రవ్యాప్తంగా వున్న కవులు, కళాకారులు, రచయితలు రోడ్డెక్కి నినదించారు. చంద్రశేఖర్ ఎటువంటి శషబిషలు లేకుండా ఈ ఉద్యమంలో భాగస్వామి అయ్యాడు. ఈ ఉరిశిక్ష రద్దు ఉద్యమానికి ఎటువంటి సామాజిక ఆమోదం ఉండేది కాదు. మన చుట్టూ ఉన్నవాళ్ళే వ్యతిరేకించేవాళ్ళు. వాళ్ళందరితో చంద్ర నిరంతరం ఘర్షణ పడాల్సివచ్చేది. తన వాదనని defend చేసుకోవడానికి ఇతరులను ఒప్పించడానికి ఎంతో శ్రమించాడు. ఉరిశిక్ష రద్దుకోసం వెంకటేశ్వర విజ్ఞాన మందిరం (గుంటూరు)లో వొక సభ నిర్వహించాం. బస్ దహనంలో చనిపోయిన వారి బంధువులు కొంతమందిని తీసుకొని మళ్ళీ పోలీసులు సభపై దాడిచేశారు. చంద్రశేఖర్‌ని టార్గెట్ చేస్తూ బండబూతులు తిట్టారు. కాని చంద్రశేఖర్ తొణకలేదు, బెణకలేదు. తీవ్ర ఆటంకం నడుమ సభని విజయవంతంగా నిర్వహించడంలో కీలక పాత్ర పోషించాడు. రామాపురం దళిత ఖైదీల బెయిల్ విషయంలో కూడా దళిత ఉద్యమకారులతో కలసి పనిచేశాడు. న్యాయ స్థానాలు సైతం అగ్రకుల, అగ్రవర్గ స్వభావాన్ని కలిగి ఉన్నాయంటూ

అప్పట్లో దళిత సంఘాలు పెద్ద ఎత్తున ఆందోళన చేశాయ్. కారంచేడు కేసులో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా సీనియర్ న్యాయవాది తాడిపర్తి రామమోహన్‌రావు పనిచేశారు. ఆయనకు అండదండలుగా సీనియర్ న్యాయవాది వైకెతో పాటు చంద్రశేఖర్ ప్రాసిక్యూషన్ అసిస్టెన్స్ నిర్వహించాడు. ముఖ్యంగా కోర్టు ప్రొసీడింగ్స్, సాక్షుల విచారణ రిపోర్టుని తయారుచేసి పత్రికలకు పంపించేవాడు. అప్పట్లో కారంచేడు కేసు విచారణ రెగ్యులర్‌గా సమగ్రంగా పత్రికలు ప్రచురించాయంటే అందుకు కారణం చంద్రశేఖరే.

అగ్రకుల దాష్టీకానికి నిలువెత్తు నిదర్శనంగా నిలిచిన చుండూరు మారణకాండ కేసులో చంద్రశేఖర్ స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వ్యవహరించి అగ్రకుల ముద్దాయిలకి శిక్షలు పడేంత వరకు విశ్రమించలేదు. కత్తి పద్మారావు, కె.జి. సత్యమూర్తిల తర్వాత చుండూరు గ్రామంలోకి కుల నిర్మూలనా పోరాట సమితి ప్రవేశించింది. ప్రజల్ని, ముఖ్యంగా సాక్షుల్ని చైతన్యం చేయటంలో ఆ సంస్థ తీవ్రంగా కృషిచేసింది. కె.యన్.పి.యస్. ఏర్పరచిన భూమిక, కేసులో చంద్రశేఖర్‌కి ఎంతగానో ఉపకరించింది. ఎంతో నిజాయితీగా నిబద్ధతతో వ్యవహరించి చుండూరు ప్రజలలో, సాక్షులలో ఆత్మ విశ్వాసం దెబ్బతినకుండా కేసుని కాపాడుకోవడంలో చంద్రశేఖర్, ఆయన అసిస్టెంట్ జి.యన్. నాగేశ్వరరావులు వృత్తి నైపుణ్యాన్ని ప్రదర్శించారు. అప్పటికే కారంచేడు కేసు హైకోర్టులో వీగిపోవడం, నీరుకొండ కేసు తొలిదశలోనే నీరుగారిపోవడంతో వ్యవస్థలపట్ల దళితులలో తీవ్ర అసంతృప్తి ఉంది. ఆ నేపథ్యంలో చుండూరు కేసు ముద్దాయిలకి శిక్షలు పడటంతో దళిత శ్రేణుల్లో నూతనోత్సాహం వెల్లివిరిసింది. కేసు సందర్భంగా చంద్రశేఖర్ దళిత సమాజానికి ప్రియమైన స్నేహితుడయ్యాడు. హైకోర్టులో కూడా ఉద్దండులైన న్యాయనిపుణులను కాదని చంద్రశేఖర్‌ను చుండూరు దళితులు కోరుకున్నారంటే ఆయనెంత నమ్మకస్తుడో తెలుస్తోంది.

చంద్రశేఖర్ జీవితం చాలా సంక్లిష్టమైనది. రాడికల్ విద్యార్థి జీవితం మొదలుకుని, పౌరహక్కుల నేతగా, న్యాయవాదిగా, వక్తగా, రచయితగా, మానవ హక్కుల వాదిగా, సాహిత్య ప్రియుడిగా, అనువాదకుడిగా ఇలా అనేక dimensions ఆయన జీవితంలో ముడివేసుకుని ఉన్నవి. మార్క్సిస్టుగా బయలుదేరి

పలు తాత్విక ధారలకు తీవ్ర ప్రభావితుడై చనిపోయేనాటికి ఆధునికత గొంతు పిసికి సనాతన జీవితం వైపుగా ఆయన ప్రస్థానం సాగింది. వాస్తవానికి చంద్రశేఖర్ తాత్వికంగా అంతిమ నిర్ధారణలకు వచ్చినట్లు కనపడలేదు. పరంపరాగతంగా భావాలను మార్చుకుంటూ, ఒకానొక ఎరుక కోసం అన్వేషిస్తున్నట్లు అనిపిస్తోంది. ఆయన తిరస్కరించిన తన గతాన్ని మదిలో నిలుపుకున్నవాళ్ళే ఆయన అంతిమ యాత్రలో విశేషంగా పాల్గొని నివాళులర్పించటం విశేషం. భావజాల రంగంలో చంద్రశేఖర్‌తో వెయ్యొన్నొక్క వివాదాలు ఉండొచ్చుగాక - ఆయన కృషి, త్యాగం, కఠోర శ్రమ, సాధించిన విజయాలు, నిజాయితీలను చరిత్ర తనకు సాక్ష్యంగా నమోదు చేసుకొంది. ఆ జ్ఞాపకాలు ప్రజల హృదయాలలో ఎప్పటికీ చెరిగిపోవు. దళితోద్యమానికి సంఘీభావంగా వ్యవహరించిన ప్రజాతంత్ర మేధావులను దళితులు ఎన్నటికీ మరువరు. ఐఎఎస్ అధికారి ఎస్.ఆర్. శంకరన్, బాలగోపాల్ తదితరుల విషయంలో దళితోద్యమం ప్రజాస్వామికంగానే వ్యవహరించింది. విశ్వసనీయ మిత్రుడు బి. చంద్రశేఖర్ మృతికి దళితోద్యమం జోహార్లు అర్పిస్తోంది.

రచయిత సెల్ : 9393009415



# 3. చంద్ర జీవితం, వ్యక్తిత్వం

ప్రొ. ఎ. సుబ్రహ్మణ్యం, ప్రొఫెసర్, డీన్, న్యాయశాస్త్ర విభాగం,
ఆచార్య నాగార్జున యూనివర్శిటీ

**"శవాన్ని ఎవరూ క్రాస్ ఎగ్జామిన్ చేయలేరు" - ఇ.హెచ్.కార్.**

అది 1984. పై హెడ్డింగ్‌తో ఓ కరపత్రం నా చేతికి అందింది. అంతవరకు (ఆ మాటకొస్తే ఇంతవరకు) అలాటి కరపత్రం నేను చూడలేదు. మాచర్లలో ఫిలిప్ అనే దళిత యువకుడి లాకప్ హత్యపై చంద్ర వేసిన కరపత్రం అది. పోలీసుల అబద్ధాలను, అసలు జరిగిన చిత్రహింసలను చంద్ర ఆ కరపత్రంలో వివరించాడు. అప్పుడు చంద్ర డిగ్రీ ఆఖరి సంవత్సరం అనుకుంటా. ఓ పాతకాలం కెమేరా, దేనికైనా రెడీ అనే దూకుడు మనస్తత్వం, ఆచరణలో రాడికల్ విద్యార్థి సంఘ నాయకుడుగా ఉన్న రోజులవి.

అపుడు చంద్రతో నాకు మొదలైన ప్రస్థానం అతని మరణం వరకు కొనసాగింది. ఈ 30 సంవత్సరాల సాన్నిహిత్యంలో యువకుడుగా, రాడికల్ స్టూడెంట్‌గా ఉన్నప్పటి దూసుకుపోయే మనస్తత్వం చంద్రలో చివరిదాకా ఉండడం అతని వ్యక్తిత్వంలో ఒక అంశం. ఏ అంశాన్ని అయినా లోతుగా పరిశీలించడం, పోరాటాల్లో వచ్చే అడ్డంకులను ఎదుర్కొంటూ రాజీ పడకుండా, చివరిదాకా ఉండటం అతని వ్యక్తిత్వంలోని ప్రధాన అంశం. ఆనాడు విద్యార్థి సంఘ నాయకుడిగా, ఆ తరువాత పౌర హక్కుల సంఘ కార్యదర్శిగా లాకప్ హత్యలుగాని ఇతరత్రా అన్ని సంఘటనలలో దూసుకెళ్లడం చంద్ర వ్యక్తిత్వం. చంద్ర వ్యక్తిత్వంలో కఠోర శ్రమ చెయ్యడం నిత్యం జరిగేది. పాత రోజులలో జిరాక్సు సదుపాయం సరిగా లేనందున మాచర్ల బస్టాండ్ కూల్‌డ్రింకు షాపులో కూర్చొని అనేక కాపీల నిజనిర్ధారణ రిపోర్టులను, పత్రికా ప్రకటనలను చంద్ర

రాసేవాడు. ఫిలిప్, ధనలక్ష్మి, దాసరి వెంకటేశ్వర్లు తదితర ఎన్నో సంఘటనలకు సంబంధించిన నిజనిర్ధారణలు, పత్రికా ప్రకటనలు అన్నీ చంద్రానే శ్రమకు వెరవకుండా రాసేవాడు. ఈ పరిశోధన, అధ్యయనం, రాయడం చంద్రలో చివరివరకు కొనసాగింది. కాన్సర్ వ్యాధి నిర్ధారణ అయిన తరువాత కూడా దేవదాసీ వ్యవస్థపై అధ్యయనం చాలా వరకు చేశాడు. చంద్ర శ్రమ చేసే వ్యక్తిత్వానికి చుండూరు కేసును మించిన ఉదాహరణ ఉండదేమో. కొన్ని వేల పేజీలు అతని స్వహస్తాలతో రాసింది అందరికి తెలుసు. చుండూరు కేసే కాదు అతను తీసుకున్న అన్ని కేసులలో కూడా లోతైన అధ్యయనం, శ్రమ ఉండేది. చాలా సందర్భాలలో వేకువజామున 5 గం. వరకు రాసి చిత్తు ప్రతిని టైపింగ్‌కు ఇచ్చిన సందర్భాలు సన్నిహితులందరికి తెలుసు. అతని ఈ శ్రమ చేసే మనస్తత్వం నాకు సన్నిహితుడుగానే కాక అతని ఉపాధ్యాయుడిగా కూడా తెలుసు. లా చదివే రోజులలో యూనివర్శిటీ క్వార్టర్స్‌లో నాతోనే ఉండే రోజులవి. న్యాయశాస్త్ర అధ్యాపకుడిగా ఎంతోమందికి చెప్పినట్టు చంద్రకు కూడా నేను లా లో అన్ని సబ్జక్టులు చెప్పేవాడిని. నా ఎరుకలో అలా నా దగ్గర విన్న వాళ్ళు నాలుగు పాయింట్లు ముక్కున పెట్టుకొని వెళ్ళి పరీక్ష రాసి పాసైపోతే చాల్లే అనుకొనేవాళ్లే. కానీ చంద్ర లా పరీక్షలు కూడా చాలా సీరియస్‌గానే తీసుకునేవాడు. నా ద్వారా సబ్జక్టు మీద పరిచయమేర్పరచుకున్నాక మంచి రచయితల పుస్తకాల గురించి అడిగి తెలుసుకొని ఆ పుస్తకాల లోతుల్లోకి వెళ్లి మళ్ళీ నాతో చర్చించేవాడు. నాకు గుర్తున్నంతవరకు ప్రతి సబ్జక్టు మీద అతను 100 పైగా రాత పేజీల నోట్సు తయారుచేసేవాడు. ఆ తరువాత LL.M. లో క్లాసులకు పెద్దగా రాకపోయినా సబ్జక్టు అధ్యయనం తీవ్రంగా చేసేవాడు. LL.M. లో అతను సమర్పించిన వ్యాసం (Dissertation) చలపతి, విజయవర్ధన రావు నేరం, విచారణపై తాత్విక విచారణ. ఆనాడు ఆ సిద్ధాంత వ్యాసాన్ని చదివిన External Examiner చంద్ర మేధాశక్తికి ఆశ్చర్యపడ్డాడు. వైవాలో చంద్రతో ఎక్కువ సమయం చర్చించాడు.

చంద్ర వ్యక్తిత్వంలో మరో కోణం రాజీపడని మనస్తత్వం. క్యాన్సర్ వ్యాధి బైటపడే కొన్ని నెలల ముందే పోలీస్ అధికారి సీతారామాంజనేయులు ఎన్‌కౌంటర్లకు సంబంధించి ఢిల్లీ రెండుసార్లు వెళ్లొచ్చాడు. చంద్రా పట్టుదలకు చలపతి, విజయవర్ధనరావుల ఉరి శిక్షకు వ్యతిరేక ఉద్యమమే పెద్ద తార్కాణం. ఒకవైపు 23 మంది సజీవ దహనం, వాళ్ళిద్దరినీ నరికేయాలి అనే విషపూరిత

మీడియా ప్రచారం ఉన్న వాతావరణంలో వారిద్దరి తరఫున మాట్లాడాలంటే ఎంతో దమ్ముండాలి. ఎవ్వరూ నోరెత్తడానికి కూడా జంకే వాతావరణంలో చంద్ర ఒక్కడిగానే చలపతి, విజయవర్ధనరావుల ఉరిశిక్ష వ్యతిరేక ఉద్యమ అంకురార్పణ చేశాడు. నేనొక్కడినే ఏటికి ఎదురీదుతానని మొండిగా నిలబడ్డాడు. మొదట మాటలు, చర్చలు, కరపత్రాలు ఆ తరువాత తెనాలి మీటింగ్ ఇలా మొదలైన ఉద్యమం నిదానంగా రాజుకుంది. చంద్రా చేసిన నిరంతర, పట్టువదలని చర్చలు, చిన్న మీటింగులు, కరపత్రాలు అన్ని ప్రజా సంఘాల ఉద్యమ నాయకత్వాన్ని కుదిపింది. నాకు గుర్తున్నంతవరకు చంద్రా పట్టుదలని, అతను లేవనెత్తిన అంశాలలోని నిబద్ధతను అభినందించి ఆనాటి దళిత నేత కె.జి. సత్యమూర్తి గారు రంగంలో దిగడంతో చంద్రా అంకురార్పణ చేసిన ఉద్యమానికి వెయ్యేనుగుల బలం వచ్చింది. ఇతర సంఘాలు కూడా రంగంలోకి దిగాయి. చివరికి దళిత M.P. లు రాష్ట్రపతిని కలిసి మా పిల్లలని ఉరి తీయడానికి లేదు అని డిమాండు చేసే వరకు వెళ్లింది. ఇది చంద్ర పట్టుదలకు గొప్ప తార్కాణమని నా అభిప్రాయం. ఉద్యమం రాజుకునేదానికి ముందు దశలో చంద్ర ఆఫీసుపై పోలీసుల దాడి ప్రయత్నాలు, గుంటూరు మీటింగులో బాధితుల పేరుతో అల్లరి మూకల దాడి ప్రయత్నాలు ఎన్ని జరిగినా చంద్ర బెదరకపోవడం, జారిపోకపోవటం అతని వ్యక్తిత్వానికి నిదర్శనం. మందడం గ్రామానికి చెందిన ఎరుకల వాళ్ళను చేపల దొంగతనం చేశారనే నెపంతో చంపి, శవాలను కూడా కాల్చేసి మాయం చేసిన సంఘటనలో కూడా చంద్ర ఇదే ధైర్యాన్ని, పట్టుదలను చూపి చివరి వరకూ అండగా నిలిచాడు. అలా ఫిలిప్, చలపతి, విజయవర్ధన్‌ల ఉరిశిక్ష నుండి చుండూరు మారణకాండ వరకు దళితుల హక్కుల కోసం పోరాటం చేసిన చరిత్ర చంద్ర స్వంతం.

పెదనందిపాడులో ఒక యువ కానిస్టేబుల్, ఎస్.ఐ. వేధింపులు భరించలేక ఆత్మహత్య చేసుకున్న సంఘటనలో చంద్ర చివరి వరకు నిలిచి పని చేశాడు. అదే విధంగా తెనాలి ప్రాంతంలో ఒక కమ్మ యువకుడి లాకప్ హత్య సంఘటనలో రాజ్యాంగ వ్యవస్థని ముచ్చెమటలు పట్టించాడు చంద్ర. ఆ తరువాత న్యాయ విచారణలో నిరంతర శ్రమ చేసి చంద్ర వాదించాడు. ఈ విధంగా దళితులే కాదు ఇతర వర్గాల వారి హక్కుల విషయంలో కూడా చంద్రా ఎప్పుడూ రాజీపడలేదు. తన పోరాటంలో మర్యాదల పేరిట గాని, ఇతరత్రా

గాని పరిమితులను పాటించటం చంద్రాకు గిట్టదు. నాకు గుర్తున్నంతవరకు పోలీసుల అకృత్యాలకు వర్తించే ఐపిసి సెక్షన్లు చెప్పి ఆ అధికారులను అరెస్టు చెయ్యాలి అనే డిమాండును చంద్రానే ప్రవేశపెట్టాడు. ఒక సంఘటన సంబంధంగా D.I.G. చంద్ర ఆఫీస్‌కి ఒక పోలీసు అధికారిని పంపించి రమ్మని కబురు పెడ్తే చంద్ర ఇలా అన్నాడు. "ఆయనకు అవసరమైతే నా ఆఫీస్‌కి ఆయనను వచ్చి మాట్లాడమనండి లేదంటే అరెస్టు చేసి తీసుకెళ్ళమనండి" - That is Chandra - వచ్చిన అధికారి, ఆ D.I.G. ఖంగుతిని ఊరుకున్నారు. (సంఘటన, పేర్లు అప్రస్తుతం, అనవసరమని ప్రస్తావించటం లేదు).

ఇక చంద్ర సైద్ధాంతిక విషయానికి వస్తే అతను నిరంతర అన్వేషి అని చెప్పాలి. ఒక దానిని పట్టుకొని దాన్లోనే చివరిదాకా కొనసాగాలి లేకుంటే అందరూ ఏమనుకుంటారో అనే మనస్తత్వం ఇవాళ ఎక్కువమందికి ఉంది. దీన్ని Careerism అంటారో మరేమంటారో కాని ఇది నేటి సామాజిక వాస్తవం. చంద్రా ఈ మూస ఆలోచనా విధానానికి పూర్తి భిన్నం. అతనొక నిరంతర అన్వేషి. తన పోరాటాల్లో న్యాయం కోసం నిబద్ధత లాంటి అంశాలలో రాజీ పడకుండానే సైద్ధాంతికంగా నిత్యం అన్వేషణ కొనసాగించేవాడు. అన్వేషించడమే కాదు తాను చూసిన కొత్త అంశాన్ని ప్రతి వాడితో చర్చించే మనస్తత్వం చంద్రాది. ఉరిశిక్షల గురించి అన్వేషణ మొదలైనపుడు అమెరికాలో శాక్కో-వాంజెట్టి అనే ఇటాలియన్ కార్మికులను అమెరికా ప్రభుత్వం ఎంత దుర్మార్గంగా ఉరితీసిందనేది చదివి ఏకంగా శాక్కో-వాంజెట్టీలపై పరిశోధించి ఒక పుస్తకమే రాశాడు. నేను Howard Fast రాసిన The Passion of Sacco-Vanjetty అనే పుస్తకం చదివి దాన్ని గురించి చంద్రాకు చెప్పినపుడు చంద్రా అది చదివి ఆగలేదు. శాక్కో-వాంజెట్టీలపై పరిశోధన చేసి పుస్తకం రాశాడు. అంతేకాదు శాక్కో-వాంజెట్టిలు ఆనాడు నమ్మిన అరాచకవాదం (Anarchism) పై ఎన్నో పుస్తకాలు కొని చదివాడు. చదవడమే కాదు. సన్నిహితులందరితో ఆ సిద్ధాంతంలో తను చూసిన కోణాల గురించి చర్చించేవాడు. ఈ విధంగా రాడికల్ నుంచి అరాచకవాదం, ఆ తరువాత గ్రామ్‌సీ, కాఫ్కా, ఫుకో లాటి వారందరి రచనలను చంద్ర ఎంతగానో చర్చించేవాడు. గత నాలుగేళ్లుగా జిగ్‌మంట్ బౌమన్ అనే తత్వవేత్తను చంద్ర ఎంతో లోతుగా అధ్యయనం చేశాడు. అయితే ఇదే కాలంలో మోహన్‌రెడ్డి ప్రభావంతో నేను చంద్ర ప్రస్తుత మార్క్సిస్ట్, మావోయిస్ట్ ఉద్యమాలు లోపభూయిష్టంగా ఉన్నాయనే

అభిప్రాయానికి వచ్చాం. అవి సామ్రాజ్య వాద నయా వలస మార్కెట్ విధానాన్ని గుర్తించలేక మూసకట్టు మార్క్సిజంలో పడి మార్కెట్ విస్తరణకు సహకరించే ఉద్యమాలుగా మారాయనే ఖచ్చితమైన నిర్ణయానికి వచ్చాం. ఈ నేపథ్యంలో జిగ్మంట్ బౌమన్ అద్భుత విశ్లేషణలు చంద్రాను హత్తుకున్నాయి.

గ్రాంసీ, ఫూకో, కాఫ్కా, జిగ్మంట్ బౌమన్ ఇలా అందరి రచనలు, సూక్తీకరణలు చెప్పేవాడయినా ప్రధానంగా ఆధునికీకరణను వ్యతిరేకించటం చంద్ర పునాది సిద్ధాంతంగా నడిచింది. ఆధునికీకరణ అంటే రాజకీయార్థిక పరిభాషలో సామ్రాజ్యవాద నయావలస మార్కెటీకరణ అనొచ్చు. విప్లవ పార్టీలకు ఆధునికీకరణను వ్యతిరేకించే కార్యాచరణ లేదు సరికదా అసలు మార్క్సిజం ఆధునికీకరణకు ఊతాన్నిచ్చేదేనని చంద్ర అభిప్రాయం. ఆధునికీకరణ, క్రైస్తవం, యన్.జి.ఓలతో పాటే మార్క్సిజం హిందూత్వ పార్టీలు అన్నీ ఆధునికత గూటి పక్షులేనని చంద్ర గట్టి అభిప్రాయం. 'హిందుత్వం ప్రచ్ఛన్న క్రైస్తవం' అని రాణి శివశంకర శర్మ గారి సూక్తీకరణతో చంద్ర ఏకీభవించేవాడు. గత సంవత్సరం పైగా ఆలోచనపరంగా చంద్ర, రాణి శివశంకర శర్మగారితో ఎక్కువ సాన్నిహిత్యంగా ఉండేవాడు. వారిద్దరు రెండు అంశాలపై అతిరాత్ర యాగం గురించి 'సండే ఇండియన్'కు వ్యాసాలు రాసింది అందరికీ తెలిసిందే. దైద గ్రామంలో తన పొలం వద్ద, మా ఇంట్లో రాణిగారు, చంద్ర, జితేంద్రలతో కలిసి ఆధునికత, సనాతనంపై చర్చించారు. 'సనాతనం-ఆధునికత' అనే పేరుతో రాణి శివశంకర శర్మ గారి పేరిట వచ్చిన 50 పేజీల పుస్తకంలో ప్రతి వాక్యంతో చంద్రకు ఏకాభిప్రాయం ఉంది. ఇందులో గురజాడను తులనాత్మకంగా పరిశీలించటం ప్రధాన ఇతివృత్తం. గురజాడపై మరో పెద్ద పుస్తకం తేవాలని నిర్ణయం కూడ జరిగింది.

ఆధునికత, గ్లోబలీకరణలు సాంప్రదాయ సామూహికతను, జీవన విధానాన్ని క్రూరంగా విధ్వంసం చేసి మార్కెట్ విస్తరణ, అటామిక్ వ్యక్తిని ఆవిష్కరించి మనుషుల్ని వినియోగదారులుగా మారుస్తున్న పరిణామాల్ని చంద్ర అసహ్యించుకున్నాడు. ఈ పరిణామ క్రమంపై లోతయిన అధ్యయనం చేశాడు. చంద్ర వ్యక్తిగత గ్రంథాలయంలో లెక్కలేనన్ని పుస్తకాలున్నాయి. చనిపోయేందుకు 20 రోజుల ముందు రెండు బీరువాలు కొని పుస్తకాలు అన్నింటిని సర్దించాడు. ఆధునికత వ్యతిరేక బృహత్తర గ్రంథం రాసేందుకు సామగ్రి అంతా సిద్ధం

చేసుకున్నాడు. ఆధునికత తీసుకొచ్చిన విధ్వంసాన్ని అధ్యయనం చేస్తూనే దానికి దారులు వేసిన, వేస్తున్న ధోరణులను చంద్ర వ్యతిరేకించాడు. గురజాడను ఎండగట్టటం ఇందులో భాగమే. మరోవైపు సాంప్రదాయ సామూహికతను, మన చరిత్రను అధ్యయనం చేశాడు. సంస్కృతం అధ్యయనం చేస్తున్నాడు. ఇటీవలే ఋగ్వేదం సమగ్ర తెలుగు ప్రతిని సంపాదించాడు. సమీప భవిష్యత్‌లో ఈ కార్యక్రమాలు పూర్తి చేయాలి, మరోవైపు చుండూరు కేసుకు హైకోర్టులో అడ్డంకులు పోయి ఇక వాదనలు మొదలవ్వాలి. ఈ తరుణంలో కేన్సర్ మహమ్మారి చంద్రను అపహరించుకుపోయింది.

సిద్ధాంతాలు పక్కన పెట్టి వ్యక్తిగత లక్షణాలలో చంద్రకు ఆగ్రహావేశాల పాళ్ళు ఒకింత ఎక్కువేనని చెప్పాలి. అందువలన పోలీసుల్తో సహా అందరికి చంద్ర అంటే కాస్త భయం ఉండే మాట వాస్తవం. ఇక ధన సంపాదన విషయంలో, కేవలం లాయరుగా తన మేథా బలంపైనే ఆధారపడేవాడు. శ్రమించి, అధ్యయనం చేసి కేసు గెలవటమేగాని ఇక ఏ ఇతర పద్ధతుల్లో కేసులను గెలవాలని ఏనాడు ఆలోచించలేదు. 20 సంవత్సరాల నిరంతర శ్రమ ఫలితంగా గత కొద్దికాలంగా చంద్ర జిల్లాలో పేరెన్నిక గన్న న్యాయవాదిగా ఎదిగాడు. తన మేథస్సుకి తగ్గ కేసులు, ఫీజులు వచ్చే తరుణంలో మరణించటం కుటుంబానికి ఓ పెద్ద విషాదం.

చంద్ర అభిప్రాయాలతో ఏకీభవించలేని వారు కూడ చంద్ర శ్రమను, రాజీపడని మనస్తత్వాన్ని, పట్టుకున్న దాన్ని దేన్నయినా చివరి వరకు తేల్చుకునే ధీరత్వాన్ని అభినందించకుండా ఉండలేరు. ‘చంద్ర అభిప్రాయాలు, సిద్ధాంతాలు మాకనవసరం, చంద్ర పోవటం అంటే మాకు ఓ అండ పోయినట్లే’ అని తెనాలి మీటింగులో ఓ దళిత యువ న్యాయవాది అన్న మాట ముమ్మాటికి నిజం.

రచయిత సెల్ : 9000389389



## 4. ఎవరితను!

**తుల్లిమల్లి విల్సన్ సుధాకర్**

హింస సర్వ నామమై
చుండూరు పేరు పెట్టుకున్నాక
లక్షల యోజనాల గూడెమూ అగ్రహారాల
దవ్వుని దాటొచ్చి
రిక్త హస్తాలతో రక్త క్షేత్రం దగ్గర చతికిలపడ్డ
పేదలకు ఏకవచనమై కనబడతాడు
నరవాసన మరిగిన రక్తానికీ
నరహంతక సీతారామాంజనేయులుకూ
దెబ్బవేటు దూరమేనని కనిపెట్టి
తెగిన తలల చరిత్రకు
తెరపివ్వని నరమేధానికి హేతువు సేతువుల్ని కట్టి
సాక్ష్యాల శకలాలు తవ్వుతూ కనబడతాడు
నల్ల కోటుకు
నల్ల సంపాదన రహదారి గానీ
నల్ల జనం కోసం పోరాడిన చరిత్ర శూన్యమేగానీ
వంట్లో కేన్సర్ కన్నా
దేశమనే గేహంలో కేన్సర్ నయం కోసం
నల్లకోటు వేసుకున్న నయశాలై

వర్ణరీతికి ఉరితాళ్ళు పేనుతూ
వర్ణం కాటేసిన జాతికి శక్తిమేర విప్పుతూ
మళ్లీ మళ్లీ అతనే కనబడతాడు
డిస్నీలాండ్‌లో
యాంత్రిక యేనుగు నిజం కాదేమో గానీ
ముద్దనుకున్న మనుసంహిత పక్కదుప్పటిని
వద్దనుకున్న కాసిని జందెప్పోగుల్లో అతడు నిజం
మానవ హక్కుల వుద్యమ గద్యంలో
అతనొక ముగిసిన అధ్యాయం
ఎవరితను!
ఏమౌతాడు మనకతను!
న్యాయ శాస్త్రం పుక్కిలించిన మన పిల్లగాళ్ళే
బురద మట్టలా జారిపోతున్నప్పుడు
చచ్చేదాకా పేదోళ్ళ కేసులపై
అలుపొచ్చేదాకా పోరాటం చేసి
మానవ హక్కుల పోరాటానికి
మరిచిపోని నిర్వచనమై
స్మారక సభల అవసరం లేని శంకరన్ ఆత్మే
జనం గుండెల్లో బతుకుతున్న వాడు
బడుగులతో జేజేలు కొట్టించుకున్నవాడు...

రచయిత సెల్ : 08741901582



# 5. ఆత్మీయ స్నేహం... చంద్ర

**సజయ**

నమ్మాలనిపించటం లేదు. కానీ చంద్ర చనిపోయాడు. మనకు తెలియని అనంతలోకాల్లోకి వెళ్ళిపోయాడు. తాను ఎంతగానో ఇష్టపడే కొడుకు శశాంక్, సహచరి చంద్రికను, స్నేహబృందాన్ని ఇంత తొందరగా వదిలివెళ్ళటానికి మనస్కరించక చివరి రెండురోజులూ కుటుంబ సభ్యులు, స్నేహితులు తన చుట్టూనే వుండాలని కోరుకుంటూ వెళ్ళిపోయాడు. తనను చూడటానికి వచ్చిన ప్రతి ఒక్కరితోనూ తమ స్నేహాన్ని గుర్తుపెట్టుకుంటూ మాట్లాడాడు. సన్నిహితులమీద తనదైన శైలిలో చతురలాడాడు. దేవదాసీ వ్యవస్థ నిర్మూలన ఎంత కుట్రపూరితంగా జరిగిందో చెప్పాడు. గురజాడ మీద, ఆధునికత మీద తన విమర్శలు కొనసాగించాడు. జిగ్మంట్ బౌమన్ కొత్తపుస్తకం గురించి అడిగాడు. జబ్బు నయం చేయలేని ఆధునిక వైద్యం తన శరీరాన్ని ఇంకా హింసిస్తోందని, తనకు తట్టుకునే శక్తి లేదని, తాను ప్రత్యామ్నాయ వైద్యంలోకి వెళ్ళిపోతానని చెప్తూనే వున్నాడు. చేయి తాకితేనే విలవిలలాడిపోతున్న చంద్రను చూస్తుంటే కన్నీళ్ళు తనకి కనిపించకుండా వుండటానికి చాలా ప్రయాసపడాల్సి వచ్చింది. శరీరం సహకరించకపోయినా, లోపల దహించుకుపోయే మంట చెలరేగుతున్నా ఓర్చుకుంటూ ప్రతి ఒక్కరితోనూ మాట్లాడుతూనే ఉన్నాడు. చంద్రకు అస్సలేం బాగోలేదని నాకు ఫోన్ వచ్చిన 20 జనవరి ఆదివారం ఉదయం నుంచి చనిపోయిన 22 జనవరి మంగళవారానికి మధ్య 46 గంటలే వ్యవధి. జబ్బు బయటపడి అప్పటికి మూడునెలలు. అప్పటికే అడ్వాన్స్‌డ్ స్టేజిలో వుంది. ప్రైమరీ ఎక్కడో కనుక్కోలేకపోయారు. కనిపిస్తున్నదంతా సెకండరీస్ లక్షణాలు.

అప్పటినుంచి హైదరాబాదుకి వస్తూ నిమ్స్‌లో కీమోథెరపీ తీసుకుంటున్నాడని, రెండో అభిప్రాయం కోసం ముంబాయి జస్లోక్ ఆస్పత్రిలోని పద్మవిభూషణ్ డాక్టర్ అద్వానీ దగ్గరకు కూడా వెళ్ళారని మాకు చంద్రిక, శశాంక్ చెపితేనే తెలిసింది. హైదరాబాద్‌లో చికిత్స తీసుకుంటున్న విషయం కూడా సుబ్రమణ్యం, డొక్కా మాణిక్య వరప్రసాద్ లాంటి ఇద్దరు ముగ్గురు స్నేహితులకే తెలుసు. వీరితో కలిసి జనవరి 21న చంద్ర స్నేహబృందం ఒక పదిమందిమి కలిసి ఇద్దరు డాక్టర్ల దగ్గరికి వెళ్ళి కూలంకషంగా చర్చిస్తేగానీ అసలు చంద్రకు వచ్చిన జబ్బు పూర్తి సారాంశమేమిటనేది మాకెవ్వరికీ అర్థం కాలేదు. అర్థమయిన తరువాత ఎవరికీ మాట్లాడటానికి మాటలు లేవు. ఆ క్షణం రాకుండా వుంటే బావుండు అని మనసులో రోదించటం తప్ప.

నా వరకు నాకు చంద్రని గుర్తుపెట్టుకోవడమంటే గత మూడు దశాబ్దాల చరిత్రలోకి చూడటమే. ఆ చరిత్ర అందించిన స్ఫూర్తిని గుర్తుపెట్టుకోవటం. మేం కలిసి పనిచేసిన అనేక సామాజిక అంశాల నేపథ్యాన్ని, అవి సమాజం ముందుకు విసిరిన తీవ్రమైన సవాళ్ళను, చర్చలను గుర్తుకు తెచ్చుకోవటం. ఆ సందర్భంగా తగిలిన గాయాలను తడుముకోవటం. స్నేహ సౌరభాలను స్మరించుకోవటం. విప్లవ విద్యార్థి ఉద్యమంలో సంస్థలు వేరైనప్పటికీ ఒకటి రెండు సంవత్సరాలు అటూ ఇటుగా ప్రారంభమయినవాళ్ళం. నాకంటే చంద్ర మూడేళ్ళు సీనియర్. విజయవాడలో మొదటిసారి తన పరిచయం 1984-85 ప్రాంతంలో మైత్రి బుక్ హౌస్‌లో జరిగింది. ఆ తర్వాత అప్పుడప్పుడూ ఏదైనా మీటింగ్స్‌లో కలుస్తూ వుండేవాళ్ళం గానీ స్నేహం బాగా పెరిగింది 1990ల నుంచి. అప్పటి నుంచి ఎప్పుడు వెళ్ళినా వాళ్ళింట్లోనే వుండటం. చంద్ర పౌరహక్కుల సంఘంలో పనిచేస్తుండేవాడు. గుంటూర్లో చంద్ర తన లా ప్రాక్టీస్ మొదలు పెట్టిన కొత్తరోజులు. 1991లో చుండూరులో దళితులపై అమానుష మారణకాండ జరిగిన వెంటనే హైదరాబాద్ నుంచి అన్వేషి, ఉస్మానియా యూనివర్శిటీల తరఫున వచ్చిన నిజనిర్ధారణ బృందంలో నేనూ ఉన్నాను. ఆ బృందం తరఫున ఇపిడబ్ల్యులో చుండూరు దళితుల మీద జరిగిన హత్యాకాండకు వ్యతిరేకంగా ఒక వ్యాసం రాశాం. ఎపిసిఎల్‌సి నుంచి చంద్ర వాళ్ళు అక్కడ కలిశారు. ఆ తర్వాత 1996లో చిలకలూరిపేట బస్సు దహనం కేసులో దళిత యువకులైన

చలపతి, విజయవర్ధన్‌ల ఉరిశిక్ష రద్దు కోసం చంద్ర పౌరహక్కుల సంఘం నుంచి చట్టపరంగా పోరాటం చేసిన విషయం ఒక ఎత్తైతే దానికి కొనసాగింపుగా రాష్ట్రంలో చంద్ర చొరవతో అపూర్వమైన రీతిలో ఒక ప్రజాస్వామ్య ఉద్యమం విభిన్న సమూహాలతో ప్రారంభమవటం మరొక ఎత్తు. అంతర్జాతీయంగా లండన్‌లోని ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ సంస్థతో పాటు ఐక్యరాజ్యసమితి మానవహక్కుల విభాగం రాపోర్టియర్ వరకూ చంద్ర అనేకమందిని కదిలించగలిగాడు. అలా కదిలించడానికి విశేషమైన కృషి చేశాడు. చంద్రలోని విలక్షణత అదే. ఏకకాలంలో న్యాయస్థానంలోనూ అదే సమయంలో ఒక యాక్టివిస్ట్‌గా కూడా అత్యంత చురుకుగా పనిచేయగలడు. ఆ తర్వాత ఆంధ్రజ్యోతి దినపత్రిక ఆదివారం సంచిక లో కె.శ్రీనివాస్ రాసిన 'ఆ ఇద్దర్నీ క్షమించలేమా' అనే వ్యాసం ఎంతో మందిని కదిలించింది. విభిన్న స్థాయిల్లో రాష్ట్రస్థాయి నుంచి జాతీయ స్థాయి వరకూ నడిచిన ఈ ఉద్యమం, కులవ్యవస్థ, న్యాయవ్యవస్థల్లోని వైరుధ్యాలను బట్టబయలు చేసింది. ఉరిశిక్ష రద్దు కమిటి పేరుతో కరపత్రాలు, పోస్టర్లు, మౌనప్రదర్శనలు, ఊరేగింపులు, చర్చలు, పోస్టుకార్డులతో రాష్ట్రపతికి విజ్ఞాపనలు, వీధినాటకాలు, పాటలు, కవితలు, బ్యానర్లపై చిత్రకారులు వేసిన పెయింటింగులు, ప్రభాతభేరీలు ఇలా ఎన్నో రూపాల్లో వైవిధ్య భరితంగా ఉద్యమం ముందుకు నడిచి చలపతి, విజయవర్ధన్‌లకు ఉరిశిక్ష రద్దు అయ్యేంత వరకూ సాగింది. హైదరాబాద్ రాంనగర్‌లోని బిఆర్‌పి ఆఫీసు ఈకార్యక్రమాలకు కేంద్రం. కె.జి. సత్యమూర్తిగారి నాయకత్వంలో రాష్ట్రవ్యాప్తంగా దళిత సంఘాల కార్యకర్తలు, నాయకులు, మేథావులు, ఆర్టిస్టులు, కవులు, కళాకారులు ఈ ఉద్యమంలో మమేకం అయ్యారు. హైదరాబాద్‌లో స్త్రీల సంఘాల నుంచి నాతో పాటు వసుధ, సమత, అంబిక ఇంకా మరెంతో మంది భాగస్వాములయ్యారు. రాష్ట్ర వ్యాప్తంగా ఈ అంశంమీద అనేక ప్రాంతాలలో ఎపిసిఎల్‌సి, ఇతర ప్రజాసంఘాలు జరిపిన అనేక సభలకు చంద్ర, బాలగోపాల్, నేను ఉపన్యాసకులంగా వెళ్ళాం. ఈ సభల్లో ఎప్పుడూ చంద్ర ఆఖరి ఉపన్యాసకుడు. చంద్ర మాట్లాడే పద్ధతి చాలా ఉత్తేజకరంగా వుండేది. ఎక్కడా తడబాటుగానీ, మాట్లాడే అంశం నుంచీ పక్కకు వెళ్ళిపోవటంగానీ వుండేది కాదు. మరణదండన విషయం చుట్టూ దేశవిదేశాల్లో జరుగుతున్న చర్చలను వివరించేవాడు. ఈ

విషయమై చంద్రను ఒక ఎన్‌సైక్లోపీడియా అనొచ్చు. అప్పటినుండి నిన్నమొన్నటి కసబ్ ఉరి వరకూ మరణశిక్షల రద్దు గురించి ఒక స్పష్టమైన ధృక్పదంతో మాట్లాడిన వ్యక్తి చంద్ర. ఉరిశిక్షల అంశాన్ని చర్చిస్తూ అనేకమంది మిత్రుల సహకారంతో నేను, మొయిద్ హసన్ కలిసిచేసిన డాక్యుమెంటరీ చిత్రానికి పరిశోధన సహకారం మొత్తం చంద్రదే. మాకోసం ఎంత మెటీరియల్ అందించాడో చెప్పలేం. చలపతి, విజయవర్ధన్‌లు చంద్రకు రాసిన అనేక ఉత్తరాలను చదివిన తర్వాతే నాకు ఈ అంశం మీద ఒక డాక్యుమెంటరీ తియ్యాలన్న ఆలోచన వచ్చింది. ఈ డాక్యుమెంటరీ తీసే క్రమంలో 1996 సంవత్సరం నుంచీ 2000 వరకూ నేను గుంటూరు చాలాసార్లు వెళ్ళాను. ఆ తర్వాత కూడా దాదాపు 2009 వరకూ కూడా ఏదో ఒక సందర్భంలో గుంటూరుకు అప్పుడప్పుడూ వెళ్తూనే వున్నాను. వెళ్ళినప్పుడల్లా ఆతిథ్యం చంద్ర, చంద్రికలదే. శశాంక్ చిన్ననాటి నుంచీ ఆ కుటుంబంతో ఒక ఆత్మీయమైన స్నేహం నాకు. హైదరాబాద్ వచ్చినపుడు హసన్ ఇంటికి (ఇప్పటి లామకాన్) వచ్చి చూసి తనకు ఎప్పటికైనా పల్నాడులోని తమ ఊరికి దగ్గరలో ప్రశాంతమైన వాతావరణంలో సహజసిద్ధంగా ప్రకృతిని ధ్వంసం చేయకుండా ఇలాంటి ఒక చిన్న ఇల్లు కట్టుకోవాలనివుందని చెప్పటం నాకు చాలా గుర్తు. హసన్ ఆల్కహాల్‌ని ఇష్టపడేవారు కాదు. చాయ్, సూపులను అద్భుతంగా చేసిచ్చేవారు. మంచి రుచికరంగా దక్కనీ మటన్ బిర్యానీ, షీర్‌ఖుర్మాలను తానే స్వయంగా తయారుచేసి చంద్ర వచ్చిన ఆ రోజు తినిపించారు. మందు తాగకపోవటం ఒక్కటి తప్పించి నాకు ఈయన చాలా నచ్చాడు అని పగలబడి నవ్వాడు చంద్ర. ఇంటికి సంబంధించిన ప్రస్తావనలో హసన్ "జరూర్ చంద్రశేఖర్ సాబ్, మై ఆయేగా ఘర్ డిజైన్‌మే ఆప్‌కె మదద్ కర్‌నే కేలియే' అంటే 'హసన్‌గారితో మాట్లాడటానికి, ఇస్లాం ఫిలాసఫీ తెలుసుకోవడంకోసం ఉర్దూ నేర్చుకోవటం అవసరం సజయ' అన్న చంద్ర ఇప్పుడులేడు. ఇల్లు డిజైన్ చేసేటప్పుడు వచ్చి మద్దతు ఇస్తానన్న హసన్ కూడా 2004లోనే పైకి వెళ్ళిపోయారు. హసన్ చనిపోయారన్న వార్త చెప్పినపుడు 62 ఏళ్ళకే చనిపోవటం ఏమిటి అని చంద్ర చాలా బాధపడ్డాడు. అయ్యోచంద్రా... నీకింకా 50కూడా నిండలేదు కదయ్యా... ఇది తీరే బాధేనా....

చుండూరు కేసులో చంద్రని స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా నియమించిన తర్వాత ట్రయల్స్ జరిగేటప్పుడు వచ్చి పరిశీలించమని చెబితే, ఆ కేసు మీద వున్న ప్రత్యేక ఆసక్తితో చాలాసార్లు ఇదేపనిమీద గుంటూరు వచ్చి చంద్రతో కలిసి చుండూరు వెళ్ళటం ఆ ట్రయల్స్‌ని పరిశీలించటం జరిగింది. మొదటిసారి కోర్టులో చంద్ర ఎలా వాదిస్తాడో అక్కడ చూశాను. ఒక సమయంలో బాధితుల కోణం నుంచీ వీడియో డాక్యుమెంట్ చేస్తే బావుంటుంది అనే ఆలోచన మా ఇద్దరికీ వచ్చింది కానీ చాలా వనరులు అవసరమవుతాయని, కష్టమవుతుందని ఆ ఆలోచనను ముందుకు తీసుకువెళ్ళలేదు. అప్పటికే హసన్ చనిపోయిన దుఃఖంలో వున్న నేను ఈ విషయంలో ధైర్యం చేయలేకపోయాను. చేసివుంటే బావుండేదని ఇప్పుడు అనిపిస్తోంది. ట్రయల్స్ ఏఏ రోజుల్లో వుంటాయో చంద్ర సమాచారం తప్పనిసరిగా ఇచ్చేవాడు. వసుధ, రేఖ పప్పు ఇలా ఎవరో ఒకరు చుండూరు ట్రయల్స్ జరిగేటప్పుడు వెళ్ళటం జరిగింది. బయటినుంచి వివిధ సామాజిక నేపథ్యాలతో వున్నవాళ్ళు వచ్చి పరిశీలిస్తున్నారన్నది చాలా ముఖ్యమైన విషయ మౌతుందని, ఇది ఆషామాషీ కేసు కాదని సమాజానికీ, న్యాయ వ్యవస్థలోని ప్రతి ఒక్కరికీ అర్థంకావాలని చెప్పేవాడు. ఒకసారి గోగు శ్యామల కూడా నాతో వచ్చి అక్కడి బాధితులను ఇంటర్వ్యూ చేసింది. అప్పుడు నేనుతీసిన ఫోటోలు కూడా చాలా వున్నాయి. అవి బహుజన కెరటాలు పత్రికలో వచ్చినట్లు గుర్తు. చుండూరు కేసులో తీర్పు వచ్చినతర్వాత ఒకసారి అన్వేషికి వచ్చి ఈకేసు చేయటంలో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్స్‌గా తాను, శివనాగేశ్వరరావు ఎదుర్కొన్న అనేక అంశాలని ఒక రోజంతా మా బృందానికి వివరించిన పద్ధతి మేమెవ్వరం కూడా మరిచిపోలేనిది.

చంద్రకు బాగా ఇష్టమయిన వ్యాపకం అధ్యయనం, దానికోసమే ప్రతి వేసవిలో కోర్టుకి శెలవులు ఇచ్చినప్పుడు బి. తిరుపతిరావుతో కలిపి హైదరాబాద్‌కి వచ్చి ఉస్మానియా యూనివర్శిటీలోని ఏయస్ఆర్‌సిలో పదిహేనిరవై రోజుల పాటు వుండి పొద్దునంతా చదవటం, నోట్స్ రాసుకోవటం, సాయంత్రాలు స్నేహితులతో గడపటం, అక్కడే శాక్కోవాంజెట్టి పుస్తకానికి సంబంధించిన నోట్స్ తయారుచేశాడు. దురదృష్టవశాత్తూ ఆ పుస్తకం తెలుగు సమాజానికి అర్థం కావలసిన రీతిలో అర్థం కాలేదని చాలా సందర్భాలలో అన్నాడు.

అన్వేషి లా కలెక్టివ్ 1999-2000 మధ్య ఒక సంవత్సరం పాటు ప్రతినెలా నిర్వహించిన అధ్యయన తరగతులకు చంద్ర, శివనాగేశ్వరరావు క్రమం తప్పకుండా వచ్చేవారు. కొన్నిసార్లు సుబ్రమణ్యంగారు కూడా వచ్చేవారు. 2003లో నాగార్జున సాగర్ పక్కన నల్లగొండ జిల్లాలో యురేనియం గనుల తవ్వకానికి సంబంధించి ప్రభుత్వం ప్రయత్నించినపుడు వేనేపల్లి పాండు రంగారావు, సత్యలక్ష్మి, సరస్వతి, కిషన్ ఇంకా మరికొంతమందిమి కలిసి యురేనియం గనుల వ్యతిరేక పోరాటం పేరుతో మూడేళ్ళపాటు పనిచేశాం. యురేనియం గనులు తవ్వితే ఏర్పడబోయే అణుధార్మిక రేడియేషన్ కేవలం నల్లగొండ జిల్లాకే పరిమితం కాదని, కృష్ణానదీ పరివాహక ప్రాంతమంతా ప్రభావితమవుతుందని, ఈ విషయమై గుంటూరు పట్టణంలో దానికి సంబంధించిన సమాచారాన్ని అందించటం అవసరం అనుకున్నాం. కేవలం అక్కడ చంద్ర వున్నాడనే ధైర్యమే అది. అప్పటికే చంద్ర మానవహక్కుల వేదిక నుంచి బయటకు వచ్చేయటంతో జనవిజ్ఞానవేదిక ద్వారా మీటింగ్‌పెట్టించాడు. ఆధునికత తీసుకువస్తున్న వెర్రితలల్లో న్యూక్లియర్ ఎనర్జీ ఒకటని, అందుకే ఎక్కడెక్కడ ఖనిజ నిక్షేపాలున్నాయో అక్కడ ప్రజల్ని చంపైనా సరే వాటిని కొల్లగొట్టాలన్న దుర్మార్గమైన ధోరణిని ఆపటం స్థానిక ప్రజల చైతన్యస్థాయి పెరగటం ద్వారానే సాధ్యమవుతుందని, వారే తిప్పికొట్టగలిగే రోజు రావాలని చంద్ర ఆరోజు అనటం ఇంకా నిన్నో మొన్నో అన్నట్లుగావుంది. ప్రకృతి, పర్యావరణం, ప్రత్యామ్నాయ వైద్యవిధానం వీటి గురించి తనకు చాలా వైవిధ్యమైన ఆలోచనలు వున్నాయనే విషయం తనతో ఆ అంశాల గురించి మాట్లాడిన వారికి అర్థమవుతుంది. దురదృష్టవశాత్తూ ఏ వైద్యవిజ్ఞానమూ చంద్రను బతికించలేకపోయింది.

నాకు, రమేష్‌కు చంద్రతో స్నేహం విభిన్న అంశాలతో ముడిపడి వుండేది. హైదరాబాద్‌లో మా ఇంటికి వచ్చినపుడు చంద్ర, రమేష్‌ల మధ్య తెలుగు సాహిత్యం, కవిత్వం ప్రధాన చర్చనీయాంశం. చంద్రకు ఫిలాసఫీ చాలా ఇష్టమైన అంశం. ఫ్రెంచ్ తత్వవేత్త మిఛేల్ ఫుకో, ఇటాలియన్ తత్వవేత్త గ్రాంసీలపై విస్తృత అధ్యయనాన్ని చేశాడు. ఇప్పుడు యూరోపియన్ తత్వవేత్త జిగ్మంట్ బౌమన్. చంద్ర మంచి ఉపన్యాసకుడు. అనర్గళంగా విషయంలోని తర్కం చెడకుండా మాట్లాడగలడు. తను వాదించే ఏ కేసునైనా విపరీతంగా అధ్యయనం చేసేవాడు.

హైకోర్టులో ప్రాక్టీస్ చెయ్యొచ్చు కదా అంటే అసలు పనంతా కిందికోర్టుల్లోనే వుంటుందని, తనకు హైకోర్టుకి వచ్చే ఆలోచన లేదని చెప్పాడు. బహుశా ఈ లక్షణమే తనని ఒక విలక్షణమైన న్యాయవాదిగా నిలబెట్టింది. అది ఉరిశిక్ష రద్దు, చుండూరు కేసుల్లో ప్రతి ఒక్కరికీ అర్ధమవుతుంది. చుండూరుపై తీర్పు వచ్చిన తర్వాత తర్జని పత్రిక ఎడిటర్ ఎం.ఎ. వనజకు ఇచ్చిన ఇంటర్వ్యూలో తమనే న్యాయ వాదులుగా ఎందుకు చుండూరు బాధితులు ఎంచుకున్నారో వివరించాడు. ఉరిశిక్ష రద్దు ఉద్యమం, చుండూరుల తర్వాత చంద్ర నేను కలిసి పాల్గొన్న చివరి సమావేశం టివి9 నవీనలో హోమోసెక్సువల్, లెస్బియన్, ట్రాన్స్‌జెండర్ అంశాలపై 377 చట్టాన్ని ఆమోదిస్తూ సుప్రీంకోర్టు ఇచ్చిన ఆదేశాల గురించి చర్చించటానికి వెళ్ళాం. దానిలో మాట్లాడుతూ 'మన ప్రాచీన సమాజంలో ఈ అంశాలకు సమాజ ఆమోదం వుందని, దానికి పెద్ద ఉదాహరణ అయ్యప్పస్వామి అని, అయితే ఈ అంశాలన్నీ చర్చించరానివిగా తయారవటం బ్రిటిష్ పరిపాలన తర్వాత విక్టోరియన్ భావజాలంతోనేని, మన అర్ధనారీశ్వరి తత్వం ఏం చెబుతుందో అర్థం చేసుకోవాలని, చెప్తుంటే అందరూ ఆశ్చర్యపోయి విన్నారు.

2008 సంవత్సరంలో వరంగల్‌లో సాయిప్రణీత, స్వప్నికల మీద యాసిడ్ దాడి చేసిన ముగ్గురు యువకులను పోలీసులు ఏ విచారణా లేకుండానే కాల్చిచంపారు. దానిమీద స్పందిస్తూ చంద్ర 'సమాజ రుగ్మతలను అదుపు చేయలేని ఈ ప్రభుత్వం, తమ చేతకానితనాన్ని కప్పిపుచ్చుకోవటానికి ఆ యువకులను చట్టబద్ధంగా అరెస్ట్ చేసి శిక్షించే అవకాశం వున్నప్పటికీ అది చేయకుండా తమ హీరోయిజాన్ని చూపించుకోవటానికి ఆ ముగ్గుర్నీ చంపేసింది. తమ మీదనుంచి తప్పును తోసేసుకోటానికి, ప్రజాభిప్రాయం పేరుతో ముగ్గురు తెలంగాణా పిల్లల్ని బలితీసుకుంది' అని ఘంటాపథంగా ఒక టి.వి. ఇంటర్వ్యూలో చెప్పాడు.

చంద్ర విలక్షణమైన, మానవీయ ఆలోచనా స్రవంతికి ఇవి కొన్ని ఉదాహరణలే. చంద్రని కేవలం హక్కుల కోణం నుంచే చూడలేం. తనలో దానికి మించిన తాత్విక జిజ్ఞాస వుంది. అది చంద్ర స్నేహంలోకి వెళ్ళిన ప్రతి

ఒక్కరికీ అనుభవమే. అది సాహిత్యం కావచ్చు, అస్థిత్వ ఉద్యమాలు కావొచ్చు. న్యాయపోరాటం కావొచ్చు.

చంద్రతో నా చివరి చర్చ కృష్ణా నదీ పరివాహక ప్రాంతంలోని సాంస్కృతిక అంశాలు, ఇప్పుడు కనిపిస్తున్న దేవాలయాల వెనుక వున్న చారిత్రక నేపథ్యాలని ఏ విధంగా అర్థం చేసుకోవాలనేది. తను పుట్టి పెరిగిన పల్నాడు అలాంటి సజీవ చారిత్రిక వారసత్వం వున్న ప్రాంతమని, దాని గురించి అధ్యయనం చేస్తున్నానని చెప్పాడు. చంద్ర మీద ఎంత నమ్మకం అంటే చెప్పాడు అంటే ఎప్పటికైనా పూర్తిచేస్తాడనే. కానీ ఎంతవరకూ వచ్చాడో తెలియకుండానే, ఏమీ చెప్పకుండానే వెళ్ళిపోయాడు. సమాజానికి సాంస్కృతికంగా పట్టిన 'రాచపుండు'ని బహిర్గతం చెయ్యాలనే తపనతో, కసితో స్నేహితులందరితోనూ వాదనలు, ఘర్షణలు, కోపాలు, విసుర్లు, చతురోక్తులూ ఏకకాలంలో చేస్తూనే చటుక్కున శారీరక రాచపుండు కోరల కింద మాయమై పోయాడు. ఇది నీ స్నేహితులందరికీ ఎంత కష్టంగా వుందో నీకు ఎలా చెప్పేది చంద్రా....

రచయిత సెల్ : 9948352008



## 6. మా గురించి మాట్లాడేవారెవరు?

సయ్యద్ సాబిర్ హుసేన్

మృత్యువు
వెన్నుపోటు పొడిచింది

నేరుగా
ఎదుర్కొనే ధైర్యం లేక
క్యాన్సర్ కణమై
విద్రోహానికి పాల్పడింది

సామ్రాజ్యవాదానికి
తొత్తుగా మారి
ఫాసిస్ట్ శక్తుల
అడుగులకు మడుగులొత్తుతూ
నమ్మక ద్రోహం చేసింది

అతడి గొంతు న్యాయస్థానాల
నాలుగ్గోడలు దాటి
వాడల్లో, మొహల్లాల్లో
వెలుగు రేఖై వికసించడాన్ని
మృత్యువు సహించలేకపోయింది

మరణానికి జడవని
అతడి తెగువను చూసి

భయంతో ఒణికిపోయింది
తూటాలకు బదులిచ్చే
అతడి మాటలకు జడిసి
తడిగుడ్డయి ఊపిరి తీసింది

ఇప్పుడు
మృత్యువు విజయ గర్వంతో
విర్రవీగుతోంది

చంద్రన్న నిష్క్రమణ తరువాత
మాకే
ఒంటరితనం ఆవరించింది
అనాథలమైపోయామన్న భావన
కలవరపెడుతోంది

ఇక
మాగురించి మాట్లాడేవారెవరు?

రచయిత సెల్ : 9493620796



# 7. హక్కుల 'చంద్ర' ఆదర్శనీయుడు

**కృపాకర్ మాదిగ**

మానవ హక్కుల నాయకుడు, న్యాయవాది, మిత్రుడు చంద్రశేఖర్ అకాల, ఆకస్మిక మరణం నాలో చాలా దిగులు రేపింది. చంద్ర స్నేహశీలి. ప్రేమించదగిన వాడు. ప్రేమించబడినవాడు. మానవ హక్కుల విఘాతం తీవ్రమైనప్పుడల్లా బాధితులకు దిక్కు అయిన మనిషి చంద్ర.

చంద్ర పోయిన వార్త నాకు ఆలస్యంగా తెలిసింది. మా ఇంట్లో టీవీ కనెక్షన్ పీకేసి ఏడాది అయింది. సమాచార కాల దూరం మా మధ్య ఎక్కువే. అంత్య క్రియలకి హాజరుకాలేకపోయాను. చంద్రని మిస్సయిన దుఃఖం వెంటాడుతోంది. 'బాగున్నావా చంద్రా?' అంటే 'నువ్వెలా వున్నావు కృపా?' అనే వాడు.

1980తొలినాళ్ళలో గుంటూరు జిల్లాలో విస్తృతంగా విప్లవ సభలు, సమావేశాలు జరిగేవి. ఈ సభల్లో ప్రజావాగ్గేయకారుడు గద్దర్, జననాట్యమండలి సంజీవ్, డాక్టర్ దివాకర్ గార్లచే సాంస్కృతిక ప్రదర్శనలు ప్రభావవంతంగా సాగుతుండేవి. నాగార్జునా విశ్వవిద్యాలయం, తెనాలి, మాచర్ల, గుంటూరులలో - ఇట్లా జిల్లా అంతటా జరిగే సభలకు నేనూ వెళ్తుండేవాడిని.

డాక్టర్ దివాకర్ (జననాట్య మండలి), డాక్టర్ గంగాధర్, డాక్టర్ రాంబాబు, అట్లాగే చంద్రశేఖర్ - వీరంతా గుంటూరు కేంద్రంగా విద్యార్థి సంఘం, రాడికల్ యువజన సంఘం తదితర విప్లవ ప్రజాసంఘాల్లో క్రియాశీలక నాయకులుగా పనిచేశారు. చంద్ర విద్యార్థి దశ నుంచే విప్లవ రాజకీయాలతో ప్రజల కోసం నిలబడినాడు.

అప్పట్లో ఆర్.ఎస్.యు., పి.డి.యస్.యు. విద్యార్థి సంఘాలు ప్రతి ఏడాది ఎండాకాలం సెలవల్లో 'విద్యార్థులారా గ్రామాలకు తరలండి' కార్యక్రమాన్ని

నిర్వహించేవి. గుంటూరు, నల్లపాడు పాలిటెక్నిక్, నాగార్జునా విశ్వవిద్యాలయం నుంచి పల్నాడు గ్రామాల దాకా సాగిన ఈ గ్రామాలకు తరలండి కార్యక్రమాల్లో నేనూ ఉండేవాడిని. అప్పట్నించే అట్లా వీరందరితో నాకు పరిచయా లయినాయి. కామ్రేడ్స్‌మయ్యాం.

పేదరికం, కరువు, నిరక్షరాస్యత, కుల వివక్షలు తాండవిస్తున్న పలనాటి నుంచి చంద్ర వచ్చాడు. బాధితులైన ప్రజల పట్ల బాధ్యత, పోరాట చైతన్యం, న్యాయవాదిగా, హక్కులు కోల్పోయిన వారి ప్రతినిధిగా జీవితకాలం స్ఫూర్తి దాయకమైన జీవితం జీవించాడు. ఇంతేకాదు చంద్ర చాలా సామాన్యమైన కుటుంబం నుంచి వచ్చాడు. పల్నాటి మాదిగ పల్లెలు, లంబాడి తండాలు, ఎరుకల కాలనీలు, తీరంలోని మాలపల్లెల ప్రజల కష్టసుఖాల పట్ల చంద్రకు సౌహార్ద్రతుంది. అవగాహనుంది. నేను బ్రాహ్మణ ఆధిపత్య వ్యతిరేకిని. కాని, చంద్ర ప్రజాస్వామ్యవాది. చంద్రకు వచ్చిన పేరు ప్రఖ్యాతులకు, అందిన సౌకర్యాలకు అతని కులం కూడా దోహదం చేసింది. ఐనప్పటికీ, చంద్ర బాధ్యతగా, సార్థకంగా జీవితాన్ని జీవించాడు.

నాగార్జునా విశ్వవిద్యాలయంలో దళితుల మీద కొనసాగుతున్న వివక్షలకు వ్యతిరేకంగా, 'దళితుడు వైస్ ఛాన్సలర్ కావాలి' అనే నినాదంతో దళిత వర్కర్స్, ఉద్యోగులు, విద్యార్థులు చారిత్రక ఉద్యమం చేశారు. ప్రొఫెసర్ సుబ్రహ్మణ్యం గారు ఈ ఉద్యమానికి నాయకత్వం వహించారు. నేనూ, డాక్టర్ కత్తి పద్మారావు, హేతుశ్రీ, శంబుక (మల్లేశ్వరరావు), మోహన్‌రెడ్డి, భీమ్రేడ్ మొదలైన వాళ్ళం ఈ ఉద్యమంలో పాల్గొన్నాము. ఈ సందర్భంగా ప్రొఫెసర్ సుబ్రహ్మణ్యం ఉద్యోగం నుంచి సస్పెండయ్యారు. ఉద్యమకారులపై పోలీసు నిర్బంధం అమలయ్యింది. కేసులయ్యాయి. ఈ పరిస్థితుల్లో వెలుపలి నుంచి న్యాయవాదులుగా చంద్ర, వైకె తదితరులు అందించిన న్యాయ సహకారం మరవలేనిది.

తుళ్ళూరు మండలం, మందడం గ్రామంలో ఇద్దరు ఎరుకలవారు హత్యకు గురైన సందర్భంలో వారి కుటుంబాలకు న్యాయం జరగాలని చేసిన పోరాటంలోగానీ, ఇంకా అనేక సందర్భాల్లో అధికారుల్లోని వ్యవస్థీకృత నేర చర్యలను నిర్భీతిగా ఖండించి, సాహసోపేతంగా ఎదుర్కొన్న హక్కుల హీరో చంద్ర.

మాదిగ హక్కుల దండోరా ఉద్యమంలో నేను కొన్నిసార్లు గుంటూరుకు వెళ్ళినప్పుడు నారాక తెలుసుకున్న చంద్ర వచ్చి కలిసేవాడు. నేనూ వెళ్ళి అతన్ని కలిసేవాడిని. మా కబుర్లు నిండా వ్యవస్థలు, ఉద్యమాలు, సంఘటనలు ఉండేవి. తను రాసిన, అనువాదం చేసిన వ్యాసాలు, పుస్తకాలు చదవమని ఇచ్చేవాడు. దోస్తవిస్కీ నేరమూ - శిక్షా, మయకోవిస్కీ లెనిన్ కావ్యం చదివావా? అని అడిగేవాడు. కొన్నిసార్లు శంకర్‌విలాస్ సెంటర్లో లంచ్‌కి వెళ్ళేవాళ్ళం. సందుల్లో కారాపి, రోడ్డు పక్కన తోపుడు బళ్ళమీద అప్పటికప్పుడు వేడిగా చేసే ఆహారపదార్థలను తినడానికి ఇష్టంగా తీసుకుపోయేవాడు.

చుండూరు దళితులపై ఊచకోతకేసులో ప్రత్యేక కోర్టు తీర్పు వచ్చిన కొద్దిరోజులకు హైదరాబాదు అన్వేషి మహిళా అధ్యయనాల పరిశోధనా కేంద్రం వారు ఈ తీర్పు మీద మాట్లాడటానికి ఏర్పాటు చేసిన సమావేశంలో చివరిసారిగా నేను చంద్రని కలిశాను. అంతకు మునుపు ఉస్మానియా క్యాంపస్‌లో ఉన్న అమెరికన్ లైబ్రరీకి అపుడపుడూ వచ్చి వెళ్తుండేవాడు. కొన్ని ఇలాంటి సందర్భాల్లోనూ కలిసేవాళ్ళం. సరే, అన్వేషిలో జరిగిన సమావేశంలో చుండూరు కేసు ప్రత్యేక కోర్టులో గెలుపుకోసం తాను ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా చేసిన కృషి గురించి, సాక్ష్యం చెప్పడానికి బాధితులకు నూరిపోసిన ధైర్యం గురించి, నేరస్థుల తాలూకు కులం వారి బెదిరింపుల గురించీ ఆ సమావేశంలో వివరంగా చెప్పాడు. పారిపోయిన నిందితులు అరెస్టులు కాకుండా, నిద్రలు పోకుండా మంచాల కింద దూరి, పశువుల కొట్టాల్లో నక్కి, పొలాల్లో, పొరుగు వూర్లలో దాక్కొని భయపడిన సంగతులు చంద్ర కథల్లాగ చెబుతుంటే ఆసక్తిగా, సరదాగా విన్నాం. నేరస్తులకు శిక్ష వేసినంత సంబరంగా ఉండింది. చంద్రకు బెదిరింపు కాల్స్ వచ్చాయని విని తీవ్రంగా కలత చెందినాం. ఏదేమైనా చుండూరు నరమేధం కేసులో ఎక్కువమంది 'రెడ్డి' నేరస్తులు తప్పించుకోవడానికి వీల్లేకుండా శిక్షలు పడటానికి కృషి చేసినందుకు చంద్రని అభినందించాం. మమ్మల్ని మేము అభినందించుకున్నాం. ఎందుకంటే, చుండూరు సంఘటన జరిగిన తొలినాళ్ళలో బాధితులకు న్యాయం జరగాలని గుంటూరు నగరం, జిల్లాలోనూ రాస్తారోకోలు, ఆందోళనలు నిర్వహించిన వారిలో నేనున్నాను. హైదరాబాదులోని అప్పటి అసెంబ్లీ స్పీకర్ ఆలపాటి ధర్మారావు నివాసం - ఇప్పటి సైఫాబాద్ పోలీసు

స్టేషన్ - ముందు రాస్తారోకో జరిపి పోలీసు లాఠీ దెబ్బలు తిన్నవారిలో నేనూ వున్నాను. అందుకనే ఇంకా సంతోషంతో చంద్రని అభినందించాను. ఈ న్యాయ పోరాటంలో చంద్ర ముందు భాగాన లేకపోతే, బాధితులకు ప్రత్యేక న్యాయస్థానంలో న్యాయం ఇంత బాగా జరగకపోయేదేమో!

చంద్ర సామ్రాజ్యవాదం, గ్లోబలైజేషన్ ప్రజలకు ప్రధాన శత్రువులని వాదించేవాడు. నేను విభేదించేవాణ్ని. గ్రామాల్లోని ఫ్యూడల్ కుల ఆర్థిక, రాజకీయ వ్యవస్థే ఇప్పటికీ ప్రధాన శత్రువని నేను వాదించేవాడిని. నేను గుంటూరు వెళ్ళినపుడు ఒకసారి నాదగ్గకు వచ్చి మీరు మాదిగ దండోరా ఉద్యమం మొదలు పెట్టి, మాకు పని తగ్గించారయా. ఇప్పుడు మా దగ్గరికెవరూ రావట్లేదు. అణగారిన కులాలన్నీ మిమ్మల్ని చూసి, ఇప్పుడు ఎవరికి వాళ్ళు, ఎక్కడికక్కడా మానవ హక్కుల కోసం పోరాడుతున్నారు. మొత్తం మీద మాకు పనిలేకుండా చేసేశారు. అని చంద్ర నవ్వుకుంటూ నాతో అన్నాడు.అణగారిన కులాల ఉద్యమ చైతన్యంలో మానవ హక్కుల విస్తృతిని గమనించిన చంద్రని హృదయపూర్వకంగా అభినందించాను.

పేదరికం, నిరక్షరాస్యత, కుల వివక్షత, అంచులకు తోసివేయ బడటం, అశక్తతకు గురిచేయబడటం, మానవ హక్కుల ఉల్లంఘనలు పెచ్చరిల్లిన మన సామాజిక, రాజకీయ వ్యవస్థలో విద్యార్థి, యువజనులు, ముఖ్యంగా న్యాయవాద వృత్తిలోనివారు చంద్రశేఖర్‌లో ఉన్న అశాంతి, అధ్యయనం, మెరుగైన సమాజం కోసం అన్వేషణ,కృషి తమలో నింపుకోవాలి. మానవ హక్కుల స్థాపన కోసం, బాధితులను మేల్కొలపడానికి, అవసరమైతే వారికి ప్రాతినిధ్యం వహించడానికి ఊరికో చంద్ర, కోర్టుకో చంద్ర తయారవ్వాలి. కోల్పోతున్న హక్కుల్ని తిరిగి నిలబెట్టుకోవడానికి ప్రతి వొక్కరు మానవ హక్కుల చంద్రశేఖరై గొంతు విప్పాలి. జీవితాన్ని చంద్రలా సార్థకం చేసుకోవాలి. యాంగ్రీ యంగ్ మాన్, మై డియర్ చంద్రా నీలి సలాములు.

రచయిత సెల్ : 9948311667



# 8. జైలు గోడల మీద మెరిసిన సరికొత్త స్వేచ్ఛాకిరణం

డాక్టర్ నూకతోటి రవికుమార్

బందిపోటు వెంకన్న గుండెల్లో దిగిన బుల్లెట్ కన్నీళ్లతో
సాక్ష్యం చెప్పటానికి మిమ్మల్ని వెతుక్కుంటోంది.
చుండూరు కాల్వల్లో తొక్కేయబడ్డ
దళిత వీరుల శవాల కనుగుడ్ల పాపల చూపులన్నీ
వాకిళ్లె మీరెపుడైనా తారసపడతారని ఎదురుచూస్తున్నాయి.
శాక్కో-వాంజెట్టి కాళ్లకు తెగిన సంకెళ్లు
మీ అక్షరాల స్పర్శ కోసం అలమటిస్తున్నాయి.
అప్పుడెప్పుడో ..చలపతీ, విజయవర్ధనాలు పోగొట్టుకున్న
అవమానాల ఆకలి రాత్రుళ్లు మీకోసం ఆకాశం కేసి చూస్తున్నాయి.
ఇప్పుడు .. జైలు గోడల మీద మెరుస్తున్న
ఒక కొత్త స్వేచ్ఛా కిరణం చంద్రశేఖర్
కులం గోడల మీద పేడ పూసి
రేపటి సరికొత్త ఉదయానికి భాష్యాలు రాసేవాళ్లు
స్వేచ్ఛా కాంక్షల విప్లవకారులేనని చాటిచెప్పినవాడవు.
భువనగిరి అగ్రహారాలు దాటుకుంటూ వచ్చిన జనం మనిషివి.
చట్టం అసలు గుట్టు తెలుసుకున్న ఆధునిక సూదంటురాయివి.
పల్లెల దు:ఖాన్ని చూసి
తెగిపడ్డ దళిత వీరుల మొండాలను చూసి
ఎన్జీవోలు కార్చే ప్లాస్టిక్ కన్నీళ్లకవతలి కుట్రని

విడమర్చి చెప్పినవాడివి.
ఒరే..నాయన్లారా...అతడ్ని బ్రాహ్మణుడని అవమానించకండి.
మట్టిని వెక్కిరించిన అగ్రహారీకుల వారసుడని
పదేపదే చాటింపేయకండి.
సైద్ధాంతిక గందరగోళం మాటున
పబ్బంగడుపుకోని స్వచ్ఛమైన కమ్యూనిస్టు అతడు
శతాబ్దాల వారసత్వంగా పల్లెల్లోకి వస్తున్న ఓటమిని
జీర్ణించుకోలేక స్పార్టకస్ జాడలు వెతుక్కున్న సత్యాన్వేషి.
చింతకీ, చేతనకీ మధ్య రంగులు పూసే
మెరమెచ్చుల వేషాలను దగ్ధం చేసిన నిక్కమైన అగ్నిహోత్రీకుడు.
చట్టం చుట్టూ కుబుసం విడవకుండా పడుకున్న
నాల్గుపడగల హైందవ నాగరాజు బొందిలోని
ప్రాణరహస్యం తెలిసిన బాలచంద్రుడివి.
బాధితులకు ఆసరా అయినవాడవు.
కోర్టు బోనుల మీద ఆరని నెత్తుటి మరకలను తుడుపుతూ నించుని నేల మీద
మానవీయ మొక్కలు నాటాలని తలపోసినవాడవు.
మాటకీ, నోటికీ మధ్య
అక్షరానికీ, ఆచరణకీ మధ్య,
గందరగోళం సృష్టిస్తున్న ప్రపంచీకరణ పెనుభూతాల ఆసరాని
ముగ్గు గీసి మరీ నిలబెట్టిన నవీన న్యాయ మాంత్రికుడు.
అతడు లేడనే మాటనే వినలేమంటూ
నల్లకోట్లు హక్కుల దిక్కరేడంటూ దిక్కులే విలపిస్తున్నాయి.
అతడు మళ్లీ ..రాడంటే ఉగ్గబట్టిన దు:ఖంతో
వందలాది చుండూర్లు చూరుకవతల పొయ్యిలు ఆరిపేసి
పస్తులు పడుకుంటున్నాయి.
బాలగోపాల్ సారూ..కన్నభిరాన్..ఎస్సార్ శంకరన్..
రాములు గారూ.. చంద్రశేఖరూ..
మీరంతా ఒక్కరొక్కరుగా వెళ్లిపోతుంటే..

హక్కుల పదానికి డిక్షనరీలో చిరునామానే లేకుండా పోతున్నది.
అమానవీయ లోకం మీద ముసిరిన పెనుభూత రాజ్యం
పల్లెల ఉనికి మీద పగబట్టి చూస్తున్నది
అత్యంతంగా అవసరమైన సందర్భంలోంచే
ఒక్కొరొక్కరుగా కనుమరుగవుతూంటే
కుంటినడక ప్రజాస్వామ్యం మీద
రాబందుల నయా సవారీ సజావుగా సాగిపోతూనే ఉంది.
... ... ...
మీకోసం విలపించటం అంటే
మరింతగా హక్కుల కోసం కలబడటం
మీ మాటల్లోకి మమ్మల్ని మేం పరావర్తనం చేసుకోవటం అంటే
మరింతగా జనం పోరాటాల్లో పదునెక్కటం.
హక్కుల వాక్యానికి విరామచిహ్నంగా
మిమ్మల్ని పరిగణించ కూడదంటేనే
మేం క్రియాశీల మనుషులుగా మరింతగా రాణించటం.
పల్లెలకు అచ్చమైన వారసులుగా కలిసుండటం.
పల్లె ఆత్మగౌరవం కోసం
క్రమశిక్షణతో ఇంతలింతలుగా పిడికిళ్లై కొత్తగా మొలకెత్తటం
........
మీరెప్పుడైనా
ముసిరిన తుఫాను మధ్య మెరిసే దీపఖడ్గాన్ని చూశారా ?
ముసురుకున్న పస్తుల మాటున ప్రాణం నిలబెట్టిన
రుచికరమైన మాడుచెక్కల జ్ఞాపకాన్ని వడపోసుకున్నారా ?
ఆ దీప ఖడ్గం, అవనతం కాని ఆ..హక్కుల పత్ర హరితం
భువనగిరి  చంద్రశేఖర్..లాల్‌సలామ్  ..లాల్‌సలామ్

రచయిత సెల్ : 9848187416



## 9. చంద్రశేఖర్ కోసం

**సజ్జా వెంకటేశ్వర్లు,** చేనేత కార్మికుడు

చేనేత కార్మికుడు
విద్యార్థి ఉద్యమాలలో
పల్లెల సిగలో విరిసిన మంకెనపువ్వు!
అతనొక న్యాయవాదిగా బయలుదేరి
న్యాయమూర్తులను ప్రభావితం చేసిన "నల్ల" కోటు!
ఎల్లలు దాటిన సత్యాన్వేషణలో
శాక్కో - వాంజెట్టిలను నెత్తికెత్తుకున్న
అరుదైన నవలా కారుడు!
కారంచేడు కండకావరానికి
కన్నీరు కార్చిన కరుణామయుడు!
చుండూరు మారణకాండలో
దళిత జన రక్తక్షేత్రానికి కోర్టునుతెచ్చి
పిడుగుల జడివానై సంచరించిన బుద్ధిశాలి!
విజయవర్ధన చలపతులకు
ఊపిరి నిలిపిన సౌజన్యారావు!
ఆల్ ఎన్‌కౌంటర్స్ ఆర్
పోలీసు మర్డర్స్ అని నమ్మినవాడు!
బూటకపు ఎన్‌కౌంటర్ల బండారాల్ని
కోర్టు గుమ్మాల కెండగట్టిన పల్నాడుబిడ్డ!
అతనొక అలుపెరుగని

హక్కుల ఉద్యమ సైనికుడు!
న్యాయపోరాటాల చరిత్రలో నిరంతరం
జ్వలించే చెరగని సంతకం చంద్రశేఖర్!

ఐదు పదుల జీవితమైనా నిండని భువనగిరి చంద్రశేఖర్‌ను గురించి ఇలా మనం అడ్రస్ చేస్తూ రాయాల్సినరోజు రావటం... కాలం కన్నీళ్ళతోనైనా తీర్చుకోలేని రుణం. చుండూరుకేసు నెగ్గిన ఆనందం ఒకపక్క, బూటకపు ఎన్‌కౌంటర్లను కోర్టులలో నిరూపించిన విజయ గర్వం పంచుకున్న క్షణాలు కరిగిపోక ముందే ఇలా మనందర్ని వదిలి వెళ్ళిపోవటం నిజంగా విషాదం.

సరిగ్గా రెండు సంవత్సరాలకు ముందు మా అమ్మకు గుండె జబ్బు చేసింది. చీరాల వైద్యనిపుణులు చేతులెత్తేస్తే, ఏం చెయ్యాలో పాలుపోక ఆరోగ్యశ్రీ కార్డు చేతిలో పెట్టుకొని గుంటూరు లలితా సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌లో అమ్మను చేర్చాను. వెంట తీసుకెళ్ళిన డబ్బు అనేక రూపాల్లో సగం కరిగిపోతే, రెండో రోజు డాక్టరు పిలిచి మీ అమ్మకు ఆరోగ్యశ్రీ వర్తించదు. కనుక వైద్యానికయ్యే ఖర్చు మీరే భరించగలరా? అంటూ సెలవిచ్చారు. ఆరోగ్యశ్రీ ఆదుకుంటుందని ఆశపడితే ఇలా తిరిగి సమస్య ఎదురుకావడం ఊపిరి ఆడలేదు. లోపల ఐ.సి.లో అమ్మ నెప్పి తగ్గినట్టుగాచెప్పింది. ఖరీదైన వైద్యం ముందు పేదవాళ్ళ ప్రాణాలు ఒక లెక్క కుదరని అంశమే. కళ్ళముందు వచ్చేరోగులు - వెళ్ళిపోయే రోగులు. యిన్ పేషంట్ల కోసం కాచుకొని ఉండే వారి కుటుంబ సభ్యులు. నేనూ ఈ వాతావరణంలోకి చేరి అప్పుడే రెండ్రోజులు గడిచింది. మళ్ళీ డాక్టరు పిలిచి మీ అమ్మ ఆరోగ్యం కుదట పడుతుందని చెప్పారు. అదో సంతోషం కలిగిన విషయం. నిద్రలేదు. స్నానాలు లేవు. వేళకు భోజనం లేదు. అప్పుడు గుంటూరులో ఉండే మిత్రులెందరో గుర్తుకొచ్చారు. అయినా ఎవరి సాయం పొందాలనిపించలేదు. ఓపిగ్గా ఒంటరిగానే అమ్మకు పూర్తి వైద్యం చేయించుకొని తిరిగి వెళ్ళాలనిపించింది. అందుకే ఎవరికీ ఫోన్స్ చెయ్యలేదు.

మూడో రోజు సాయంత్రం హాస్పిటల్ ముందు తోటిరోగుల బంధువులతో మాట్లాడుతున్నాను. ఎవరో వెనక నుంచి వచ్చి, భుజం మీద చెయ్యివేసి - ఏం సజ్జా ఇక్కడున్నావ్? అనే చంద్రశేఖర్ ఆత్మీయ పలకరింపు. ఆ మాటలకి అతనికెళ్ళి చూస్తూనే ఏడ్చేశాను. నా గుండెల్లో అప్పటి వరకు ఉన్న ఒంటరి

తనపు బాధ తొలిగి పోయేంత వరకు ఏడ్చేశాను. అతని ఓదార్పు తర్వాత లోపల అమ్మ ఉందని చెప్పాను. ఐ.సి. వార్డులో ఉందని చెప్పాను. రెండ్రోజులుగా ఇక్కడ చేరాం. ఈ రోజు మూడోరోజు అన్నాను. ఆ మాటకు చంద్రకు కోపం వచ్చింది. మా గుంటూరు వచ్చి, ఇలా ఒంటరిగా ఇబ్బందులు పడుతూ ఒక్క ఫోన్ కూడా చెయ్యాలనిపించనందుకు బాధగా ఉందన్నాడు. ముందు అమ్మను చూసివద్దాం. మిగతా విషయాలు అన్నీ తరువాత మాట్లాడుదాంపదా అన్నాడు. ఐ.సి. లో ఉన్న మా అమ్మతో మాట్లాడుతూ, గుర్తుపట్టలేదా అమ్మ నేనూ మీ యింటి కొచ్చాను. నువ్వు నాకు ఆవిరి పకోడీలు వండి పెట్టావ్ అన్నాడు. బెడ్‌మీద నుంచి లేచి అమ్మ చంద్ర వంక తేరిపార చూసి నవ్వింది. నాకెళ్ళి చూస్తూ అమ్మకళ్ళ నీళ్ళు పెట్టుకుంది. చంద్రశేఖర్ అప్పుడు చూపిన ప్రేమ ఎన్నటికీ మర్చిపోలేను. అమ్మతో మరికొంతసేపు గడిపే అవకాశం లేక మళ్ళీ వస్తానని బయటికి అతనితో పాటు నేనూ వచ్చేశాను. యోగక్షేమాల సంభాషణ మరో అరగంటతో ముగిసింది.

మరుసటి రోజు సాయంత్రం మళ్ళీ చంద్రశేఖర్ వచ్చాడు. వస్తూనే జేబులోంచి డబ్బుతీసి బలవంతంగా నా జేబులో పెట్టాడు. అమ్మను బతికించుకుందాం. అవసరమైతే మొహమాటం వద్దు.ఇంకా ఏవేవో అలాంటి మాటలే చెప్పాడు. మళ్ళీలోపలికెళ్ళి అమ్మను పలకరించటం. మరొ అరగంట గడిపి వెళ్ళపోయాడు. మరో రెండు రోజులు ఫోన్‌లోనే పలకరించాడు. పని ఒత్తిడివల్ల కలవలేక పోతున్నానని చెప్పాడు. అమ్మ ఆరోగ్యం కుదుటపడింది. గుంటూరు నుండి ఆరో రోజు తిరిగి బయలుదేరాం. అలా చంద్రశేఖర్ సాయం ఓదార్పు ఆ సందర్భంలో లభించాయి.

చంద్రశేఖర్‌తో పరిచయమైంది అతను ఆర్‌ఎస్‌యులో విద్యార్థి నాయకుడుగా ఉండగానే. చీరాల ప్రాంతంలో ఉపన్యాసాలివ్వడానికి వచ్చాడు. అప్పటికే నేను విరసం సభ్యుడను. కొంచెం పెద్దవాణ్ణి కావటం మూలంగా ముభావంగా మాట్లాడాడు. సభా వేదిక మీద అప్పటి విరసం నాయకులున్నారు. అందరిలోనూ చంద్రనే చిన్నవయసు ఉపన్యాసకుడు, అయినా, అతని ఉపన్యాస ధోరణి అందరికన్నా చాలా మిన్నగానూ, చెప్పే విధానం రాజకీయాలు తెలియని వారిని సైతం ఆకర్షించింది. అందులో అతని రూపం - ఆకర్షించే కంఠ స్వరం

అందర్నీ కట్టి పడేసింది. ఉపన్యాసకుడిగా జనం చేత ఎక్కువ మార్కులు పొందాడు. అలా విద్యార్థి ఉద్యమాల్లో నుంచి ప్రయాణం సాగిస్తూ, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలో కనిపించాడు. బహుశ తన "లా" చదువు పూర్తి అయ్యి వచ్చాడనుకుంటాను.

మళ్ళీ చంద్రశేఖర్ శాక్కో - వాంజెట్టిలకు సంబంధించిన రచన చేస్తూ వచ్చాడు. నిజానికి చాలామందికి, ఆ ఇద్దరి కేసు ఫైళ్ళు ఆధారంగా సాగించినట్టు అనిపించినా అది పాక్షిక సత్యమే. చంద్రశేఖర్ ఆ ఫైళ్ళుతో తన అధ్యయనం అమెరికన్ రాజ్యస్వభావం వైపు మళ్ళింది. అది తెలుసుకోవాలనే తలంపు తృష్ణ మళ్ళీ వేటపాలెం వంటి పురాతన గ్రంథాలయాలవైపు సాగింది. చాలా వాటిని పరిశీలించాడు. ముందు తను నమ్మిన సిద్ధాంతాలు అధ్యయనంలోంచి మిగతావాటిని లెక్కలు కట్టి, శాక్కో- వాంజెట్టిల కు ఒక సజీవ రూపంలో నవలా రచన చేశాడు. తన కమిట్‌మెంట్ ఏమిటో ఆ నవలా వస్తువు ద్వారానే చంద్రశేఖర్ చెప్పకనే చెప్పాడు. ఆ తరువాతనే చలపతి - విజయవర్ధనంల ఎజెండా వచ్చింది.

శాక్కో - వాంజెట్టి రచన ద్వారా పొందిన పరిపక్వత ఈ ఇద్దరి కేసు విషయంలో మరింత పదును తేలింది. విజయవర్ధనం - చలపతిల ఉరిశిక్ష రద్దుకోసం ఆంధ్రరాష్ట్రమంతటా కాలికి బలపం కట్టుకు తిరిగాడు. రాష్ట్రపతికి పోస్టుకార్డు ఉద్యమం నడిపాడు. తను బయలు దేరినప్పుడున్న ప్రతికూల పరిస్థితులను అద్భుత విశ్లేషణల ద్వారా అనుకూల వాతావరణంగా మార్చగలిగాడు. అప్పుడు తను పనిచేస్తున్న ఎపిసిఎల్‌సికి చంద్రశేఖర్ పూనిక ద్వారా మంచిపేరు తెచ్చాడు. చలపతి విజయవర్ధనంల ఉరిశిక్ష రద్దు అయ్యింది. వాళ్ళిద్దరూ ఇవాళ చంద్రశేఖర్ మరణాన్ని ఎలా జీర్ణించుకోగలిగారో? ఎక్కడ వారి స్పందన రాలేదు.

అలాగే కారంచేడు కేసులో మొదటినుండి దళితుల పక్షాన నడిచిన తీరు ఎంతో ప్రశంసనీయం. చుండూరు కేసును సంఘటన జరిగిన చోటనే "కోర్టు"ను ఏర్పాటు చేయటంలోనూ, అగ్రవర్ణంలో పుట్టినా, అట్టడుగు ప్రజల న్యాయ పోరాటాలకు తను ఊపిరిగా చివరి వరకు నిలిచి గెలిచాడు. ఇలాంటి అరుదైన వ్యక్తిత్వంగల చంద్రశేఖర్‌కూ కొన్ని బలహీనతలూ ఉన్నాయి.

నాకు మొదట కనిపించిన చంద్రశేఖర్ విద్యార్థిగా ఏ చెడు అలవాటు లేని వ్యక్తిగానే పరిచయం. హక్కుల నేతగా ఎదిగాక శాక్కొ - వాంజెట్టి రచన చేసేనాటికే పాన్ మసాల - సిగరెట్‌తో చూశాను. చాలా బలంగా వాటిని వినియోగించాడు. పర్సనల్ అంటూ ఇలా మత్తుకు లోనుకావటం వల్లనే ఇవాళ చంద్రశేఖర్ మన అందర్నీ విషాదంలో వదిలి వెళ్ళిపోయాడు.

కొన్ని బలహీనతలకి బానిసలై, అనారోగ్యంపాలై ఒక్కొక్కరు అకాల మృతి చెందటం నిజంగా పూడ్చలేనిలోటు. మద్దూరి నగేష్‌బాబు ఇలానే వెళ్ళిపోతే వాళ్ళ అమ్మ ఎంత బాధపడిందో చూశాం. ఆ తల్లి మాటలే హెచ్చరిక మనందరికి. చంద్రశేఖర్ స్మృతిలో ఈ ప్రతిన పూని నడుద్దాం. మన మేధాశక్తులను కాపాడుకుందాం. అదే నిజమైన నివాళి.

రచయిత సెల్ : 9951169967



# 10. నిరంతర చింతనాశీలి చంద్ర...

**ప్రొ.బి.తిరుపతిరావు,** ఇంగ్లీషు డిపార్ట్‌మెంట్, ద్రవిడియన్ యూనివర్శిటీ, కుప్పం

నక్సల్‌బరీ, శ్రీకాకుళం సృష్టించిన యువ మేధావుల్లో బి. చంద్రశేఖర్ అయిదుపదులు నిండకుండానే అర్ధంతరంగా జీవితాన్ని చాలించినవాడు. చంద్ర తెలుగు సమాజంపై మూడు దశాబ్దాలపాటు తనదైన ముద్రవేశాడు. 1980లలో రాడికల్ విద్యార్థి సంఘంలో క్రియాశీలక సభ్యుడుగా మొదలైన తన రాజకీయ జీవితం చనిపోయేంతవరకు చాలా చురుకుగా సాగింది. తను ఎప్పటికీ ఏ విషయాన్ని నమ్ముతాడో అప్పటికి ఆ విషయానికి సంబంధించి పూర్తిస్థాయి జ్ఞానంతో ఆచరణలోకి దిగేవాడు. 1980లలో విద్యార్థుల సమస్యలకోసం నడిచిన ఉద్యమాలనుంచి నిన్న మొన్నటి వరకు చుండూరు హత్యాకాండకు సంబంధించిన నిందితులకు శిక్షలు పడేంతవరకు తను చేసిన పోరాటం వరకు అన్నింటిలోనూ ఈ నిబద్ధత చంద్రలో కనిపిస్తుంది. నిబద్ధత, నిజాయితీ ఈ రెండు అంశాలు చంద్ర వ్యక్తిత్వంలో విడదీయరాని అంశాలు. వ్యక్తులు ఏ అవకాశాలు రాకా నిజాయితీగా మిగలటంలేదు. అన్ని అవకాశాలు ఉండి ఎటువంటి ప్రలోభాలకు లొంగకుండా నిజాయితీగా నిలబడగలగటం వేరు. చంద్ర ఈ రెండవ కోవకు చెందుతాడు. అభిప్రాయాలు లేక భావాలు చంద్ర విషయంలో చాలా సందర్భాలలో విశ్వాసాలుగా మారిపోయేవి. విశ్వాసంలో ఉన్న వ్యక్తి తను నమ్మిన విషయం కోసం ప్రాణంతో సహా దేన్నీ లెక్కచేయకుండా పనిచేస్తాడు. చంద్ర పనిచేసిన విద్యార్థి ఉద్యమాలుకానీ, పౌర హక్కుల ఉద్యమాలుకానీ, చుండూరు కేసు విషయంలోకానీ, చలపతి, విజయవర్ధన్‌ల కేసు విషయంలో కానీ, ప్రసన్న లక్ష్మి కేసు విషయంలోకానీ చంద్రలో ఈ నిర్భీతి చాలా ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. గత మూడు దశాబ్దాల కాలంలో తెలుగు

సమాజంలో జరిగిన అన్ని కీలక ఉద్యమాలతో చంద్రకు సంబంధం ఉంది. కొన్ని సంఘటనలలో తానే ముందుండి పనిచేశారు.

ఉద్యమాలలో పనిచేసే కార్యకర్తలకు అధ్యయనానికి సమయం అంతగా దొరకదు. కానీ చంద్ర పనిగట్టుకొని సమయాన్ని దొరక బుచ్చుకొని నిరంతరం అధ్యయనం చేస్తూ ఉండేవాడు. అధ్యయనం ఆగిపోయిన వ్యక్తుల్లో ఆలోచనలు కూడా ఆగిపోయి మొదలైన దగ్గరకే ఎటువంటి మార్పులేకుండా మిగిలిపోతారు. చంద్ర ఇందుకు పూర్తి విరుద్ధం. విద్యార్థి ఉద్యమాలలో ఉద్రేకపూరిత ప్రసంగాలు చేసిన చంద్రకు, 2000 సం॥ నుండి తెలుగు సమాజంలో ప్రముఖ సామాజిక శాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్ భావాలను గురించి రాస్తున్న చంద్రకు మధ్య వచ్చిన మార్పును చూస్తే అతని అధ్యయనం ఏస్థాయిలో ఉందో తెలుస్తుంది. ఒకానొక సాంప్రదాయేతర ధోరణి చంద్ర మూర్తిమత్వంలో భాగమయ్యింది. అందువల్ల చంద్ర చాలా విషయాలలో తన చుట్టూ ఉన్న వాళ్ళకు భిన్నంగా ఆలోచించేవాడు. ఈ విభిన్న లక్షణం తాను ఉరిశిక్షకు వ్యతిరేకంగా నడిపిన ఉద్యమంలోనూ, శాక్కో-వాంజెట్టి గురించి రాయటంలోనూ, సమాజంలో ఎక్కువ భాగం వ్యక్తులు డబ్బులు వెంట పడిపోతూ వుంటే తను పుస్తకాల వెంట, ప్రకృతి వెంట పడిపోవటంలోనూ చూడవచ్చు. రెండు దశాబ్దాలకుపైగా క్షణం తీరిక లేకుండా న్యాయవాద వృత్తిలో గడిపిన వ్యక్తి చంద్ర. తన ప్రాక్టీసులో ఎక్కువభాగం సమయాన్ని దళితులకోసం, పీడితుల కోసం వెచ్చించాడు. చుండూరు కేసులో విజయంసాధించేందుకు వేలకొద్ది పేజీలు నోట్స్ రాసుకున్నాడు. వందలకొద్ది పుస్తకాలు తిరగవేశాడు.

1995 నుండి చంద్రకు ఆధునికతపట్ల మౌలిక ప్రశ్నలు మొదలయ్యాయి. ఆధునికతలో మనుషులు వ్యక్తులుగా దిగజారి పోవటాన్ని, డబ్బే అన్ని విలువల్ని నిర్దేశించటాన్ని చంద్ర భరించలేక పోయాడు. ఆధునికతలో భాగంగానూ, ఆధునికతను మరింత వేగవంతం చేసే లక్ష్యంతోనే మార్క్సిస్టు, కమ్యూనిస్టు పార్టీలు వాటి ఉద్యమాలు నడుస్తున్నాయని నమ్మాడు. ఈ నమ్మకంలోంచి మార్క్సిజాన్ని సంశయించినప్పటికీ Early Marx రచనల పట్ల ముఖ్యంగా Economic and Philosophical Manuscripts లో కనిపించే మార్క్స్ పట్ల చంద్రకు ప్రగాఢ నమ్మకం ఉండేది. Later Marx రచనలలో, హింస, ప్రకృతిమీద ఆధిపత్యం నెలకొల్పే లక్షణం చాలా ప్రస్ఫుటంగా కనిపిస్తాయని చంద్ర నమ్మాడు.

ఆంధ్ర దేశంలో  ఇంకా అధికారపు రుచి నామమాత్రంగా కూడా చవిచూడని కమ్యూనిస్టు పార్టీలు ముఖ్యంగా మార్క్సిస్టు, లెనినిస్టు పార్టీలు ఇప్పటికే రాజ్యానికుండే అన్ని అవలక్షణాలను సంతరించుకున్నాయని భావించాడు. ఆ క్రమంలో క్రమంగా కమ్యూనిస్టు పార్టీల ఉద్యమాలకు దూరమైనా, పౌరహక్కుల ఉద్యమంతో ముఖ్యంగా ఏ.పి.సి.ఎల్.సి. కార్యకలాపాలలో గుంటూరు జిల్లాలో చాలా విస్తృతంగా పనిచేశాడు.  జిల్లా మారుమూల ప్రాంతాలకు కూడా వెళ్ళి బూటకపు ఎన్‌కౌంటర్లను బహిర్గతం చేశాడు. ఆచరణాత్మక క్రమంలోనే తాను అధ్యయనం చేస్తున్న అరాచకవాద సిద్ధాంత సంబంధ పుస్తకాలు తనను ప్రభావితం చేసాయి. శాక్కో - వాంజెట్టి పుస్తకం రాయడం వల్ల ఈ భావాలు ఒక రకమైన స్పష్టతను తనకు కలిగించాయి. శాక్కో - వాంజెట్టి పుస్తకం మొత్తం అమెరికా న్యాయవ్యవస్థను బహిర్గతం చేసే పుస్తకం. హక్కుల విషయంలో మిగతా సమాజాలకంటే ఎంతో ముందున్నట్లు ప్రచారం చేసుకునే అమెరికా స్వరూప స్వభావాలను తేటతెల్లంచేసే పుస్తకం. ఎప్పుడో అమెరికన్ సమాజంలో జరిగిన ఒక సంఘటనను మన సమాజానికి పూర్తి స్థాయిలో వివరించ గలగటం, ఆ క్రమంలో అమెరికన్ సమాజంలోని కుతంత్రాలను వెల్లడించగలగటం అంత సులువు కాదు. చంద్ర ఆపనిని చాలా సునాయసంగా చేశాడు. వేలకొద్ది పేజీలు ఆ పుస్తకం రాయటంకోసం చంద్ర చదివాడు. తను చేస్తూ ఉన్న అధ్యయనం, తనని, తనతోపాటు ఉన్న కొంతమంది మిత్రులను, హక్కుల తాత్వికత గురించి లోతుగా ఆలోచించేటట్లు చేయడం జరిగింది. ఈ స్పృహతో తన మిత్రులతో కలిసి ఏ.పి.సి.ఎల్.సి.కి వెలుపల Human Rights Forum ఏర్పాటు చేయడానికి దారితీసింది. దాంట్లో పనిచేసే క్రమంలో చంద్ర ఆలోచనలలో మౌలిక మార్పులు చోటు చేసుకోవటం మొదలయ్యింది. మన సమాజంలో హక్కులుగా ప్రచారంలో వున్నవాటికి ప్రేరణగావున్న పాశ్చాత్య ప్రపంచపు వికాస యుగ (Age of Enlightenment) ఆలోచనల గురించి తను లోతుగా ఆలోచించటం ప్రారంభించాడు. గ్రాంసీతో మొదలుపెట్టి, ఆ తరువాత తను చదువుతూ వచ్చిన ఆధునికాంతరవాద తాత్వికుల ఆలోచనలు తన భావాల్లో ఒకానొక  Paradigm Shift కు దారితీశాయి. హక్కుల గురించిన దేశీయ పునాదులు గురించి, మన సమాజపు గతాన్ని గురించి మరింత లోతుగా ఆలోచించటం మొదలైంది. ఈ అధ్యయనం మన దేశంలో పనిచేస్తువున్న ఎన్జీవోల లక్ష్యాల పైకి కూడా నడిచింది. మన దేశంలో ఎన్జీవోలు పాశ్చాత్య ప్రపంచపు పథకాలను లక్ష్యాలను  దేశీయంచే

ఆమోదింప జేసేందుకు పనిచేస్తున్నాయనీ, అందుకే వాటికి Ford Foundation లాంటి సంస్థల నుంచి నిధులు అందుతున్నాయని తను చాలా స్పష్టంగా గ్రహించాడు. ఆ గ్రహింపులోంచి 'ఎన్జీవోల కథ' పుస్తకంరాశాడు. World Social Forum కి సంబంధించిన మీటింగులు మన రాష్ట్రంలో జరుగుతున్నప్పుడు కూడా చంద్ర ఆ కార్యకలాపాలతో విభేదించి దూరంగా ఉన్నాడు. అయితే జిల్లాలో ఎన్‌కౌంటర్లకు, పోలీస్ అణచివేతకు వ్యతిరేకంగా జరుగుతూవున్న కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొన్నాడు.

2005వ సం॥ నుంచి చంద్ర దేశీయమైన తాత్విక సిద్ధాంతాల గురించి చదవటం మొదలు పెట్టాడు. ఆ చదువు వల్ల తను అంతకు ముందు నమ్ముతూవచ్చిన భావాల్లో కొంతసడలింపు కనిపించింది. 2010 నాటికి ఈ సడలింపు తీవ్రస్థాయికి చేరి కొన్ని సంప్రదాయిక భావాల్ని విశ్వసించడం, ఆచరించడం కూడా చేస్తూ ఉన్నాడు. అయితే ఏ విషయమూ ఎవర్నించి దాచలేదు. తను నమ్మినదానినే ఆచరిస్తూ జీవిస్తూ వచ్చాడు.

తను మరణించటానికి ముందు ఆరేడు సంవత్సరాలుగా చంద్ర ప్రముఖ పోలిష్ సామాజికశాస్త్రవేత్త జిగ్మంట్ బౌమన్ రచనలను విస్తృతంగా చదువుతూ వచ్చాడు. ఆధునికత మీద బౌమన్ చేసిన విశ్లేషణలు చంద్రను విశేషంగా ఆకర్షించాయి. వర్తమాన సమాజంలో వ్యక్తులు, సామూహికత నుంచి దూరమై కేవలం వినిమయదారులుగా మారటాన్ని వస్తు వినిమయంలో మాత్రమే వ్యక్తులు గుర్తింపును తెచ్చుకునే ప్రయత్నం చేయటాన్ని గురించి బౌమన్ చేసిన విశ్లేషణలు చంద్రలో విశేషమైన ఉత్సాహాన్ని నింపాయి. ఆ ఉత్సాహంలోనుంచి బౌమన్ గురించి ఒక పుస్తకం రాయాలని ఆలోచించాడు. అలాగే గురజాడను పునర్మూల్యాంకనం చేస్తూ మరొక పుస్తకంరాయాలని ఆలోచించాడు. అవన్నీ పూర్తిచేయకుండానే అర్థంతరంగా క్యాన్సర్ రక్కసి తన జీవితాన్ని మింగేసింది. జీవించి ఉన్నట్లయితే తెలుగు సమాజానికి చంద్ర చెప్పాల్సిన, చెప్పగలిగిన విషయాలు చాలా ఉన్నాయి. అతని మరణం, సమాజానికి మాత్రమే లోటుకాదు. అది అతని మిత్రుల జీవితాల్లో ఒకానొక అగాధాన్ని ఏర్పర్చింది. అతను రాయదలుచుకున్న వాటిని రాసి అతని ఆలోచనలకు రూపం ఇవ్వటమే మిత్రులుగా మనం చేయగలిగింది.

రచయిత సెల్ : 9440408982

# 11. నిత్యాన్వేషి

**ప్రొఫెసర్ జి. హరగోపాల్,** తెలుగు : కలేకూరి ప్రసాద్

గుంటూరు చంద్రశేఖర్ (చాలా మంది స్నేహితులు, ప్రేమగా చంద్ర అని పిలుచు కుంటారు) అతి చిన్న వయసులో జీవితం నుండి నిష్క్రమించాడు. నిమ్స్ ఆవరణలో గుమిగూడిన ఎంతో మంది చంద్ర కార్యక్రమాలు, వాదనలు, గుణగణాల్ని చర్చించుకున్నారు.ఆయన తపనంతా జీవిత సారాంశాన్ని కనుగొనడం. అందుకోసమే నిరంతర అధ్యయనశీలిగా పెనుగులాడాడు. ఆయన తత్వశాస్త్రాన్ని అధ్యయనం చేశాడు. సాహిత్యాన్ని అధ్యయనంచేశాడు. న్యాయశాస్త్ర గ్రంధాలను అధ్యయనం చేశాడు. అతని మెదడు నిరంతరం అన్వేషణలోనే ఉండేదేతప్ప ఏనాడూ విరామం ఎరుగదు. ఎప్పుడూ ఏదోఒక ప్రశ్నచుట్టూ దానికి జవాబులు వెదుకుతూ వుండేవాడు. అంతేకాక తన మిత్రులను కూడా ఆ ప్రశ్నవైపుకు లాక్కొచ్చేవాడు.

అతనితో జరిగిన సుదీర్ఘమైన చర్చల్లో ఒకసారి నేను చాలా అలిసిపోయి విసిగిపోయినట్లుగా అనిపించి ఇక చర్చ చాల్లే అన్నాను. నేను ఒక సూత్రీకరణ చేస్తాను. ప్రపంచం ఎంతో నిర్ధిష్టమైనది. దానిచుట్టూ ఉన్న జనాంగమంతా ఎన్నో బాధల్ని అనుభవిస్తున్నారు. ఆ బాధల్ని తొలగించటానికి మనం ఏదో ఒకటి చేయాలి. ఎవ్వరైనా సరే ఏదైనా విషయం ముందుకు వస్తే దానికి వెన్ను చూపి పారిపోకూడదు అనే వాడు. చంద్ర ఊహావాదికాదు. అతను పనిచేస్తున్నప్పుడు నేను దగ్గరగా చూశాను. ఎంతో కష్టపడేవాడు. తను ఇది న్యాయమైంది అని నమ్మితే దానికోసం ఎన్ని కష్టాలైనా భరించేవాడు.

చిలకలూరిపేట బస్సు దహనం కేసులో ఉరిశిక్షపడిన ఇద్దరు దళిత యువకులకు మరణశిక్షనుతప్పించటానికి చంద్ర ఎంత అవిశ్రాంతంగా, రాజీలేని

పోరాటం చేశాడో నాకు తెలుసు. అతను విశ్రాంతి తీసుకోక, మాలో ఎవరినీ విశ్రమించనియ్యక అతను నడిపిన ఒక అరుదైన కేసు ఇది. దీనికి సంబంధించి అవసరమైన ప్రతి వ్యక్తిని నేను కలిశాను. మేము ఢిల్లీలోని కన్నాట్ ప్లేస్‌లో ప్రతి వ్యక్తిని కలుస్తున్న సమయంలో అతను మాట్లాడిన మాటలు ఇంకా గుర్తున్నాయి. అప్పుడు చంద్ర సహాయంకోసం రోడ్డుప్రక్క జ్యోతిష్కున్ని సంప్రదించ వలసిందిగా సలహా ఇచ్చాడు. ఇది పెద్ద పిచ్చిపని అని నేను అంటుండగా ఢిల్లీలోని ఎంతోమంది వి.ఐ.పి.లు ఈ జ్యోతిష్కుడు దగ్గరకు వచ్చి జాతకాలు చూపించుకుంటారని వారిలో ఎవరో ఒకరు మనకు ఉపయోగపడగలిగినవారు ఈ జ్యోతిష్కుడిద్వారా పరిచయం కావచ్చునని వ్యాఖ్యానించాడు.

అతని తపన చూసి నేను ఎంతగానో ఆశ్చర్యపోయాను. అదేవిధంగా చుండూరు ఊచకోత కేసులోనూ ఎంతో తపన పడ్డాడు. తమ కేసును చంద్రశేఖరే వాదించాలని చుండూరు దళితులు ఏకగ్రీవంగా నిర్ణయించుకోవడం అనేది ఎంతో గొప్పవిషయం. అది అతని కులం నేపథ్యాన్ని చూసి మాత్రం కాదు. ఇది అటు చంద్రశేఖర్‌కి పౌర హక్కుల ఉద్యమానికికూడా ఎంతో గౌరవాన్ని తెచ్చిపెట్టాయి. మహాశక్తివంతమైన కులానికి చెందినవారికి వ్యతిరేకంగా నడిచిన ఈ కేసులో విజయం సాధించడం అనేది చాలా అరుదైన విషయం. ఇది చంద్ర పనిచేసే తీరు. జీవితం యొక్క ముఖ్యమైన అంశాలన్నింటిలోనూ ఇదే విధంగా ఆయన ఉన్నాడు.

ఎంతోమంది తన వయసు యువకుల్లాగానే చంద్రశేఖర్ తన కాలేజీ రోజుల్లో రాడికల్ రాజకీయాలవైపు ఆకర్షితుడయ్యాడు. అతను రాడికల్ విద్యార్థి సంఘం (ప్రస్తుతం నిషేధించబడిన విద్యార్థి సంఘం) సభ్యుడిగా వుండేవాడు. ప్రముఖ మావోయిస్టు నేత ఆర్కేకు మంచి స్నేహితుడు. చంద్ర ఆర్కేతో తనకున్న సాన్నిహిత్యాన్ని గురించి, అతనితో జరిపిన సంభాషణలనుగురించి ఎప్పుడూ గుర్తుచేసుకునే వాడు. అంతేకాకుండా వరవరరావు మొదలైన వారితో నడిచిన రాజకీయ శిక్షణా తరగతులను గురించి కూడా చెప్పేవాడు.ఆ తర్వాత చంద్ర ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం సభ్యుడుగానూ, అనంతరం గుంటూరుజిల్లా కార్యదర్శిగానూ పనిచేశాడు. వాస్తవానికి గుంటూరుజిల్లా శాఖ ఎంతో చురుకైనది. అది పౌరహక్కుల ఉద్యమం పరిథులను దాటి పనిచేసింది. గుంటూరుశాఖ

ఎంత చురుకుగా పనిచేసిందంటే జిల్లాలోని బాధితులందరూ తమకే సమస్య వచ్చినా పౌరహక్కుల సంఘం జిల్లా శాఖ దగ్గరకు పరిగెత్తుకు వెళ్ళేవారు. ఆశాఖ ఎంత చురుగ్గా పనిచేస్తుండటంవలన పోలీసుల దృష్టి దానిపైన పడింది. అంతేగాకుండా సంఘసభ్యులను పోలీసులు లక్ష్యంగా ఎంచుకోవడానికి కారణమైంది. ఎన్నో సార్లు ఉద్రిక్తపరిస్థితులు నెలకొన్నాయి. సంఘసభ్యుల క్షేమాన్నిగురించి ముఖ్యంగా చంద్ర క్షేమం గురించి మేమెంతో ఆందోళన చెందేవాళ్ళం. అతని ఇంటి ఎదురుగా నిరసన ప్రదర్శనలు జరిపి అతనికి వ్యతిరేకంగా నినాదాలు ఇచ్చేవారు. ఆ బెదరింపులన్నింటిని ఎదుర్కొన్న ధైర్యవంతుడైన చంద్రను మేం చూశాం. చంద్ర లాంటి వ్యక్తులిచ్చిన ధైర్యం, పెంపొందించిన ప్రతిష్టలే పౌరహక్కుల సంఘానికి జాతీయ స్థాయి గుర్తింపును తీసుకువచ్చింది.

పౌరహక్కుల సంఘం నుండి మానవ హక్కుల వేదిక విడిపోయినప్పుడు చంద్ర బాలగోపాల్‌తో, తన మిత్రులతో కలిసి పనిచేశాడు. ఆ తర్వాత చంద్ర ఆధునికతపట్ల తీవ్రమైన వ్యతిరేకతను పెంచుకొన్నాడు. అందులో మానవ హక్కుల భావన కూడా ఉంది. ఆ తర్వాత చంద్ర ఆధునికానంతర భావాలవైపు ఆకర్షితుడయ్యాడు. చంద్రలో వచ్చిన ఈ మార్పు మా అందర్నీ ఎంతగానో ఆశ్చర్య పరిచింది. మానవహక్కుల భావన కూడా సామ్రాజ్యవాద ఎజెండాలో భాగమేనని మనంకూడా తెలిసోతెలియకో  ఆ కుట్రలో భాగస్వాముల మౌతున్నామని విమర్శించేవాడు. ఈ విషయంపైన మా మధ్య ఎన్నో సార్లు వాదోపవాదాలు జరిగాయి. ఈ దశలోనే చంద్ర ఎంతోమంది తత్త్వవేత్తలపట్ల కొత్తభావాలపట్ల ఆకర్షితుడయ్యాడు. మేము ఇంతవరకు విని ఎరుగని తత్వవేత్తలనుగురించి మాకేమి తెలియని అంశాలను గురించి ఆయన చెప్పేవాడు. ఆధునికతనుంచి బైటపడడానికి మళ్ళీ సంప్రదాయ భావాల్లోకి వెళ్ళాలని ఆయన అనుకున్నాడు. అతని జీవితం అతని ఆచరణను చూసి మేము ఆశ్చర్యం తర్వాత ఆశ్చర్యాన్ని పొందేవాళ్ళం. అతని మెదడు తెలివి ఎంతో జ్ఞానవంతమైనదని మేము అందరం ఏకగ్రీవంగా అంగీకరించేవాళ్ళం. శాక్కో-వాంజెట్టిల కేసు విషయంలో ఆయన చేసిన పరిశీలనలు వ్యాఖ్యలు నాగరికతకు సంబంధించిన, అదేవిధంగా న్యాయశాస్త్రానికి సంబంధించిన అంశాలను నిలదీసే మౌలికమైన ప్రశ్నలు.

హైదరాబాద్‌లో ఆసియా సోషల్ ఫోరమ్  సభలు జరిగినప్పుడు ఎన్.జి.ఓ.ల అసలు స్వభావాన్ని వివరిస్తూ ఆయన రాసిన పుస్తకం ఎంతో వివాదాస్పదం అయ్యింది. మనం నడుస్తున్న కాలం ఎంతో క్లిష్టమైనది. దానికి సంబంధించిన మలుపులు, ఎగుడుదిగుడులను గురించి ఆయన మాట్లాడారు. మేధోసంఘర్షణ అనేది ప్రస్తుతం తాము జీవిస్తున్న కాలంలోకాక భవిష్యత్తు గురించి ఆలోచించేది. నిర్దుష్టంగా దానిపయనం ఎటువైపో  సరిగ్గా ఎవరికీ తెలియదు.

చంద్రపట్ల ప్రజలు ఎక్కువగా ఆకర్షితులు కావటానికి ముఖ్యమైన కారణం అతని నిజాయితీ. అతన్లో ఏమాత్రం కాపట్యంలేదు. ఎటువంటి వెనుకంజావేయకుండా తన మేధోపరమైన ఆలోచనల గురించి ఆయన చర్చించేవాడు. వ్యక్తిగతంగా ఆయన ఎంతో ఆత్మీయమైన స్నేహితుడు. నేను గుంటూరు వెళ్ళినప్పుడల్లా నా సభలన్నింటికి అతను హాజరయ్యేవాడు. నా అభిప్రాయాలతో అతనికి ఎన్ని విభేదాలు ఉన్నప్పటికీ సభకు మాత్రం వచ్చేవాడు. ఎప్పుడూ తనతోనే ఉండమని బలవంతపెట్టేవాడు. గంటలతరబడి మేము మాట్లాడుకుంటూ గడిపేవాళ్ళం. అతనిలోని ఈ మంచిగుణమే సమాజంలోని విభిన్నవర్గాలకి చెందినవారిని అతనికి స్నేహితులుగా మలిచింది.

చంద్రకు ఎంతో అద్వితీయమైన, ఉదారమైన అభినందనలు అందాయి. వాటినందించిన వ్యక్తి ఎవరోకాదు. గొప్ప మానవ హక్కుల నాయకుడైన కన్నబిరాన్. నేను చంద్రని చివరిసారి చూసినప్పుడు అతను తన శరీరాన్ని ఆవహించిన వ్యాధితో  యుద్ధం చేస్తున్నాడు. అతని అందమైన, విశాలమైన నేత్రాలు మరింతగా విప్పారాయి. అప్పుడు చంద్ర మరొకవాదనకు సిద్ధంగా ఉన్నాడని బహుశా ఆ వాదన మృత్యువు గురించేనని నాకు అనిపించింది. తనకు ఎంతగానో ఆత్మవిశ్వాసం ఉందికాబట్టి తన వ్యాధితో పోరాడాలని నేను చెప్పినప్పుడు అతను చిరునవ్వు నవ్వాడు. అతని నవ్వులో సంపూర్ణమైన జీవితం ఉంది. ఆ చిరునవ్వు ఎంతో సహజంగా ఉంది. అతని చివరి క్షణాల్లోకూడా జీవం తొణికిసలాడుతూనే ఉంది. అతని ఆకస్మిక విషాదకరమైన మరణం ఒక గాఢమైన అధ్యయన పరంపరకు జీవన వాస్తవిక అన్వేషణకు తుదిపలుకుల్లాగా ఉన్నాయి.



## 12. అందమైన అసమాపక వాక్యం, చంద్రశేఖర్

**కె. శ్రీనివాస్**

కేన్సర్ కంటె ఘోరమైనది కుష్ఠు అంటాడు అలెగ్జాండర్ సోల్జినిత్సిన్ ఆత్మకథనాత్మక నవల 'కేన్సర్ వార్డ్'లోని కథానాయకుడు కొస్తొగ్లొతొవ్. అట్లాఅంటాడు కానీ, తన దృష్టిలో అత్యంత దుర్మార్గమైనదైన సోవియట్ వ్యవస్థను కేన్సర్‌తోనే పోలుస్తాడు. "మనిషికి కేన్సర్ కురుపు మొలిస్తే చచ్చిపోతాడు. మరి ఒంటినిండా లేబర్ కేంపులు, ప్రవాసాలు మొలుస్తున్న దేశం ఏమవుతుంది?" అని అతను ప్రశ్నిస్తాడు.

'కుష్ఠు వ్యవస్థ' అన్న మాట దిగంబర కవులది. ఏవగింపును, వ్యతిరేకతను ప్రకటించడానికి విలువల చర్చ లేకుండా వెగటు మాటలనే వాడాలనే ధోరణి వాళ్లది. కంటికి ఒంటికి అప్రియంగా కనిపించే దయనీయమైన జబ్బే తప్ప, వ్యవస్థలో ఉన్న దుర్మార్గం కుష్ఠులో లేదు. పదప్రయోగాల్లో పట్టింపులున్న విప్లవ రచయితలు సహజంగానే వ్యవస్థకు 'కుష్ఠు' విశేషణాన్ని ఇష్టపడలేదు. దోపిడి వ్యవస్థ వంటి మాటలనే వారు ఉపయోగించేవారు. చెరబండరాజు మరణశయ్యమీద ఉన్నప్పుడు మాత్రం కేన్సర్ వ్యవస్థ అన్నమాట తరచు వినిపించింది. వ్యవస్థతోనూ, కేన్సర్‌తోనూ పోరాడిన ఒక కవియోధుడు ఆ రెంటి మధ్యా పోలికను సాధించాడు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పెట్టిన హింసా, కేన్సర్ వ్యాధీ జమిలిగా చెరబండరాజును కబళించినప్పుడు అతనింకా యువకుడే. ఆ వయసులో అంతటి జబ్బు రావడం కానీ, అసలు కేన్సర్ వ్యాధిగ్రస్తులు తరచు తారసపడడం కానీ అప్పటికి అరుదే. ప్రేమకథల సినిమాల్లోనే కేన్సర్ పేరు ఎక్కువగా వినిపించేది. అప్పటికీ ఇప్పటికీ బయటపడడం ఎక్కువైందో, వ్యాధివ్యాప్తి ఎక్కువైందో కానీ

దేశమే పెద్ద కేన్సర్‌వార్డ్‌లాగా అనిపిస్తోంది. బోలెడు జీవితం ఉన్నవారిని, అందులోనూ జీవితేచ్ఛ కలిగినవారిని, జనంకోసం బతకడంలోనే స్వేచ్ఛను ఖర్చుచేసేవారిని వెదికి వెదికి డ్రోన్ దాడులు చేసి మరీ కేన్సర్ చంపుతోంది. గొర్రెపాటి నరేంద్రనాథ్, కెఎన్‌వై పతంజలి, చంద్రశ్రీ, బుర్రా రాములు... జాబితా చాలా పెద్దది. ఇప్పుడు తాజాగా బి. చంద్రశేఖర్.

పర్యావరణవేత్త డౌన్‌టు ఎర్త్ సంపాదకుడు అయిన అనిల్ అగర్వాల్ లింఫోమా అనే ఒక అరుదైన కేన్సర్‌బారిన పడి, దానితో పోరాడుతున్నప్పుడు హిందూ పత్రికలో ఒక వ్యాసం రాశారు. కేంద్ర మంత్రి మోహనకుమార మంగళం మరణానికి ఆస్పత్రులనో, వైద్యులనో నిందించడం కాదు, కేన్సర్‌వ్యాధిని ఆలక్ష్యం చేస్తున్న ప్రభుత్వాన్ని బోనులో నిలబెట్టాలని అనిల్ అగర్వాల్ అన్నారు. ఢిల్లీ మహానగరంలోని కాలుష్యమూ కాలుష్యకారక జీవనవిధానాలే కేన్సర్‌కు తిండి పెడుతున్నాయని ఆయన ఆరోపించారు. చికిత్సల మీద కాదు, మూలాల మీద గురిపెట్టమని కోరాడు. హక్కుల న్యాయవాది, రచయిత అయిన చంద్రశేఖర్ కూడా ఒక అరుదైన రకం కేన్సర్ సోకి, అర్థంతరంగా చనిపోయారు కానీ, ఈ గండం గడిచి ఉంటే, కేన్సర్ విజృంభణ వెనుక ఉన్న ఆధునికత కుట్రను చాటి చెప్పేవారు. అంతా ప్రకృతిబద్ధంగా జరిగిందని, మన చేతిలో ఏమీ లేదని అనిపిస్తుంది కానీ, ఈ రాచపుండు వెనుక చరిత్రగమనంలో మనుషులు వేసిన తప్పటడుగులు, అభివృద్ధి క్రమంలో పడిన తప్పటడుగులు, స్వార్థంలాభం కలగలసిన పాలనల వికృతవిధానాలు ఉన్నాయని అర్థమవుతూనే ఉంది. ఈ జబ్బులక్షణం అయిన అసాధారణ కణాల అనియత వృద్ధికి మూలకారణం ఏమిటో శాస్త్రవిజ్ఞానానికి ఇప్పటికీ అర్థం కావడం లేదు. ఈ వ్యాధి వృద్ధికి వ్యవస్థాగత కారణాలు మాత్రం సామాజికశాస్త్రాలకు తెలుసు. మొదటిది తెలిస్తే చికిత్సకు మార్గం దొరుకుతుంది. రెండోది తెలిసినా చేయగలిగింది తక్కువ.

ఎన్నో నిప్పుల గుండాలను దాటుకుని వచ్చి, మూలం తెలియని పుట్టకురుపు చేతిలో ఓడిపోయాడు చంద్రశేఖర్. మన సమాజంలో కులం అన్నది కేన్సర్ కంటె, సకల మహమ్మారుల కంటె దుర్మార్గమైన వ్యాధి. దాన్ని జయించినవాడు చంద్రశేఖర్. దళిత ఉద్యమ శ్రేణులన్నీ అతని స్మృతిని గుండెలకు అద్దుకుని నివాళులర్పిస్తున్నాయి. సకల రుగ్మతల కంటె చిత్రహింసాత్మకమైనది రాజ్యహింస.

దాన్ని ఎదిరించిన వాడు చంద్రశేఖర్. పాతికేళ్ల కిందట రాడికల్ విద్యార్థిగా ఉన్నప్పటి నుంచి జాజ్వల్యమానమైన, సృజనాత్మకమైన ప్రజాజీవితంలో ఉన్నవాడు. హక్కుల కార్యకర్తగా, న్యాయవాదిగా వ్యవస్థ కుతర్కాన్ని అవగతం చేసుకున్నవాడు. సకల ప్రజాస్వామిక ఉద్యమాలూ అతని సాహచర్యాన్ని సవినయంగా స్మరించుకుంటున్నాయి.

చుండూరు బాధితుల పక్షాన చివరిదాకా పోరాడినవాడు. సమాజపు సానుభూతి లభించని చిలకలూరిపేట నిందితుల పక్షాన ఉరిశిక్ష రద్దు కోసం ఉద్యమించినవాడు. శాక్కో, వాంజెట్టిని విస్తారంగా పరిచయం చేసినవాడు. ఆ అనుభవాలను, ఆచరణను నిరాకరించ కుండానే మోసుకువచ్చిన ఆధునికత - భారతీయ సాంప్రదాయ జ్ఞానాన్ని, హేతువును, విశ్వాసాలను ఎట్లా భగ్నం చేసిందనే చింతనలోకి దిగాడు. ఆధునిక హక్కుల భావన స్థానంలో పరంపరాగతమైన అనుబంధ భావనను స్వీకరించాడు. పాశ్చాత్య హేతుజ్ఞానోదయం (ఎన్‌లైటెన్‌మెంట్) మన దేశాన్ని ఎంతగా సర్వనాశనం చేసిందో రాయాలని తపించాడు. ఆరిపోవడానికి రెండు మూడు రోజుల ముందునుంచి, తనను కలవడానికి వచ్చిన మిత్రులతో కన్యా శుల్కంలోని మధురవాణికి ప్రేరణని, దేవదాసీలను సంస్కరించాలనే గురజాడ ఆధునికతా భావనని చర్చించాడు. నలభై తొమ్మిదేళ్లకే ఆగిపోయిన అతని జీవితం కొనసాగిఉంటే, ఈ జ్ఞాన ప్రయాణం ఎంతదాకా వెళ్లేదో తెలియదు కానీ, అతను తప్పనిసరిగా కొన్ని ప్రశ్నలను వదిలివెళ్లాడు. మిత్రులకు చాలానే హోమ్‌వర్క్ ఇచ్చి వెళ్లాడు.

కేన్సర్‌కు తొందరలోనే వేక్సిన్‌లో, మందులో కనుక్కోవచ్చు. ఆశ్చర్య మేమీ లేదు. మృత్యువు బహుశా అప్పుడు మరో వాహికను వెదుక్కుంటుంది. పిడుక్కీ బియ్యానికీ కలోనియలిజమ్ మంత్రం పనికిరాకపోవచ్చు. కానీ, వందారెండువందలేళ్ల మన ప్రయాణంలో ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది. కొంత వెనక్కు వెళ్లి సరిచూసు కోవడం, సరిచేసుకోవడం తప్పనిసరి. శరీరంలోనే కాదు, మరే రంగంలో అయినా అదుపు లేకుండా జరిగే వృద్ధి పెద్ద జబ్బు. గుర్తిద్దామా?

ఆదివారం, ఆంధ్రజ్యోతి సౌజన్యంతో



# 13. ప్రశ్న

**షేక్ కరీముల్లా**

జీవితం
ప్రశ్నగా మలచినవాడు
ప్రశ్నగా విలపించినవాడు
చిటారుకొమ్మ నుండి
చిలుకై ఎగిరిపోయాడు
ఫాసిజం ఉరికొయ్యలపై
ప్రశ్నల జడివానై కురిసినవాడు
కాలం కాటుకు
కనుమరుగయ్యాడు
ఇక మా వీపుల వెనుక
తచ్చాడుతున్న ఉరితాళ్ళను
ప్రశ్నించేదెవరు?
మనుషులు
ప్రశ్నలు కాలేని చోట
ప్రశ్నలుగా మిగలని చోట
ఒక ప్రశ్న
ఇలా రాలిపోవడం
మా భవిష్యత్తుకు
ఒక ప్రశ్నే కదా!

రచయిత సెల్ : 9441502990

## 14. హక్కుల శేఖరుడు!

**జూలూరు గౌరీశంకర్,** అధ్యక్షులు, తెలంగాణ రచయితల వేదిక

అతడు హక్కుల పంటకు కాపలాదారుడు
ఊరుబయట మూలుగులను
ఉఛ్వాస నిశ్వాస చేసుకున్నవాడు
ఇంటి ముంగిట అల్లుకున్న పందిరిలా
గాబుకాడ చెంబులాగా
నీళ్లబాయి గిలకలాగా
హక్కుల సారథై సాగినోడు
కాలంతో కలసి నలుగురితో నారాయణ కాదు
కాలాన్ని జయిస్తూ హక్కుల జెండాగా రెపరెపలాడినోడు
పుట్టుకను, చావును, ఉరిని, బతుకును
ఒక్కటిగా చూసిన హక్కుల యోధుడు
తల్లి స్తన్యం కోసం బిడ్డ కంఠాన్నిచ్చి
అగ్రవర్ణ కోటల్ని న్యాయబద్ధంగా కూల్చినోడు
ధర్మకాటా తిరగబడుతున్నప్పుడు
న్యాయాన్ని సమంగా కొలిచి దళితులకు పంచినోడు
దేశ దేశాలను సదివినోడా
కాలమానాల్ని కొలిచినోడా
ఎరుపును, నలుపును ఒంటికి రాసుకుని

మానవ హక్కుల అమ్ములపొదిగా మారినోడా
పొద్దును హక్కుగా పొడిపించి
ఉద్యమ సూరీడుగా అస్తమించినోడా
చంద్ర... ఓ ఉడుము పట్టు
చుండూరులు గాయాలై సలుపుతున్నప్పుడల్లా
చంద్ర అక్కడ మెరుస్తుంటాడు
ఉరి రద్దును కోరుతున్నప్పుడల్లా
న్యాయకంఠమై ఉరుముతుంటాడు
అతడొక జ్ఞానసంద్రం
దరిచేరలేని వారికి, ఆసరాలేని అన్నార్తులకు
చంద్ర.. ఓరక్షణ కవచం
'ఎరుక'గల చంద్రులను కనడానికే కాలముందనుకుంటా!
ప్రతి గడప దగ్గర చంద్ర.. ఓ ప్రశ్నల మొక్కై మొలుస్తూనే ఉంటాడు
చంద్ర అంటే...
హక్కులనే ప్రశ్నించిన హక్కు, విలువైన మాటల ముల్లె
దేన్నైనా తర్కించేటప్పుడు... తీర్పులు చెప్పేటప్పుడు
చంద్రను చరిత్ర తలుసుకుంటది.

రచయిత సెల్ : 9440169896



# 15. వెంటవచ్చునదదే యశస్సు...

**బి. శశాంక్**

'అన్నదమ్ములును, ఆలుబిడ్డలును, కన్న తల్లిదండ్రులు, స్నేహితులు, బంధువులు వెంటరారు తుదిన్. వెంటవచ్చు నది అదే యశస్సు. అదేసత్యము. స్థిరమై సంపదలెల్ల వెంట ఒక రీతిన్ సాగిరావు. ఏరికి ఏసరికి ఏ పాటి విధించెనో విధి. అదే అవశ్యప్రాప్తంబు' అనే హరిశ్చంద్ర నాటకంలోని పద్యము నాన్న ఎక్కువగా వింటూ తన్మయత్వం పొందేవాడు. అదే జీవిత సత్యంగా గుర్తించిన అతికొద్దిమందిలో నాన్న ఒకడు. ఆ పద్యం అర్థాన్నేకాక దాని భావసారాన్ని కూడా పూర్తిగా అవగతం చేసుకున్న వ్యక్తి ఆయన. సంపదను గడ్డిపోచతో సమానంగా భావించి నిజమైన సంపద అనగా 'జ్ఞానం' అని నాకు ఎప్పుడూ చెప్తుండేవాడు. ఆస్తులు మానవ సంబంధాలకు అవరోధాలు అనే ఉద్దేశం కలిగిన వ్యక్తి ఆయన. సమాజ హితము కోరే వ్యక్తులు ఎందరున్నా సామాజిక సమస్యల పట్ల ఆయన దృక్పథం చాలా భిన్నంగా ఉండేది. సమస్యల మూల కారణాలను అన్వేషించడంలో ఆయన నిమగ్నం అయ్యేవాడు. ఆధునికతను అన్ని సమస్యలకు మూల కారణంగా గుర్తించిన వ్యక్తి ఆయన. ఆధునికత మానవుడ్ని ప్రకృతి నుంచి దూరం చేసి మనిషిని ఒక వినియోగ దారునిగా మార్చివేసిందని ఆయన బాధపడుతుండే వాడు. మానవ సంబంధాలను ఆర్థిక సంబంధాలుగా మార్చి వేయడంలో మార్కెట్ ప్రధాన భూమిక పోషించిందని దానిలో భాగంగానే హక్కుల ఉద్యమాలు పుట్టుకొచ్చాయని ఆయన అంటుండేవారు. హక్కులనేవి మార్కెట్ వేగంగా విస్తరించి సమాజంలో చొచ్చుకుపోవడానికి దోహదపడే రహదారుల వంటివని ఆయన అభిప్రాయం. మనిషి అనే వాడు సమూహంలో ఉన్నాననే భ్రమలో ఉన్నాడు గానీ అతనిని ఆధునికత ఒక 'atomistic individual' కిందికి

మార్చివేసిందని, దాంతో మనిషి సమాజ నియంత్రణ నుంచి బయటపడి ఒక స్వార్థపూరిత వైఖరిని అలవర్చుకున్నాడని ఆయన తరచు చెబుతుండేవారు. అందుకే ఆయన ఆధునికతను విడిచిపెట్టి ప్రకృతిని ఆస్వాదిస్తూ కృష్ణానదీ తీరాన దైద అమరలింగస్వామి గుడి చేరువలో పొలం కొని వ్యవసాయం చేసుకుంటూ పుస్తకాలు చదువుకుంటూ జ్ఞానాపార్జన చేసుకుంటూ ఐహిక సుఖాల్ని విడనాడి కాలం గడపడానికి నిర్ణయం తీసుకున్నాడు. నగరం పట్ల ఆయనకున్న ఏహ్యాభావాన్ని అర్థం చేసుకోవడానికి సండే ఇండియన్‌లో ప్రచురితమైన ఆయన వ్యాసం చదివితే చాలు. ఆయన ప్రస్థానం అనేక సామాజిక ఉద్యమాలు దాటుతూ ప్రకృతి వైపు సాగింది. దాన్ని కొందరు తిరోగమనం అని భావించినా అది ఆధునిక అభివృద్ధి రాక్షసి చేసే విధ్వంసం కన్నా ప్రాకృతిక జీవనం వల్ల కలిగే ఆత్మసంతృప్తి చాలా గొప్పది. అసలైన తిరోగమనం అంటే ఆధునిక అభివృద్ధి పథం అనే మాయలో దూసుకుపోవడం తప్ప మరేదీకాదని ఆయన అనేవారు. ఆధునికతలో 'solution is the cause of the problem' అని గుర్తించిన వ్యక్తి ఆయన. ధైర్యం. తెగువ, తెలివి, ఆలోచన అన్నీ తీవ్రస్థాయిలో కలిగిన వ్యక్తి మా నాన్న. ఏదైనా ఒక కేసు ఒప్పుకుంటే ఎన్ని కష్టనష్టాలు ఎదుర్కొనైనా పూర్తిచేసేవాడు. ఉదా: 'defacto complainant' తరఫున జిల్లా కోర్టులోనే మొదటిసారిగా 'bail opposition petition' వాదించుటకు ఒప్పుకున్నారు. అది విచారణకు వచ్చేనాటికి ఆయన ఆసుపత్రిలో ఎముకలను పిండి చేసేంత తీవ్రమైన వెన్నునొప్పితో పడుకున్నారు. కానీ తనను నమ్మిన క్లయింట్‌కు అన్యాయం జరగకూడదని కోటు, గౌను, పుస్తకాలు హాస్పిటల్‌కి తెప్పించుకుని అక్కడే వాదనను సిద్ధం చేసుకున్నారు. 60 ఎంజి మార్ఫిన్ బిళ్ళలు వేసుకుని కోర్టులో కూర్చోలేని పరిస్థితిలో కారులో పడుకొని జడ్జి పిల్వగానే నొప్పిని లెక్కచేయకుండా వెళ్ళి గంటసేపు నిల్చుని కోర్టు హాలు దద్దరిల్లే విధంగా వాదించి క్లయింట్‌కి న్యాయం చేసి తిరిగి హాస్పిటల్‌కి వెళ్ళి పడుకున్నారు. అదే ఆయన చివరిగా వాదించిన కేసు. ఆయనకు క్యాన్సర్ అని తెలిసినప్పటి నుంచి ఆయనతప్ప ఇంట్లో మిగతావారంతా రోదించారు.

ఆయన మాత్రం ఆ నాలుగు నెలలకాలంలో ఎప్పుడూ దిగులుగా కన్పించలేదు. అధైర్యమూ పడలేదు. పైగా నాతో 'నేను ఎన్నో కష్టాలను ధైర్యంగా ఎదుర్కొని విజేతగా నిలిచాను. క్యాన్సర్ ఒక లెక్కా ... ఒకవేళ నేనీ పోరాటంలో ఓడినా నా ఆత్మ అనంత విశ్వంలో కలిసి ఉంటుంది. నెనెప్పుడూ నీ చుట్టూనే

ఉంటాను. నీవు మాత్రం నీతి, నిజాయితీకి కట్టుబడి ఏదైనా పని ఒప్పుకుంటే పూర్తయ్యే దాకా వదలకు. జ్ఞానమే మనకు ఆస్తి' అని చెప్పేవారు. మృత్యువు తరుముకొస్తున్నా ఇంకొద్ది గంటలలో చనిపోతారనగా కూడా 'I will come back' అని తన శైలిలో గంభీర స్వరంతో పలికారు. క్యాన్సర్‌తో నాలుగు నెలల పోరాటమే ఆయన మొండితనం, ధైర్యానికి నిదర్శనం.

చుండూరు కేసు విషయంలో ఎటువంటి ఒత్తిళ్ళు, ఆర్థిక ప్రలోభాలకు తలొగ్గకుండా, ఏనాడూ చుండూరు మొహం చూడని కొందరు దళిత నేతలు, బ్రాహ్మణుడు మనకేం చేస్తాడు అని కావాలని విషం చిమ్మినా అన్నిటినీ భరించి ప్రపంచంలో దేనినైనా డబ్బుతో కొనగలం అన్న ధీమాతో ఉన్న వారికి అది తప్పు చంద్రశేఖర్ ఉన్నాడు... ఖబడ్దార్ అని చాటాడు. కేసుని కిలోల లెక్కన అమ్ముకుందామని దుకాణాలు తెరిచిన ఎన్‌జీఓకి, ఇతర దుష్ట శక్తులకి కొరకరాని కొయ్యగా మారారు. డబ్బు కంటే ఆశయం గొప్పదని చాటారు. మా నాన్న చావుతో మళ్ళీ ఆ శక్తులు పునరుజ్జీవం పోసుకున్నాయి. కానీ ధర్మమే చుండూరు బాధితులకు రక్ష. ఆయనొక నిత్య విద్యార్థి. పుస్తకాలను అమితంగా ప్రేమించేవాడు. ప్రతి పుస్తకాన్నీ ఒక భిన్న కోణంలో విశ్లేషించేవాడు. ప్రపంచం మొత్తం ఆకాశానికి ఎత్తిన పాలో కొయిలో రాసిన 'ది అల్కెమిస్ట్' నవలను, యాంటీ ముస్లిం నవల అని దానిమీద చరిత్రలో ఒక మైలురాయిగా నిలిచిపోయే విమర్శ రాసిన వ్యక్తి ఆయన. హాస్పిటల్‌లో డాక్టర్‌ని కూడా 'నాకు పెన్ను పేపరు ఇవ్వండి నేను చాలా రాయాలి' అని అడిగాడు ఆయన. గురజాడ సిద్ధాంతాన్ని పూర్వపక్షం చేస్తూ ఒక పుస్తకంరాయాలనుకున్న ఆయన కలం అర్థంతరంగా ఆగిపోయింది. ఆయన ఆత్మ అఖండాత్మలో లీనమైంది. నాకు తెలిసిన నాన్న మొండివాడు. భయం తెలియనివాడు. ఆడితప్పనివాడు. ఆధునికతకు వ్యతిరేకి. చుండూరు దళితుల ఆత్మగౌరవం నిలబెట్టిన ఒక బ్రాహ్మణుడు. ఆయన వెళ్ళిపోతూ నా మీద చాలా బాధ్యత వదిలి వెళ్ళిపోయాడు. ఆయన ఆశయ సాధనకు నేను నా వంతు కృషిచేస్తా...

- వ్యాసకర్త బి. చంద్రశేఖర్ కుమారుడు

ఆంధ్రజ్యోతి సౌజన్యంతో



## 16. బ్రాహ్మణ దళిత పోరాట యోధుడు చంద్రశేఖర్

**యింద్రవెల్లి రమేష్**

చంద్ర అంత్యక్రియల్లో మాట్లాడబోతే 'చుండూరు' బాధితుల పోరాట నాయకుడు మోజెస్ (ఆ సంఘటనలో హత్యచేయబడ్డ జాలాది మత్తయ్య కుమారుడు) కు మాట పెగల్లేదు. దుఖంతో వెనక్కి వెళ్లిపోయాడు. వందలాది అభిమానుల మధ్య కృష్ణానదీ తీరంలో దైద అడవుల్లో తమ న్యాయవాది శవం కాలుతున్న మంటల సెగ అతడి మాటను కట్టేసి ఉండాలి. అప్పుడతడు చంద్ర జ్ఞాపకాల్లోకి వెళ్లివుండాలి. ఆ సాయంకాలపు ఉద్వేగ వాతావరణంలో నేను కూడా, చుండూరు స్పెషల్ కోర్టు వాదనలు జరుగుతున్నాయి 2007 (?) మొదట్లోకి వెళ్లాను. అక్కడ వాదోపవాదాలు జరుగుతున్నాయి. అప్పటికి పదహారేళ్ల క్రితం ఆ కోర్టు ఉన్న చోటే అగ్రకులాలు మాల, మాదిగలను వెంటాడి, వేటాడి చంపిన మారణకాండపై చర్చోప చర్చలు జరుగుతున్నాయి. పీడితుల పక్షాన పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా భువనగిరి చంద్రశేఖర్ వాదనా పటిమకు జడ్జి నోట కూడా మాట రాలేదు. ఆ ప్రత్యేక న్యాయస్థానం ఆవరణలో మహాకవి శివసాగర్, గుంటూరు కార్మిక నాయకుడు రాజేంద్ర ప్రసాద్, దళిత న్యాయవాది రత్నప్రసాద్, నేను తచ్చాడుతున్నాం. మోజెస్ అప్పుడు జనం మధ్యలో ఎక్కడున్నాడో గుర్తులేదు. మాకు అనిపించింది ఒకటే - త్వరలో కోర్టు ప్రకటించబోయే చుండూరు దళితుల విజయంలో చంద్రశేఖర్ ఒక సగర్వమైన భాగం అని.

x x x

ఈ రోజు చంద్రశేఖర్ లేడు. చలపతి, విజయవర్ధనరావు ఉరితీత ఆగిపోవడంలో కూడా ప్రధాన పాత్రధారి అయిన చంద్రశేఖర్ లేడు. చనిపోయి నెల అయిందో లేదో అతడి ఆలోచనల చుట్టూ వివాదం నెలకొంది. ఆ వివాదంలో

కూడా తలదూర్చుతాం. చర్చల్లో పాల్గొంటాం. అతడు 'అరాచకవాదం' మీద చేసిన ఆలోచనలను, 'బౌమనీయం' మీద చేసిన ఆలోచనలను, 'ఆధునికత' మీద చేసిన ఆలోచనలను పట్టించుకుంటాం. ఖండితంగా మా అభిప్రాయాలు చెపుతాం. మా వాదనను వినిపిస్తాం. అక్కడితో ఆగిపోము. ఒకవేళ అతడు పక్కా బ్రాహ్మణవాది అని ఆఖరుకు తేలినా, అతడి పూర్వ ఆచరణ రద్దయి పోదనుకుంటాం. అది ఒక సత్యంగా రికార్డు చేస్తాం. చరిత్రలో అణగారిన కులాల పక్షాన రాజీలేని న్యాయపోరాటం చేసిన వాడిగా పదిలపరుచుకుంటాం. భారతదేశంలో ఒక విలువైన 'బ్రాహ్మణ దళిత పోరాట యోధుని'గా కీర్తిస్తూనే ఉంటాం.

రచయిత సెల్ : 9985440002



# 17. దిక్కులేని వారి జీవితాలకు వెలుగునిచ్చే దీపం ఆరిపోయింది

**దుడ్డు ప్రభాకర్,** కులనిర్మూలన సమితి అధ్యక్షుడు

ఉద్యమకారుల్ని, రౌడీషీటర్‌లను బూటకపు ఎన్‌కౌంటర్‌లలో చంపే పోలీసు అధికారులకు సింహస్వప్నం బి. చంద్రశేఖర్. హత్యలు చేస్తున్న పోలీసులకు ప్రభుత్వం రివార్డు, అవార్డులు, ప్రమోషన్లు ప్రకటిస్తున్న కాలంలో ప్రజలు భయభ్రాంతులై మౌనంగా రోదిస్తున్న రోజుల్లో బాధితుల కుటుంబాలకు చంద్రశేఖర్ అండగా నిలబడ్డారు. అధికార దుర్వినియోగానికి పాల్పడుతూ చట్టాన్ని చేతుల్లోకి తీసుకొని హత్యలుచేస్తూ అడ్డుచెప్పేవాడేలేడని విర్రవీగే ఐపిఎస్ అధికారుల్ని సైతం కోర్టుకి ఈడ్చి బోనులో నిలబెట్టి నేరాన్ని ఋజువుచేసిన ధీశాలి చంద్రశేఖర్. ఎవ్వరూ చెయ్యలేని పని తను చేయడం చంద్రశేఖర్ ప్రత్యేకత. చిలకలూరిపేట బస్సుదహనం కేసులో ముద్దాయిలైన దళిత యువకులు చలపతి, విజయవర్ధనరావులకు కోర్టు మరణశిక్ష విధించిన సందర్భంలో వారి ఉరిశిక్షను రద్దుచేయాలని ఉద్యమాన్ని నడిపారు. లోకమంతా వారికి ఉరిశిక్ష విధించడం సరైందే అనుకుంటున్న ఆ రోజుల్లో అందుకు భిన్నంగా ఉద్యమం నడపడం చిన్న విషయం కాదు. ఈ సందర్భంగా కె.జి.సత్యమూర్తి (శివసాగర్) సాహసాన్ని కూడా గుర్తుచేసుకోవాలి. సభలను భగ్నం చేయడానికి పోలీసులు చెయ్యని ప్రయత్నంలేదు. బస్సు దహనంలో మృతి చెందిన వారి బంధువుల్ని కూడగట్టి వీరిమీదికి దాడికి ఉసిగొల్పేవారు. సభావేదికపైకి రాళ్ళు వేయించేవారు. అనేక రకాలుగా పోలీసుల నుండి బెదిరింపులు వచ్చాయి. కానీ అలాంటి బెదిరింపులకు బెంబేలెత్తే మనిషి కాదు చంద్రశేఖర్. ఇంకా ఛాలెంజ్‌గా తీసుకొని

ముందుకెళ్ళాడు. ప్రస్తుతం చలపతి, విజయవర్ధన్‌రావులకు ఉరి రద్దయి జీవిత ఖైదు అనుభవిస్తున్నారు.

ఒక ముఖ్య విషయం గుర్తు చేయాలి. 1991 ఆగస్టు 6 చుండూరు నరమేధం జరిగినప్పటి నుండి బాధితుల తరుపున నిలబడి వాళ్ళ అభిమాన హీరో అయ్యాడు. చుండూరు సంఘటనప్పుడు చంద్రశేఖర్ ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘంలో వున్నాడు. అక్కడున్నా, మానవహక్కుల వేదికలోవున్నా, చివరకు అందులో నుండీ బయటకొచ్చినా చుండూరు బాధితుల గుండెల్లో ఈయన స్థానం పదిలంగానేవుంది. చుండూరు దళితులు పోరాడి సాధించుకున్న ప్రత్యేక కోర్టులో దళితుల తరపు వాదనలు వినిపించడానికి ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా చంద్రశేఖర్ కావాలని దళితులందరూ ఉమ్మడిగా కోరుకోవడం ద్వారా చుండూరు దళితులకు ఆయనపై వున్న అభిమానం, గౌరవం, అన్నిటికంటే మించి ఆయనమీదున్న నమ్మకాన్ని తెలియజేస్తుంది. చంద్రశేఖర్‌ని పి.పి.గా తప్పించడానికి ముద్దాయిలు, కొందరు దళితనాయకులు అనేక ప్రయత్నాలు చేశారు. కాని చుండూరు దళితుల పట్టుదల ముందు ఏ కుట్రలు పనిచెయ్యలేదు. ఆయన కూడా, కేసునడచిన రెండేళ్ళు ఎంతో దీక్ష, పట్టుదలతో ప్రత్యేక కోర్టుకు హాజరయ్యేవాడు.తన స్వంత రక్తసంబంధీకులు హత్యకు గురైనంతగా ఫీలై వాదనలు వినిపించాడు. 22-01-2013న కేన్సర్ వ్యాధితో మరణించాడు. దళిత,పీడిత కులాల, పేద ప్రజల పక్షపాతి చంద్రశేఖర్ ఇక లేరని చుండూరు మాల, మాదిగ పల్లెలు ఘొల్లుమన్నాయి. ఇప్పుడు చుండూరు కేసు హైకోర్టులో వుంది. దళిత బహుజన ఉద్యమాలు అంత బలంగా నడిచిన ఆంధ్రప్రదేశ్‌లో చుండూరు దళితుల కేసు హైకోర్టులో వాదించడానికి పి.పి. కోసం బాధితుల వెతుకులాట ప్రారంభించారు. ఎవర్ని పి.పి.గా కోరుకుంటే బాగుంటుందో నిర్ణయించుకోలేకున్నారు. అదే మరి చంద్రశేఖర్ అంటే.

రచయిత సెల్ : 9959567818



# 18. కాగడా చేతబట్టేదెవరు..?

బండారు సురేష్ బాబు (బసు)

సిద్ధాంతాలు అధ్యయనం చేసేవారు కొందరు... అధ్యయనం చేసిన సిద్ధాంతాల్ని వేదికలపై వల్లె వేసే వారు మరికొందరు... ఆ సిద్ధాంతాల సాధన కోసమే మేము పుట్టామని ఫోజులిస్తూ నాయకులుగా చెలామణి అయ్యేవారు మరికొందరు... వీరంతా చెప్పేదొకటి.. చేసేది మరొకటి.... మాటలకు.. చేతలకు పొంతన ఉండదు... పొంతన కుదరదు కూడా... ఎందుకంటే చెప్పిన మాటల్ని చేతల్లో చూపాలంటే కొండంత గుండె ధైర్యం కావాలి.. నమ్మిన మార్గంలోనడిచేటప్పుడు ఎలాంటి అవాంతరాలు ఎదురొచ్చినా వెనుతిరిగి చూడకుండా ముందడుగు వేయగలిగే దమ్ముండాలి.. విశ్వసించిన సిద్ధాంతం కోసం ప్రాణాలర్పించడానికైనా వెనుకాడక పోరాడే నక్సలైట్లు చాలా ధైర్యవంతులు అని ఒకప్పుడు నేను అనుకునేవాడిని... కాని వారి కంటే ధైర్యవంతులు కందాళం బాలగోపాల్, భువనగిరి చంద్రశేఖర్ లాంటి వాళ్లు. సమాజంలో ఉంటూ నక్కలు, తోడేళ్ల లాంటి మనుషులతో నేరుగా పోరాటం చేసే సత్తా ఎందరికుంటుంది. అడవిలో ఉండి పోరాడేవాళ్ల కంటే వీరే మొనగాళ్లని నాకు ఆ తర్వాత చాలాసార్లు అనిపించింది. బాలగోపాల్ జీవితాంతం బూటకపు ఎన్‌కౌంటర్లు ఎక్కడ జరిగినా వెళ్లి నిజనిర్ధారణ చేసి నివేదికలను ఇచ్చేవాడు. ఇక చంద్రశేఖర్ సంగతి సరేసరి... ఏకంగా ఎస్పీపై కోర్టులో కేసు వేసి తప్పిదాన్ని నిరూపించాడు. 18 ఎన్‌కౌంటర్లు చేసిన పోలీసు అధికారిని ఢీకొనడం అంటే మామూలు విషయమా....? అందుకే వారిని తలచుకోగానే గుండె ఉప్పొంగుతుంది. సహజంగా ఎవరైనా ప్రముఖులు చనిపోయినప్పుడు ఆయన మృతి తీరని లోటు అంటూ పత్రికా ప్రకటనలు గుప్పించేస్తుంటారు. కాని బాలగోపాల్ చనిపోయినప్పుడు నాకనిపించింది నిజంగా

ఆ లోటు పూడ్చేదెవరు...? అని. సరే గుంటూరులో చంద్రశేఖర్ ఒకడున్నాడులే అని సరిపెట్టుకున్నా. ఆయన గురించి, వృత్తిపరంగా ఆయన చేసిన సాహసాల గురించి చాలా విన్నాను కాని... నాకు ఆయనతో నిజానికి ఇటీవలి వరకు ప్రత్యక్ష పరిచయం లేదు. కేవలం ఆయన చనిపోవడానికి మూడు నెలల కిందటే హైదరాబాద్ నుంచి ఒక మాజీ జర్నలిస్టు మిత్రుడు తాను రాసిన ఒక పుస్తకం కాపీని ఇవ్వడానికి చంద్రశేఖర్‌ను కలవాలని గుంటూరు వస్తే నేను వెంటబెట్టుకుని వాళ్లింటికి తీసుకువెళ్లాను. ఆ సందర్భంగా వారింట్లో ఓ ఉదయం ఆయనతో దాదాపు గంటన్నర సేపు గడిపే అవకాశం కలిగింది. ఆ కొద్ది సమయంలోనే ఆయన చాలా విషయాలు ప్రస్తావించారు. వర్తమాన పరిస్థితులపై తన అభిప్రాయాలను నిస్సంకోచంగా వెల్లడించారు. కొన్ని విషయాల్లో ఆయన తన గత అభిప్రాయాలను భిన్నంగా వెళుతున్నాడేమిటబ్బా.. అని అనిపించింది. కాని ఏవిషయమైనా ఆయన చేసే అధ్యయనం, చిత్తశుద్ధి, సునిశిత దృష్టిని మెచ్చుకోకుండా ఉండలేం. అయితే ఆయన తన ఆరోగ్యం విషయం మాత్రం మావద్ద ప్రస్తావించలేదు. తీరా ఆయన హఠాన్మరణ వార్తవిని నేను షాక్ అయ్యాను. ఏమిటి.. ఎర్రగా, బుర్రగా, యాభై ఏళ్లున్నా.... నలభైలా కనిపించే వాడు... ఈయునకు క్యాన్సర్ రావడమేమిటి.. ఇలా అర్ధంతరంగా అంతర్ధానమవడమేమిటి అనుకుని ఒక్క క్షణం మెదడు మొద్దుబారిపోయింది. మరునాడు ఆయన పార్థివ శరీరాన్ని దర్శించుకుందామని వెళ్లాను. ఆయనపై నాకు ఉన్న అభిప్రాయాన్ని ఏదో నాలుగు ముక్కల్లో రాశాను. అది ఒక ఫ్రెండ్‌కు చూపిస్తే చాలా బాగుంది. ఇది అందరికీ చేరేలా చూడు అని సలహా ఇవ్వడమే కాక పర్సులో నుంచి రెండొందలు తీసి 200 కాపీలు ఫోటోస్టాట్ తీయించి ఇచ్చారు. నేను వాటిని చంద్రశేఖర్ భౌతికకాయాన్ని చూడడానికి వచ్చిన వారికి పంచిపెట్టాను. అది చదివిన కొందరు మీకు చంద్రశేఖర్ బాగా పరిచయమా అని అడిగారు. లేదు.. కేవలం మూడు నెలల కిందట ఒకసారి కలిశాను. అంతే.. కాని ఆయన పట్ల నాకు ఉన్న అభిప్రాయాన్ని ఇలా నలుగురికి చెప్పాలనిపించి చెప్పాను అని సమాధానమిచ్చాను. ఒక మిత్రుడు చంద్రశేఖర్ చివరి రోజుల్లో వెల్లడించిన భావాలను దృష్టిలో పెట్టుకుని నువ్వు తప్పు రాశావు అని అన్నారు. చివరి రోజుల్లో అభిప్రాయాలను నేను పరిగణనలోనికి తీసుకోలేదు. ఆయన

అంతకుముందు దాకా చేసిన కృషిని విస్మరించలేము కదా... అని అన్నాను. ఆతర్వాత కొంతమంది మిత్రులు చాలా మంచి పనిచేశావు మిత్రమా అని అభినందించారు. అయినా ఇది నేను ఎవరి మెప్పుకోలు కోసమో చేయలేదు. గుండెలోని ఆవేదనను అలా బయటపెట్టాను. అంతే... నేను రాసిన దానిలో ప్రధానమైనది ఏమిటంటే... ‘‘ఐదు పదులే జీవించినా..ఐదొందల ఏళ్లకు సరిపడా చేసి వెళ్లిపోయాడు. ఆయన చూపిన మార్గంలో బడుగులకు అండగా నిలిచే మరో ‘చంద్రోదయం కోసం అన్వేషణ మొదలైంది’’ అని రాశాను. ఆ సందేశాన్ని అందరికీ అందించాలను కున్నాను. ఒక బాలగోపాల్... ఒక చంద్రశేఖర్ ఇలాంటి వాళ్లు లేని లోటు నిజంగా సమాజంలో పూడ్చలేనిది.వారి చిత్తశుద్ధికి, ఆచరణాత్మక జీవనానికి హ్యాట్సాఫ్. వీరిద్దరూ తమ తమ జీవితకాలంలో ఈ సమాజానికి తాము చేయగలిగినంత చేసి అర్ధంతరంగా నిష్క్రమించారు. వారి ఆశయాలు కొనసాగాలంటే మరో ప్రపంచం కోసం సాగే ఈ జీవితకాల రిలే పరుగులో వారందించిన కాగడాను చేతబూని పరుగు అందుకునే మరో రన్నర్ ఈ సమాజానికి చాలా అత్యవసరం. అలాంటి రన్నర్లను తయారు చేయాల్సిన శిక్షకుల అవసరం కూడా చాలా ఉంది. ఆ రన్నర్లు ఎక్కడ ఉన్నారో ముందు వెతికి పట్టుకోవాలి. కాగడాను వారి చేతికందించాలి. కాగడాను అందుకుని పరిగెత్తగలిగే దమ్మున్న వ్యక్తులకు ఇదే స్వాగతం..

రచయిత సెల్ : 970544341



# 19. ఆప్తమిత్రుడిని కోల్పోయాను...

**డొక్కా మాణిక్యవరప్రసాదరావు,** రాష్ట్ర గ్రామీణాభివృద్ధిశాఖామంత్రి

చంద్రశేఖర్ చనిపోవడం నా జీవితంలోనే అత్యంత విషాదకర సంఘటన. ఆయన చనిపోయాడనే విషయమే నేను జీర్ణించుకోలేక పోతున్నాను. మేము 1979 నుంచి గుంటూరుజిల్లా మాచర్లలో ఇంటర్మీడియట్, డిగ్రీ కలిసి చదువు కున్నాము. మేమిద్దరం రూమ్ మేట్స్ కూడా. ఆ పరిచయం, మాకు ఇద్దరికీ పెళ్ళి అయిన తర్వాత కూడా కొనసాగింది. మా రెండు కుటుంబాలు కలిసిమెలిసి ఉంటూ వచ్చాయి. కాలేజి రోజుల్లో ఇద్దరం కలిసి పాత సినిమాలు విపరీతంగా చూసే వాళ్ళం. డబ్బులు ఖర్చుపెట్టడం చంద్రకు మంచినీళ్ళ ప్రాయంగా వుండేది. మా స్నేహంలో డబ్బులు ఖర్చుపెట్టడంలో ఇద్దరం పోటీపడేవాళ్ళం. లా చదువుకునే రోజుల్లో గుంటూరులోని శంకర్ విలాస్‌కి టీ తాగటానికి ఉదయం 5 గం॥లకే వచ్చేవాళ్ళం. చంద్రను తిట్టే చనువు ఇంట్లో వాళ్ళకంటే నాకే ఎక్కువుగా వుండేది. చదువుకునేటప్పుడు ఇద్దరం ఒకే మంచంపై పడుకునేవాళ్ళం. మా ఇద్దరి మధ్య కులపరమైన, ఆర్థికపరమైన బేధాలుండేవికావు.

చంద్ర సమాజంలో విరుద్ధమైన ఆలోచనలతో కొత్తదనం వెతుక్కుంటూ వుండే వ్యక్తి. మేమెప్పుడూ ఆలోచనలమధ్య ఘర్షణ పడుతూ కూడా మా స్నేహాన్ని కొనసాగిస్తూ వచ్చాం. ఆయన మొహం ఎప్పుడూ చూడాలనిపించేది. ఇతరులను సులభంగా ఆకర్షించే స్వభావం ఆయనది. ఈ మధ్యకాలంలో ఆయనకు క్యేన్సర్ రాకముందే గ్రామ్‌సీ, జిగ్మంట్ బౌమన్ లాంటి తత్త్వవేత్తల పరిచయం నాకు ఆయన వల్లనే కలిగింది. మా మధ్య పై వాళ్ళకు సంబంధించి సిద్ధాంత చర్చలు కూడా జరిగేవి.

ఇటీవల సినిమాలలో బ్రాహ్మణులను కించ పరుస్తున్నారని వాదనలు వస్తున్నప్పుడు 'దేనికైనా రెడీ' అనే సినిమాను మేమిద్దరం కలిసే చూశాం. సినిమా చూసిన చంద్ర సినిమాను వ్యతిరేకించే వాళ్ళకు నిరసనగా గళమెత్తాడు. చంద్ర ఉపన్యాసాలు, పనితీరుకు ఆకర్షితులై ఉద్యమాల్లోకి వచ్చినవాళ్ళెందరో వున్నారు. ఎప్పుడూ పేదవారికోసం ఆలోచించే, శ్రమించే తత్వం కలవాడు.

మా స్నేహంలో ఎటువంటి దాపరికంలేదు. ఆయన మరణానికి కొద్దిరోజులు ముందు మా ఇంట్లోనే వున్నాడు. ఒకే మంచంపై పడుకొని ఎన్నో విషయాలు చర్చించుకున్నాం. కేన్సర్ మహమ్మారినుండి చంద్రని రక్షించడానికి నేను చేయని ప్రయత్నమంటూ లేదు. ఆయన లేడనే వార్త నన్నెంతో కలచివేస్తుంది. ఆయన కుటుంబంతో మేము గతంలో ఎలావుండేవారమో ఆ సంబంధాలు మున్ముందు కూడా అలాగే కొనసాగిస్తాను. చంద్ర కుటుంబానికి నా సహాయ సహకారాలు ఎప్పుడూ అందిస్తాను.



# 20. దళితుల ఆత్మగౌరవాన్ని నిలబెట్టిన చంద్రశేఖర్

**జాలాది మోజెస్, జి. శివనాగేశ్వరరావు**

బి.చంద్రశేఖర్ అంటే ఒక వ్యక్తి మాత్రమేకాదు, అనేక పార్శ్వాలున్న ఓ శక్తి. నూనూగు మీసాల నూత్నయవ్వనంలో రాడికల్ విద్యార్థి సంఘంతో మొదలైన ఆయన సామాజిక జీవితం చుండూరు కేసులో హైకోర్టులో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా ముగిసింది. ఈ 30 సం॥ల కాలంలో ఆయనలో వచ్చిన తాత్విక మార్పుల గురించి మేథావులు చర్చిస్తున్నారు. సామాన్య ప్రజలకు ఆ చర్చతో సంబంధం లేదు. ఓ వ్యక్తి ఏ విధంగా బ్రతికాడు, బ్రతికినంతకాలం ఏం చేశాడు అనే విషయాలు మాత్రమే సామాన్య జనం పట్టించుకుంటారు. ఆయన నిప్పులాగా బ్రతికాడు. నిజాయితీగా బ్రతికాడు. అవకాశవాదానికి ఎక్కడాచోటివ్వలేదు. అందుకనే ఆయనను అట్టడుగువర్గాల, అణగారిన కులాల ప్రజలు అంతగా ప్రేమిస్తున్నారు. ఆయన మరణానికి శోకిస్తున్నారు.

అన్యాయానికీ, అధికారానికీ వ్యతిరేకంగా నిరంతరం రాజీలేని పోరాటం చేశాడు. కోర్టులోపలా, కోర్టు బయటా ఆయన చేసిన పోరాటాలన్నింటి గురించీ రాయాలంటే ఓ గ్రంథమే అవుతుంది. ఆయన వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవటానికి ఆ పోరాటాలలోంచి కొన్ని మచ్చు తునకల్ని మాత్రమే ఇక్కడ ప్రస్తావిస్తున్నాం.

మీనా, సీతారామాంజనేయులు లాంటి పోలీసు నియంతల ధాటికి భయపడి, ప్రజాసంఘాల నాయకులు ఎవరూ నోరు మెదపడానికి కూడా సాహసించని కాలంలో ఆ పోలీసు ఆఫీసర్ల అక్రమాలను అడుగడుగునా ప్రతిఘటించిన ధైర్యశాలి చంద్రశేఖర్.

చలపతి, విజయవర్ధనరావుల ఉరిశిక్షను వ్యతిరేకిస్తే, సమాజం నుండి తీవ్ర నిరసనను ఎదుర్కోవాల్సి వస్తుందేమో, అప్రతిష్ట పాలవుతామేమో అని

ప్రగతిశీల మేధావులు సైతం సందేహిస్తున్న కాలంలో, ఏ మాత్రం సంశయించకుండా చలపతి, విజయవర్ధనరావుల ఉరిశిక్షల వ్యతిరేక ఉద్యమానికి శ్రీకారం చుట్టిన వాడు చంద్రశేఖర్. ఆ ఉరి శిక్షలు రద్దయ్యే వరకూ గల్లీ నుండి ఢిల్లీ దాకా నిరంతరం పోరాడినవాడు చంద్రశేఖర్.

ప్రత్యేక న్యాయస్థానంలో చుండూరు కేసును గెలిపించి, 250 సం॥ల ఆధునిక న్యాయ చరిత్రలో దళితుల ఆత్మగౌరవాన్ని నిలబెట్టినవాడు చంద్రశేఖర్. చుండూరు దళితుల విజయంకోసం ఎన్నో నిద్రలేని రాత్రులను గడిపిన వాడు చంద్రశేఖర్.

చుండూరు కేసులో సాధించింది పాక్షిక విజయం మాత్రమే అని సంపూర్ణ విజయం సాధించటానికి హైకోర్టులో దళితులపక్షాన కూడా అప్పీళ్ళు వేయాలని ప్రత్యేక పబ్లిక్‌ప్రాసిక్యూటర్ హోదాలో ప్రభుత్వానికి రికమెండ్ చేసినవాడు చంద్రశేఖర్.

బాధితుల పక్షాన హైకోర్టులో ప్రభుత్వం అప్పీళ్ళు దాఖలు చేయకపోవడానికి వ్యతిరేకంగా కొట్లాడి, లా సెక్రటరీ గారి ద్వారా అవసరమైన ఉత్తర్వులు జారీ చేయించి, తనే స్వయంగా ఆ అప్పీళ్ళన్నింటినీ తయారుచేసి హైకోర్టులో దాఖలు చేసేదాకా విశ్రమించని వ్యక్తి చంద్రశేఖర్.

పుట్టుకతో బ్రాహ్మణుడైనా ఎక్కడా బ్రాహ్మణత్వం ప్రదర్శించకుండా అగ్రకుల అణచివేతకూ, ఆధిపత్యానికీ వ్యతిరేకంగా నిరంతరం పోరాడిన వ్యక్తి చంద్రశేఖర్.

హైకోర్టులో కూడా చుండూరుకేసులో ఆయననే ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమించాలని చుండూరు దళితులు కోరుకోవటం, హైకోర్టులో తిరిగి ఆయన్నే పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమింప చేసుకోవటం ద్వారా ఆయన నిజాయితీకి, రాజీలేని తనానికీ చుండూరు దళితులు నిలువెత్తు పట్టం కట్టారు. బ్రాహ్మణుడని ఆయన్ను విమర్శించే వాళ్ళ నోళ్ళుమూయించారు. గిరీశాలు ఎన్నైనా కువిమర్శలు చేయవచ్చుగాక అణచివేతకు గురవుతున్న కులాల, వర్గాల ప్రజలు మాత్రం ఆయన్ను గుండెల్లో పెట్టుకుంటారు. ఆయన జ్ఞాపకాలను హృదయాల్లో నింపుకొని, ప్రేమతో జ్ఞాపకాలను చిరకాలం నెమరువేసు కుంటారు. అటువంటి మనిషితో కొంతకాలంపాటు సన్నిహితంగా మెలగటం మా అదృష్టంగా భావిస్తూ....

రచయిత సెల్ : జాలాది మోజెస్: 9966356601, జి. శివనాగేశ్వరరావు: 9703759523

# 21. చుండూరు దళితుల ఊచకోత కేసులో ప్రాసిక్యూషన్‌కు వన్నెతెచ్చిన స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ చంద్రశేఖర్

**నూకతోటి బాబురావు**, ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి

చుండూరు మారణకాండ..ఈ దేశంలో దళితులపై అమలవుతున్న అమానవీయ దారుణకాండకు పరాకాష్ట. అదుగో.. అట్లాంటి చుండూరు కేసులో ప్రాసిక్యూషన్‌కే వన్నెతెచ్చిన స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ భువనగిరి చంద్రశేఖర్. చుండూరు మారణ కాండ విషయంలో చాలామంది న్యాయవాదులకు భిన్నంగా, నిజాయితీగా, నిబద్దంగా కృషి చేసిన వైనమే ఆయనను దళితుల బంధువుగా మార్చింది.

చుండూరు ఈ దేశపు చరిత్రలో ఒక మానని రాచపుండు. దారుణ సంఘటనకు సంబంధించి కేసును పరిశీలించవలసి ఉన్నది. చుండూరులో అగ్రకులానికి చెందిన రెడ్లు, కాపులు పోలీసుల సహకారంతో దళిత పల్లెలోవున్న దళితులను ఇళ్ళలోనుండి చెదరగొట్టి పంటపొలాల్లో పులిచంపిన లేడి నెత్తురులా దాడిచేసిచంపారు. 6-8-1991న అగ్రకులాల దాడిలో జాలాది ఇమ్మానియేలు, జాలాది ముత్తయ్య, మల్లెల సుబ్బారావు, మంద్రు రమేష్, జాలాది ఇస్సాక్, అంగలకుదురు రాజమోహన్‌రావు, సంకూరు శ్యాంసన్, దేవరపల్లి జయరాజ్‌లు 8మంది దళితులు ఊచకోతకు గురయ్యారు. వారికి 9-8-1991తేదీన తెనాలి ప్రభుత్వ వైద్యశాలలో పోస్టుమార్టం నిర్వహించారు. పోస్టుమార్టం నిర్వహించిన డాక్టర్ రవి 'దళితుల జీవితాలు స్వాతంత్రం వచ్చి రాజ్యాంగం అమలులోకి వచ్చినా, దళితులకు జీవించేహక్కు లేకుండా ఊచకోతకు గురౌచున్నారని' ఆవేదన

చెంది ఆత్మహత్య చేసుకున్నాడంటే ఇదెంత దుర్మార్గ సంఘటనో చెప్పాల్సిన పనిలేదు.

చుండూరులో మంద్రు రమేష్ బాగా చదువుకునే యువకుడు. మంద్రు రమేష్ ఉన్నత చదువు చదువుకుని ఉద్యోగం చేసి, తన కుటుంబాన్ని పోషిస్తాడని అనుకుంటే తమ్ముడు శవం కుళ్లిపోయి, పురుగులు పట్టి ఉండటాన్ని చూసి అన్న మంద్రు పరిశుద్ధరావు గుండెపోటుతో 9-8-1991న మరణించాడు. 19-8-1991న ముద్దాయిలను శిక్షించాలని ఆమరణ నిరాహారదీక్ష చేస్తున్న కొమ్మెర్ల అనిల్ కుమార్ అనే ప్రత్యక్ష సాక్షిని పోలీసులు దారుణంగా కాల్చిచంపారు. చుండూరు దారుణ సంఘటనను నిరసిస్తూ ముద్దాయిలను శిక్షించాలని, ప్రత్యేక కోర్టు చుండూరులో ఏర్పాటు చేయాలని ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ ఆధ్వర్యంలో ఢిల్లీలో ఆందోళనా కార్యక్రమం నిర్వహించారు. ఈ ఆందోళనలో పాల్గొన్న చుండూరు బాధితురాలు గూడూరి లేయమ్మ ఢిల్లీలో ట్రాఫిక్‌లో ప్రమాదానికి గురై 3-10-1991న మరణించింది. ఆమె శవాన్ని ఢిల్లీలోనే పూడ్చివేయాల్సిన విషాదకర పరిస్థితి. చుండూరు మృత్యుకేళి, వారి బంధువులు కూడా మృతులుగా మారిపోవటం.. వంటి హృదయ విదారక సంఘటనలు తెలుసుకున్న భువనగిరి చంద్రశేఖర్ న్యాయవాదిగా తన వంతు బాధ్యతను నిర్వర్తించటానికి ముందుకొచ్చాడు. కారంచేడు కేసులో ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా సీనియర్ అడ్వకేట్ తాడిపర్తి రామ్మోహన్‌రావును నియమించినారు. వారివద్ద చంద్రశేఖర్ అసిస్టెంట్‌గా సమర్ధవంతంగా పనిచేసినారు. చంద్రశేఖర్‌లో నిఖార్సయిన న్యాయవాది పాత్రను గుర్తించిన చుండూరు బాధితులు ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా ఆయనను నియమించాలని ప్రభుత్వాన్ని కోరారు. అదేక్రమంలో బాధితుల పక్షాన న్యాయం కోసం పోరాడుతున్న ఆంధ్ర ప్రదేశ్ దళిత మహాసభ చుండూరులోనే ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేసి విచారణ చేయాలనే డిమాండ్‌తో పెద్దఎత్తున పోరాటం చేసింది. ఈ నేపథ్యంలో 11-11-1991న ప్రత్యేక కోర్టుకి ప్రభుత్వం అనుమతి ఇచ్చి హైకోర్టు అనుమతి కోసం డిసెంబర్ 4,1991న హోం కార్యదర్శికి లేఖ రాసింది.

చుండూరు కేసు ప్రత్యేక కోర్టులో విచారణ జరగటం ముద్దాయిలకు ఇష్టం లేదు. ఈ అయిష్టంతో 1993 జనవరిలో హైకోర్టులో పిటిషన్ ఫైలు వేశారు. 1994వ సం॥లో నిందితుల పిటిషన్‌ను హైకోర్టులో కొట్టివేశారు. ఐనప్పటికీ

1995లో గుంటూరులో ప్రత్యేక కోర్టులో కేసు విచారణను ప్రారంభించారు. ఈ క్రమంలోనే సాక్షులు గుంటూరు కోర్టులో తమకు రక్షణ లేదని నిరాకరించారు. అయినప్పటికీ కోర్టుకు హాజరు కావాల్సిందేనంటూ వారికి గుంటూరు ప్రత్యేక కోర్టు సమన్లు జారీ చేసింది. అంతేకాదు, కోర్టు ధిక్కారం కింద 1996 సంవత్సరం జనవరిలో 20మంది సాక్షులకు అరెస్ట్ వారెంట్ కూడా ఇచ్చారు. ఈ నేపథ్యంలోనే 1995వ సం॥లో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ బి.చంద్రశేఖర్, అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ జి. శివనాగేశ్వరరావును నియమించాలని చుండూరు సాక్షులు ప్రభుత్వాన్ని కోరారు.

20-8-2000న బి.చంద్రశేఖర్ స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా, జి. శివనాగేశ్వరరావు అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. అయితే, 2001 జూన్‌లో అప్పటి కలెక్టర్, ఎస్పీలు వీరిద్దరూ మానవ హక్కుల కార్యకర్తలని, పీపుల్స్ వార్ పార్టీతో వీరికి సంబంధాలున్నాయని ఆరోపిస్తూ ప్రభుత్వానికి లేఖ రాశారు. కానీ, దీనికి భిన్నంగా సాక్షులు వీరిద్దరూ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌లుగా ఉండాలని, వారి సమక్షంలోనే కేసు విచారణ జరగాలని ప్రభుత్వాన్ని కోరారు.అటు ఉద్యమం, ఇటు సాక్షుల డిమాండ్ నేపథ్యంలో 3-7-2003లో అప్పటి కలెక్టర్ వీరిని ప్రాసిక్యూటర్‌లుగా నియమిస్తూ ఉత్తర్వులు జారీ చేశారు.

స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా వచ్చిన చంద్రశేఖర్ తన వాదనలను ప్రారంభించారు. సాక్షులకు గుంటూరు ప్రత్యేక కోర్టులో రక్షణ లేదని, అందువల్ల సాక్షులు కోర్టుకు హాజరు కాలేకపోతున్నారని నివేదించటమే కాదు, ప్రత్యేక కోర్టు యొక్క వుద్దేశం, నేరం జరిగిన చోటే క్యాంపు కోర్టు పెట్టి విచారించాలని జిల్లా జడ్జి గారికివిన్నవించినారు. అందువల్ల ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఉత్తర్వుల ప్రకారం ప్రత్యేక క్యాంపు కోర్టు చుండూరులో ఏర్పాటు అయింది. అందుకు చంద్రశేఖర్ కృషి ఎనలేనిది. ఎట్టకేలకు 4-8-2003న చుండూరులో క్యాంపు కోర్టులో విచారణను ప్రారంభించారు.1-12-2004న సాక్షుల విచారణ ప్రారంభించారు. అప్పట్లో నిరంతర ఉద్రిక్తతల మధ్య విచారణలు జరిగాయి. చంద్రశేఖర్‌ను మానసిక వేధింపులకు పరోక్షంగా గురిచేసిన వాళ్లు ఎందరో. అయినప్పటికీ చెక్కుచెదరని న్యాయ వ్యక్తిత్వంతో చంద్రశేఖర్ నిరంతర సాధనతో, చట్టాల పరిశీలనతో 13-3-2007 నాటికి సాక్షుల విచారణను పూర్తిచేసారు.

70మంది సాక్షులను ప్రాసిక్యూషన్ వైపు నుండి న్యాయంగా జరిగింది జరిగినట్టు, చూచింది చూచినట్టు, కళ్లకు కట్టినట్టుగా సమర్థవంతంగా సాక్షుల చేత సాక్ష్యం చెప్పించిన ధీశాలి. అంతేకాదు, డిఫెన్స్ అడ్వొకేట్స్ క్రాస్ఎగ్జామినేషన్‌లో కూడా సాక్షులు చెక్కుచెదరకుండా నిజం వైపు నిలబడటానికి చంద్రశేఖర్ సమర్థవంతంగా కృషి చేశాడు. తద్వారా సాక్షుల్లో మనోధైర్యం కలిగించారు.

చివరకు 18-7-2007న ప్రాసిక్యూషన్ తన వాదనలు వినిపిస్తూ 183 పేజీల రిటెన్ ఆర్గ్యుమెంట్ సిద్ధం చేసింది. ఇందుకు సంబంధించి ముద్దాయిల నేరాలను రుజువు చేస్తూ కేసెస్ సైటెడ్ 82 కేసుల్లో వివిధ రాష్ట్రాలలోని హైకోర్టు తీర్పులను, సుప్రీంకోర్టు తీర్పులను క్యాంపు కోర్టుకు సమర్పించటంలో చంద్రశేఖర్ సఫలీకృతులయ్యారు. అంతటా ఉద్విగ్నం. ఆందోళన. ఎప్పుడు ఏమవుతుందో చెప్పలేని ఉత్కంఠ. ఇంకోవైపు చుండూరు నేరస్థులు తమ రెడ్డిగారి అధికార ప్రభావాన్ని చూపించాలనే ప్రయత్నాలు.. ఇలా లెక్కలేనన్ని ప్రయత్నాలు జరుగుతున్నప్పటికీ చంద్రశేఖర్ తొణకని, బెణకని వ్యక్తిత్వంతో వాదనలు వినిపించి పూర్తి చేశారు. ఈ కేసులో హత్యానేరంలోని ముద్దాయిలకు మరణ శిక్ష విధించాలని చంద్రశేఖర్ వాదించాడు. అందుకు సంబంధించి చుండూరులో ఐదు కిలోమీటర్ల నుండి ఏడు కిలోమీటర్ల వైశాల్యంలో మూడు గంటల పాటు దాడి జరిగిందని, ముద్దాయిలు భయానక హత్యలు రక్తపాత చర్యల నుంచి తమను కాపాడే ఏ శక్తీ భూమ్మీద లేదని దళితులు నమ్మేలా ప్రవర్తించారని, ఎస్సీలను సంహరించేందుకు ముద్దాయిలు పెను సమూహంగా చేసిన భయానక దాడి, ఆధునిక రాజ్యంపట్ల ఏ మాత్రం భీతిలేకుండా దేశంలోని చట్టాలపట్ల ఇసుమంత గౌరవంలేకుండా ప్రాణాంతకదాడికి ముద్దాయిలు పాల్పడ్డారని, తీరికగా శవాలు గోతాల్లోకట్టి కాల్వల్లో విసిరి వేసారని, సంకురు శాంసన్ కనుగ్రుడ్లు తీశారని, మండ్రు రమేష్ మరణ వార్త విని తన అన్నయ్య మండ్రు పరిశుద్ధరావు గుండెపోటుతో మరణించాడని, ఈ కేసును ప్రత్యేక కేసుగా పరిగణించి హత్యకేసులోని ముద్దాయిలకు మరణశిక్ష విధించాలని చంద్రశేఖర్ పటిష్టమైన వాదనను వినిపించినారు. దానికి అనుకూలంగా సుప్రీంకోర్టు తీర్పులను ఉటంకిస్తూ మరణశిక్ష వేయాలని చుండూరు ప్రత్యేక కోర్టుకు నివేదించాడు. 31-7-2007న సెషన్స్ కేసు నెంబర్ 36/93 కేసులో చుండూరు ప్రత్యేక కోర్టు 21 మందికి యావజ్జీవ కారాగార శిక్ష, 35 మందికి ఏడాది జైలుశిక్ష విధించింది.

అయితే, కేసులో ఉన్న మరో 123మంది ముద్దాయిలను నిర్దోషులుగా ప్రకటిస్తూ 270 పేజీల తీర్పును వెలువరించింది. అయితే, చంద్రశేఖర్ కఠోర కృషి వలన అనేక నిద్రలేని రాత్రులుగడిపి న్యాయశాస్త్రాలను క్షుణ్ణంగా పరిశీలించి వాదించినందున ఆ మేరకైనా శిక్షలు పడ్డాయి. ఈ తీర్పు పట్ల సంతృప్తి చెందని చంద్రశేఖర్ ఈ కేసులో కొంతమంది నిందితులకైనా మరణ శిక్ష విధించాల్సి వుందని, సాక్ష్యముండి కూడా శిక్షపడని వారున్నారని, తీర్పులో ఎక్కడ కూడా కుట్ర నేరం కింద శిక్షలు వేయలేదని, అక్రమంగా ఒక సమూహంగా ఏర్పడి, ఒక ధ్యేయంతో 8మందిని ఊచకోత కోసిన సంఘటనలో 35మందికి సంవత్సరం శిక్షే పడిందని, వీరికి కూడా ఐపిసి 302 సెక్షన్ కింద నేరం చేసిన వారిగా పరిగణించాలని, మొత్తం 120మంది ముద్దాయిలపై సాక్ష్యాలు ఉన్నప్పటికి శిక్షలుపడలేదని, నేరస్థులలో 56మందికే శిక్ష పడిందని, మిగిలినవారికి కూడా శిక్షలు పడాలని, అందుకు హైకోర్టులో క్రిమినల్ అప్పీలు చేయాలని ప్రభుత్వానికి నివేదికను పంపించారు.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టులో న్యాయవాది కె.బాలగోపాల్ ద్వారా క్రిమినల్ రివిజన్ కేసును చంద్రశేఖర్ వేయించారు. అప్పటి హైకోర్టు పబ్లిక్ ప్రాసిక్యూటర్ సి.నాగేశ్వరరావు ఇద్దరు ముద్దాయిలపై కేసు అప్పీలు చేశారు. చుండూరు ప్రత్యేక కోర్టు 21 మందికి యావజ్జీవ కారాగార శిక్ష 35మందికి ఏడాది జైలు శిక్ష విధించినప్పటికీ ముద్దాయిలను రక్షించటానికి హైకోర్టు పి.పి. సి.నాగేశ్వరరావు ప్రయత్నించారు. చుండూరు బాధితులు హైకోర్టులో కూడా స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్గా చంద్రశేఖర్ను అసిస్టెంట్ పిపిగా శివనాగేశ్వరరావును నియమించాలని కోరుతూ విన్నవించారు. స్పెషల్ పిపిగా చంద్రశేఖర్ను నియమించిన తర్వాత హైకోర్టు క్రిమినల్ అప్పీలు, రికార్డులను పరిశీలించగా కేవలం ఇద్దరు ముద్దాయిల మీద మాత్రవే కేసు ఫైలు చేయడాన్ని గమనించారు.అప్పుడు ప్రభుత్వం దృష్టికి ఈ విషయాన్ని చంద్రశేఖర్ తీసుకెళ్లి మరో 114మందిపై క్రిమినల్ అప్పీలు చేసి అడ్మిట్ చేయించారు. ఇంకోవైపు చుండూరు కోర్టులో చంద్రశేఖర్ వాదనా పటిమను, బాధితుల పక్షాన ప్రదర్శించిన నిజాయితీని చవిచూసివున్న నిందితులు చంద్రశేఖర్ను, శివనాగేశ్వరరావును నియమించవద్దని హైకోర్టుకు వెళ్లారు. కానీ, కోర్టు వారి వాదనలను త్రోసిపుచ్చింది. అయితే, విషాదమేమంటే, అతి కొద్ది రోజుల్లో హైకోర్టులో చుండూరు కేసు

విచారణకు వస్తున్న సమయంలో చంద్రశేఖర్ లేకపోవటం చుండూరు బాధితులకు తీరని లోటు. లక్ష్మింపేటలోనే చుండూరులాగా ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేయాలనే డిమాండ్‌ను దళిత ప్రజాసంఘాలు చేశాయి. సాధించుకున్నాయి. అదుగో.. అలాంటి దశలో శ్రీకాకుళంలోనే ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేస్తున్నట్టు జీవోను కూడా విడుదల చేశారు. అలాంటి పరిస్థితుల్లో చంద్రశేఖర్ చుండూరులోనే ప్రత్యేక క్యాంపు కోర్టు జరిగిన హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి ఉత్తర్వులు చంద్రశేఖర్ ఇవ్వటం వల్ల అవి లక్ష్మింపేట బాధితులు, దళిత సంఘాలు వారు న్యాయశాఖ కార్యదర్శికి, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి చూపించటం ద్వారా చుండూరు లాగా లక్ష్మింపేటలోనే ప్రత్యేక కోర్టు ఏర్పాటు చేస్తున్నట్టు జీవోను సవరించి ఇచ్చారు. చుండూరు కేసులో బాధితులకు అండగా నిలిచిన మచ్చలేని న్యాయవాది చంద్రశేఖర్‌ను లక్ష్మింపేట బాధితులు స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమించేలా చేసుకోవాలని ఆశపడ్డారు. ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ ద్వారా అందుకు సంబంధించిన కోర్టు రికార్డు తీసుకుని గుంటూరు బయలు దేరాలనుకుంటున్న సమయంలోనే ఆయన మరణ వార్త వినాల్సిరావటం లక్ష్మింపేట బాధితులకే కాదు దళిత ఉద్యమానికే పిడుగుపాటయింది.

ఇప్పుడు చంద్రశేఖర్ లేనప్పటికీ ఆయన ఆశయాలు మన ముందున్నాయి. చుండూరు కేసు హైకోర్టులో ఉన్న క్రిమినల్ అప్పీల్, క్రిమినల్ రివిజన్ కేసు సమర్థవంతమైన న్యాయవాదిని ప్రత్యేక పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా చుండూరు బాధితులు నియమించుకుని ముద్దాయిలకు మరణశిక్షలు, శిక్షలు పడేవిధంగా కేసును నడిపించి కృషి చేయటం ద్వారా చంద్రశేఖర్ మనకిచ్చిన స్ఫూర్తిని బ్రతికించు కోగలుగుతాం. నిజానికి ఆయనకు మనమిచ్చే నిజమైన నివాళి కూడా అదే.

మానవ హక్కులు, దళిత హక్కులు సాధించటానికి ఉద్యమించటం వల్లనే చంద్రశేఖర్ లాంటి వాళ్లను మనలో ప్రతిష్టించు కోగలుగుతాం. దళిత హక్కులే మానవ హక్కులని చాటిన మహోన్నత మానవతావాది చంద్రశేఖర్. దళిత ఉద్యమాలకు వెన్నుదన్నుగా, దళితుల ఆత్మగౌరవాన్ని నిలబెట్టిన చంద్రశేఖర్‌కు ఆంధ్రప్రదేశ్ దళిత మహాసభ కృతజ్ఞతలతో నివాళులు అర్పిస్తున్నది.

రచయిత సెల్ : 9848186277

# 22. చుండూరు కేసులో నిద్రలేని రాత్రులు

**బి. రామారావు**

ఆది నుంచి ఆయనవి అభ్యుదయ భావాలే... విద్యార్థి దశ నుంచే ఉద్యమాల్లో పాల్గొన్నారు. నమ్మిన సిద్ధాంతం కోసం రాజీలేని పోరాటం చేశారు... మొదట్లో మావోయిజం పట్ల ఆకర్షితులైనా తదనంతర మార్పులతో విముఖత చెందారు... మానవ హక్కుల పరిరక్షణ కోసం పరితపించారు... మనిషి అస్తికి లోబడటాన్ని వ్యతిరేకించారు. రాజ్యానికి మనిషిని చంపే హక్కు లేదని నినదించారు... ఆధిపత్య శక్తులు మానవ హక్కులను ఉల్లంఘిస్తున్నాయంటూ దళితుల పక్షాన నిలబడ్డారు... వారి తరఫున కీలక కేసుల్లో విజయం సాధించారు... సంపాదనాపరంగా రాణించకపోయినా ఎంతోమంది చేత 'తమ' వకీలుగా చెప్పుకునే స్థాయికి ఎదిగారు... ఆయనే భువనగిరి చంద్రశేఖర్. దేశ వ్యాప్తంగా సంచలనం సృష్టించిన చుండూరు మారణహోమంలో దళితుల పక్షాన నిలిచి న్యాయపోరాటంలో విజయం సాధించి అందరి ప్రశంసలనూ అందుకున్నారు. ఆయనతో జరిపిన 'మార్నింగ్ వాక్'లోని విశేషాలు....

**బాల్యం ...**

మాది గుంటూరు జిల్లా పల్నాడు ప్రాంతానికి చెందిన పెదకొదమగుండ్ల. మా అమ్మ పేరు సావిత్రి. ఇటీవలే మరణించారు. తండ్రి సుబ్రహ్మణ్య శాస్త్రి. మాది సామాన్య కుటుంబం. ఇద్దరు సోదరులు, ఒక సోదరి వున్నారు. మాచవరం, దాచేపల్లి, నడికుడిలో ప్రాథమిక విద్యాభ్యాసం పూర్తిచేసి ఇంటర్, డిగ్రీలను మాచర్లలో చదివాను. ఒక దశలో డాక్టర్ అవుదామనుకున్నాను. కాని విప్లవ భావాల ఆకర్షణతో ఆ ఆలోచన మానుకున్నాను. 1982లో డిగ్రీ చివరి

సంవత్సరంలో వుండగా విరసం సభలు మాచర్లలో నిర్వహించారు. అందులో ఆహ్వాన కమిటీ సభ్యుడుగా పనిచేశాను. తర్వాత గుంటూరు ఎసి కళాశాలలో లా చదివాను. ఎల్ఎల్ఎం చదివే సమయంలో యూనివర్శిటీలో ఒక విద్యార్థిని మరణించింది. దీనిపై భిన్నకథనాలు వ్యక్తమయ్యాయి. ఆ సమయంలో ప్రిన్సిపాల్‌కు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమంలో నన్ను సస్పెండ్ చేశారు. తర్వాత కాలంలో దాన్ని పూర్తిచేశాను.

**ఇంటర్‌లోనే నాటుకున్న విప్లవ భావాలు....**

నేను మాచర్లలో ఇంటర్ చదివే సమయంలో సాంబశివరావు అనే స్నేహితుడు వుండేవాడు. అతని ప్రభావంతో రాడికల్ యూత్ కార్యక్రమాల పట్ల ఆకర్షితుడనయ్యాను. అప్పటికే పీపుల్స్‌వార్ సానుభూతిపరుడుగా వున్న పూర్ణచంద్రశేఖరరావు అలియాస్ బాలయ్య తన ప్రసంగాలతో మాలో ఉత్తేజాన్ని నింపేవారు. అక్కిరాజు హరగోపాల్ (రామకృష్ణ, ప్రస్తుత మావోయిస్టు పార్టీ కేంద్ర కమిటీ సభ్యుడు) ను కూడా పార్టీ పట్ల ఆకర్షితులను చేయటంలో ఆయనే ప్రముఖ పాత్ర పోషించారు. కొంత కాలానికి బాలయ్య ప్రకాశంజిల్లా కార్యదర్శిగా వెళితే, రామకృష్ణ గుంటూరు జిల్లా పీపుల్స్‌వార్ బాధ్యతలు చేపట్టారు. 1985లో కారంచేడు సంఘటన జరిగిన తర్వాత బాలయ్య ఉద్యమం నుంచి వెళ్ళిపోయారు. రామకృష్ణ అజ్ఞాతంలోకి వెళ్ళారు.

**లా అంటే మోహం నాకు**

కవిత్వం అనేది తీరని దాహం అంటారు కదా. నాకు లా అనేది కూడా అలా రొమాంటిక్‌గా మారింది. విద్యార్థిగా వున్నప్పుడు గురజాల కాలేజీలో కొట్టుకుంటే నన్ను జైలులో పెట్టారు. ఒక లాయర్ వచ్చి నన్ను వదిలిపెట్టించారు. అప్పటి నుంచి నాకు లా మీద మోజు పుట్టింది. నాకు లాయర్‌గా వుండేందుకు ఆదర్శం కన్నబిరాన్. లా అయిపోయిన వెంటనే మీ దగ్గరికే వచ్చి ప్రాక్టీస్ చేస్తానంటే, ఆయన నీలాంటి వాళ్ళు హైదరాబాద్ వస్తే జిల్లా కేంద్రంలో మానవ హక్కుల గురించి ఎవరు మాట్లాడతారని ప్రశ్నించారు. హైదరాబాద్ వెళితే మనిషిని ఆస్తి లొంగదీసే పరిస్థితి. నేను దానిని భరించలేను. అందుకనే గుంటూరులో పాతూరి వెంకటేశ్వరరావు గారి దగ్గర చేరాను. ఆయన

నిజాయితీపరుడు. కన్నబిరాన్ నాకు తండ్రితో సమానం. మా నాన్నకు వారానికి రెండుసార్లు ఫోన్ చేసినట్లే కన్నబిరాన్‌కు చేసేవాడిని. అమెరికన్ ట్రయల్ లాయర్ లిబోవిడ్జ్‌పై అమెరికాలో ప్రఖ్యాత క్రైం రిపోర్టర్ క్రింటిన్ రెనాల్డ్స్ రాసిన 'కోర్టు రూం' అనే పుస్తకం చదివాను చాలా ఏళ్ళ క్రితం. ఇక్కడ కూడా అలా వుంటుందనుకున్నాను. అయితే బయటికి వచ్చి చూస్తే నిరుత్సాహ వాతావరణం వుంది. క్లయింట్‌లతో మాట్లాడి డబ్బులు బేరమాడుకునే పరిస్థితి ఇబ్బంది అనిపించింది.

**జర్నలిస్టుగా వెళ్ళాలనుకున్నా...**

విజయవాడ వెళ్ళి అప్పటి 'ఉదయం' పత్రికలో వున్న వసంతగారి ఇంట్లో వుండి కె. రామచంద్రమూర్తి గారిని కలుసుకున్నా. అంతకు ముందు ఆయన పిలిచినప్పుడు నేను వెళ్ళలేదు. మూర్తిగారు నన్ను నువ్వు లాయర్‌గానే బాగా పనికి వస్తావు వెళ్ళమని చెప్పారు. నేను వెంటనే వెనక్కి వచ్చి కోటు వేసుకున్నాను. ఇక తిరిగి చూడలేదు. నేను లక్షల రూపాయలు ఆర్జించలేదు. కాని లక్షల రూపాయలు సంపాదించిన వారి కంటే చాలా కేసుల్లో ఒక ఇంప్రెషన్‌ను సృష్టించాను. అదే నాకు తృప్తి.  డబ్బులతో కొలిస్తే నేను పాతాళంలో వుంటాను. నాకూ, మా ఆవిడకి కలిసి కొంత బ్యాంకు బ్యాలెన్స్, ఒక కారు వుంది. కానీ రెండు లక్షల రూపాయల పుస్తకాలు వున్నాయి. జేబు ప్రవాహంలా వుండాలి. కొత్త నీరు వచ్చి పాత నీరు కొట్టుకుపోయేలా వుండాలి. ఆస్తిని కాపాడుకునే వ్యక్తిగా నేను వుండదలుచుకోలేదు. నేను రాజ్యానికి, వ్యక్తిగత ఆస్తికి కూడా వ్యతిరేకం.

**వార్ ఉల్లంఘనలను ప్రశ్నించా... అందుకే బయటికి వచ్చా**

పౌర హక్కుల కార్యకర్తగా, బాధ్యుడుగా 1984 నుంచి 1998 వరకు పనిచేశా. నక్సలైట్లు చేసే మానవ హక్కుల ఉల్లంఘనను పౌర హక్కుల సంఘం ప్రశ్నించాలని బాలగోపాల్, మరికొంత మందిమి భావించాం. తర్వాత హైదరాబాద్‌లో సమావేశమై బాలగోపాల్ నేతృత్వంలో మానవ హక్కుల వేదికను ఏర్పాటు చేశాం. కొంత కాలం  తర్వాత మానవ హక్కుల తాత్వికతపై కూడా నాకు చాలా ప్రశ్నలు వచ్చాయి. దాంతో మానవ హక్కుల వేదికలో కూడా నేను బాధ్యుడుగా వుండాలనుకోలేదు. ఏషియా సోషల్ ఫోరమ్ సమావేశాల్లో మానవ

హక్కుల వేదిక బాధ్యులు పాల్గొనడంపై ఏర్పడిన విభేదాలతో ఆ వేదికలో కూడా బాధ్యతలు వదులుకున్నాను. మానవ హక్కులు మార్కెట్ హక్కులనే అభిప్రాయానికి వచ్చాను.

**దళిత హక్కులూ మానవ హక్కులే...**

పౌర హక్కుల ఉద్యమంలో పనిచేసేటప్పుడే దళిత హక్కులూ మానవ హక్కులే అనే భావన నాకుంది. కారంచేడు సంఘటన తర్వాత రాజ్యం, కుటుంబమే కాదు, పౌర సమాజంలో కొన్ని ఆధిపత్య శక్తులు కూడా మానవ హక్కుల ఉల్లంఘన చేయవచ్చనే చైతన్యం కలిగింది. కారంచేడు కేసులో టి. రామ్మోహనరావు వద్ద అసిస్టెంట్ పిపిగా పని చేశాను. చిలకలూరిపేట బస్సు దహనం కేసులో ముద్దాయిలు సాతులూరి చలపతిరావు, గంటెల విజయవర్ధనరావును మరణ శిక్ష నుంచి తప్పించేందుకు సత్యమూర్తి దళిత సంఘాలను కదిలించారు. దీంతో అది దళిత ఉద్యమంలా మారింది. నేను అప్పట్లో న్యాయపరంగా వాళ్ళ కోసం బాగా పని చేశాను. నాకు దళితుల్లో మంచి పేరు వచ్చింది.

**చుండూరు కేసులో నిద్రలేని రాత్రులు గడిపా...**

చుండూరు కేసులో నేను పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నియమితుడిని అవ్వటం, ఆ తర్వాత ఈ కేసును వాదించటంలో నేను ఎన్నో నిద్రలేని రాత్రులు గడిపాను. కన్నబిరాన్ నా వెనకుండి నడిపారు. నేను ఈ కేసులో ప్రాసిక్యూటర్‌గా పనికిరానని హైకోర్టులో పిటీషన్ వేస్తే ఆయన, బాలగోపాల్ నా పక్షాన నిలబడి కేసు గెలిపించారు. చుండూరు కేసులో సాక్షులను ఎన్ని ధన ప్రలోభాలు చూపెట్టినా వారు నిలబడ్డారు. కుల నిర్మూలన పోరాట సమితి, దళిత బాధితుల పోరాటసమితి తరఫున జాలాది మోజెస్ (చుండూరు ఊచకోతలో తండ్రిని, చిన్నాన్నను కోల్పోయిన వ్యక్తి) భార్య మెడలోని నగలు సైతం తాకట్టు పెట్టారు. అసిస్టెంట్ పిపి శివనాగేశ్వరరావు నాతోపాటు ఎంతో శ్రమపడ్డారు. న్యాయమూర్తి ఓపికగా 70 గంటలు వాదన విని అతి పెద్ద తీర్పుని తక్కువ కాలంలో వెలువరించారు. సామాజిక న్యాయాన్ని ప్రకటించటంలో ఆమె చూపిన ధైర్యం మిగతా వారికి ఆదర్శం కావాలి. 60 సంవత్సరాల స్వాతంత్ర్య చరిత్రలో క్రిమినల్

న్యాయ వ్యవస్థ నుంచి సామాజిక న్యాయ దాహార్తితో దళితులు వున్నారనటానికి ఈ తీర్పుకు వారు పట్టిన బ్రహ్మరథమే సాక్ష్యం.

**ఉరిశిక్ష వద్దనేది నా వ్యక్తిగత అభిప్రాయం...**

ఉరిశిక్ష వద్దు అనేది నా వ్యక్తిగత అభిప్రాయం. ప్రపంచంలో ఎక్కడా వుండకూడదని ఇప్పటికీ చెబుతా. రాజ్యానికి మనిషిని చంపే అధికారం లేదనేది నా నిశ్చితాభిప్రాయం. ఈ కేసులో స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా నేను క్రిమినల్ లాకి గొంతుక ఇచ్చిన వాడిని. చట్టం ఏమి చెబుతుందో అది చెప్పాలిగాని, నా వ్యక్తిగత అభిప్రాయాన్ని న్యాయస్థానం గదిలోకి మోసుకెళ్ళకూడదు. కృష్ణయ్యర్ లాంటి ప్రఖ్యాత న్యాయమూర్తులే ఉరిశిక్షను వ్యక్తిగతంగా వ్యతిరేకించినా కొన్ని కేసుల్లో వున్న వాస్తవాల దృష్ట్యా ఉరి శిక్ష విధించారు.

**నా జీవితంలో వైరుధ్యం...**

నా జీవితంలో ఒక వైరుధ్యం వుంది. పాశ్చాత్య నాగరికతను, మనుషులపై పెట్టుబడి పెత్తనాన్ని తీవ్రంగా వ్యతిరేకించే తాత్విక అభిప్రాయాలకు వచ్చాను నేను. ఆధునికతను వ్యతిరేకిస్తున్నాను ఇప్పుడు. పారిశ్రామిక విప్లవం సృష్టించిన ఆధునిక సమాజం మనుషులను వారి సమూహం నుంచి వేరు చేసి వ్యక్తులుగా మార్చి డబ్బు కోసం వెంపర్లాడే నీచ మానవులుగా మార్చింది. దీని నుంచి ఎంత తొందరగా బయటపడితే అంత మంచిది. మనుషులందరూ తిరిగి సమూహ జీవితంలోకి రావాలనేది నా ఆకాంక్ష. నేను అందుకే ప్రస్తుతం దేవుడిని నమ్ముతున్నాను. మావోయిజంతో సమూహ జీవనం నుంచి విడివడి ఆధునిక పాశ్చాత్యుడినైన నేను ఇప్పుడు దానిని వదిలించుకుని సమూహ జీవనంలోకి తిరిగి వచ్చేందుకు ఆరాటపడుతున్నాను. అదే సమయంలో పాశ్చాత్యులు మన దేశంపై రుద్దిన ఆంగ్లో - శాక్సన్ న్యాయ వ్యవస్థలో కోటు వేసుకుని అత్యాధునికుడిగా ఇంగ్లీషు మాట్లాడుతూ చుండూరు కేసులో వాదించాల్సి వచ్చింది. ఇది నాజీవితంలోని పెద్ద వైరుధ్యం. 60 ఏళ్ళొచ్చాక మా ఊరు (పెదకొదమగుండ్ల) వెళ్ళి పొలం కొనుక్కొని వ్యవసాయదారుడుగా స్థిరపడాలనేది నా కోరిక అంటూ ముగించారు.

- ఆంధ్రజ్యోతి సౌజన్యంతో



# 23. దళిత పక్షపాతి చంద్రశేఖర్‌కి జోహార్లు....

**దేవరపల్లి వీరయ్య**, చుండూరు దళితుల ఆత్మగౌరవ పోరాట కమిటి

భువనగిరి చంద్రశేఖర్ గారు చుండూరు దళితుల కేసు వాదించి అగ్రకుల భూస్వామ్య నరహంతకులకు శిక్షలు పడేట్లు చేయడంలో చేసిన కృషి అనన్య సామాన్యమైనది. వారు అకాల మరణం చెందడం చుండూరు దళితులకేకాక ఈ రాష్ట్రంలోవున్న ఎంతోమంది దళితులకు, అన్యాయాలకు గురైన అభాగ్యులకు, పేద వారికి తీరని లోటుగా భావిస్తున్నాను. చంద్రశేఖర్ గారిని మేము ఒక వ్యక్తిగా చూడలేదు. అయన్నొక వ్యవస్థగా చూశాం. ఏదైనా మాట్లాడాలంటే నిర్భయంగా, నిర్మొహమాటంగా మాట్లాడడం దగ్గరగా చూసిన వాళ్లలో నేనొకడిని. చుండూరు కేసు జరుగుతున్నప్పుడు కోర్టు వాదనలలో ఎంత గంభీరంగా మాట్లాడేవాడో దగ్గరగా చూశాం. బయటికి రాగానే లోపల ఏమీ జరగనట్లు చాలా సంతోషంగా ఊరి జనాలతోను సాక్షులతోను మాట్లాడటమూ చూశాం. నిజంగా వారి అకాల మరణం మాత్రం మమ్మల్ని ఎంతో కృంగతీసింది. ఎందుకంటే చుండూరు అగ్రకుల నరహంతక ముద్దాయిలకు హైకోర్టులో కూడా ఎక్కువ మందికి శిక్షలు పడేదానికి వాదించుటకు ఉద్యుక్తులై ఉన్న సమయంలో వారి మరణం నిజంగా జీర్ణించుకోలేనిది.

యిదేకాక ఎన్నో హక్కుల ఉద్యమాలు నడిపించిన చరిత్ర, వారితో సన్నిహితంగా ఉన్నవారందరికి తెలిసినదే. నాకు తెలిసి సుమారు 10 సం॥ల క్రితము చిలకలూరిపేట బస్సు దహనం కేసులో ముద్దాయిలకు స్వర్గీయ కె.జి.సత్యమూర్తి,స్వర్గీయ కన్నబిరాన్ మరియు కె. బాలగోపాల్ లాంటి ఉద్దండులతో కలసి చేసిన మరణదండన వ్యతిరేక ఉద్యమం అత్యంత

కీలకమైనదే. ఆ కేసులో జాతీయ, అంతర్జాతీయ హక్కుల ఉద్యమ నాయకులతో ఫోనులో సంభాషించినందులకే సొంత డబ్బులు సుమారు లక్ష రూపాయలు పైగా ఖర్చుపెట్టినట్లు తెలుసుకొని ఆశ్చర్యచకితులమయ్యాము. అదేకాకుండా దానికి మించి హైకోర్టు, సుప్రీం కోర్టులలో చుండూరు కేసు విషయమై తన సొంత డబ్బు లక్షలాది రూపాయలు ఖర్చు పెట్టడం, ఆ కేసులో పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా తన వాగ్ధాటితో ముద్దాయిలకు, డిఫెన్సు లాయర్లకు ముచ్చెమటలు పట్టించడం శిక్షలు వేయించడమూ చూశాం. చుండూరు దళితులేకాక దేశంలోని దళితులందరు చంద్రశేఖర్ గారికి రుణపడి ఉంటారని అశృనయనాలతో జోహార్లు అర్పిస్తున్నాను.



# 24. అతడే ఓ సైన్యం...

**కూనపరెడ్డి రవికుమార్,** గుంటూరు

భారతదేశ హక్కుల ఉద్యమంలో మనోహరంగా వెలిగిన ఒక వ్యక్తి, వ్యక్తులతో సంబంధం లేకుండా ఒక శక్తిగా పోరాడి అతడే ఓ సైన్యమై ఏ పని చేపట్టినా దాని తాలూకు విలువలకై పోరాడే ధైర్యశాలి, నీతి, నిజాయితీ, నిబద్ధతకు మారుపేరుగా నిలబడిన మహోన్నత మానవతా మూర్తి, మా గురువుగారైన భువనగిరి చంద్రశేఖర్ అకాల మరణం మాకు తీరని లోటు. బాధాతప్త హృదయాలతో, ఆర్ద్రతతో  అంజలి ఘటిస్తూ....



# 25. అంతటి అంకితభావం కలిగిన లాయర్‌ను చూడలేం

**జి. శివనాగేశ్వరరావు**, న్యాయవాది
చుండూరు కేసులో అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్

చంద్రశేఖర్ గారు ఒక కేసు టేకప్ చేస్తే అంకితభావంతో ప్రిపేరవుతారు. ముక్కుసూటిగా మాట్లాడుతూ సిన్సియర్‌గా వ్యవహరిస్తారు. క్యాన్సరుతో బాధపడుతున్నా క్లయింట్‌కిచ్చిన మాటను విస్మరించలేదు. డిసెంబరు మూడోవారంలో అనుకుంటా...నాంపల్లి కోర్టులో హత్య కేసు ఆర్గ్యుమెంటుంది. ఆయన వెళ్లాల్సిన పనిలేదు. నేను వెళ్లి ఆర్గ్యూ చేస్తానని చెప్పా. 'లేదు నాగేశ్వరరావ్.. నేను వచ్చి చెప్తానని క్లయింట్‌కు చెప్పాను.. నీవు కరెక్టుగా చెప్పినా నేను రాలేదని డిజప్పాయింటవుతారు' అంటూ వారిస్తున్నా వినకుండా బయలుదేరారు. కూర్చొనే ఓపికలేక, కారులో వెనుకసీటు వాల్చుకుని పడుకుని వచ్చి మరీ ఆర్గ్యుమెంటు ఇచ్చారు. చంద్రశేఖర్ కన్నుమూసిన మంగళవారమే కారంచేడులో దుగ్గపాటి చెంచురామయ్య హత్య కేసు విచారణ ఉంది. 'పదిరోజులు వాయిదా అడగండి.. నేనొచ్చి ఆర్గ్యుమెంటు చెబుతాను' అని 'నిమ్స్'లో మరణశయ్యపై ఉండి కూడా అన్నారు. అంతటి అంకితభావం కలిగిన లాయర్‌ను చూడలేం.



# 26. నిప్పుపై నడచిన సాహసికుడు

**ఒట్టిప్రోలు జాన్సన్**
(అప్పటి చుండూరు పునరావాస పర్యవేక్షకులు,
నేడు చుండూరులో ఆంగ్ల ఉపాధ్యాయుడు)

నీటిపై నడవమంటే
జర్రున జారి మునిగిన
అల్ప విశ్వాసుల నడుమ
నిప్పుపై నడచు, సాహసికుడిని
వెదకడం వెర్రితనమేనా?

రాయితీలకై కాయితాలుగా
అధికారుల కాళ్ళట్టుకొని
విన్నవించే వెన్నులేని వ్యక్తుల్లో
బిగించిన పిడికిలిని
తడమడం వృథాప్రయాసేనా?

ఉద్యమం పునరావాసమై
ఉక్రోషం ఉపశమనాలుగా
తర్జుమా చేసుకొనే
తర్జన భర్జనల్లో మునిగి
తన్నుకునే వాళ్ళ నడుమ

లబ్ధిదారులు కాక లడాయి చేసే వాళ్ళకై
పస్తీ వేయడం అనవసర కుస్తీనా?

జీతాలు కొలెస్ట్రాల్‌గా మారి
ఏసి గదుల్లో దొర్లే శవాలుగా
ఖరీదైన పెంకు **(Shell)** చాటు తలదాచుకొని
లక్షింపేట బాధితుల వార్తలొచ్చినపుడు
ఛానెల్ మార్చే చవకబారు
దళిత బ్రాహ్మణులున్న కాలంలో
నీలాంటివాడు ఎక్కడున్నాడని
అడగడం అమాయకత్వమా?

నా అన్నగుండెల్లో పలుగు దింపినోడిపేరు
ఎపుడో మరచిపోయిన నాకు
నీకోసం ఏర్పాటయిన సంతాపసభ
నేను చచ్చిన సంగతి నాకు గుర్తుచేసింది
వీరునికి మరణం ఉంటుందా!
హక్కుల పోరాటం చేసిన నీవే
దిక్కయిన సంగతి తలచుకుంటుంటే
నా తల గౌరవంతో వంగి నీకు నమస్కరిస్తుంది.

రచయిత సెల్ : 9963868603



# 27. మాచెర్ల చంద్రవంక

**వరవరరావు**

నాకు తెలిసిన చంద్రశేఖర్ 1980లలో నూనూగు మీసాల మాచెర్ల కాలేజి విద్యార్థి. తెలుగు సమాజ మేధో చర్చకు తీవ్రమైన నష్టాన్ని కలిగిస్తూ క్యాన్సర్ వ్యాధితో ఆయన నిమ్స్‌లో మరణించే నాటికి అతని వయస్సు 47. అంటే 1982లో పదిహేడు పద్దెనిమిది దాటని టీన్స్. ఇటు 1978 ఫిబ్రవరి వరంగల్ ఆర్ఎస్‌యు రెండవ మహాసభలు, అటు 1978 మే గుంటూరు ఆర్‌వైఎల్ ఆవిర్భావ మహాసభలు ఇచ్చిన 'గ్రామాలకు తరలండి' పిలుపు అందుకున్న నవయవ్వన తరంలోని రాడికల్ విద్యార్థి చంద్ర. నా మనసులో 1982 మే నెలకన్నా ముందు తరచుగా మాచెర్ల ప్రయాణాల్లో అక్కడ విరసం మహాసభల బాధ్యుడుగా నాకు సన్నిహితమైన చంద్ర అట్లాగే ఉండడు కదా. అప్పుడు నవనవోన్మేషంగా పెరుగుతున్న తీగ అది. ఆలంబనలను బట్టి అల్లుకుపోయింది.

1978 మే ఆర్‌వైఎల్ పిలుపు తర్వాత గుంటూరు జిల్లా రాడికల్ ఉద్యమంలో కూడా కొత్త గాలులు వీచినవి. ముఖ్యంగా 1980లో పీపుల్స్ వార్ పార్టీ ఏర్పడి గురువయ్య గారి నుంచి జిల్లా నాయకత్వం సూర్యం గారు తీసుకోవడంతో అనుభవాచరణకు యవ్వనాచరణ తోడయింది. విప్లవోద్యమ నాయకుడుగా తాను స్వయంగా యవ్వన ప్రాయంలో ఉన్న సూర్యం గారు గుంటూరు జిల్లా విప్లవ శ్రేణులకు కొత్త టానిక్ అందించాడు. ఆ నేపథ్యం ఆ ప్రభావం మాచెర్ల విరసం సభల్లో స్పష్టంగా కనిపించింది.

1982 నాటికి వరంగల్‌లో నిర్బంధం తీవ్రతరమైంది. నేను నా తెలంగాణ విమోచనోద్యమం - సాహిత్య సమాజ సంబంధాలు పరిశోధక గ్రంథాన్ని అచ్చు

వేయించుకుంటూ తరచూ విజయవాడకు వెళ్లి వస్తున్నాను. ఆ సమయంలో నిర్ణయించాం మాచెర్ల విరసం సభలు. ఎప్పుడూ జనవరిలో జరగాల్సినవి మేడేకు మారినవి. చంద్ర స్వయంగా తొలి నుంచీ త్రిపురనేని మధుసూదనరావు గారి తాత్వికోపన్యాసాలతో ఆకర్షితుడై ఉన్నా, మహాసభల కుండే రాజకీయ లక్ష్యం దృష్ట్యా నన్ను ముందు మాచెర్లలో క్లాసు చెప్పడానికి పిలిచాడు. అక్కడి నుంచి సభల క్యాంపెయిన్ మొదలు పెట్టాం. చంద్రకు కూడా ఎక్కువగా ఆ రోజులే మనసులో గుర్తుండిపోయాయేమో. ఇటీవల ఒక పోస్టల్ ఉద్యోగి పదవీ విరమణ సభలో మాట్లాడడానికి నేను, హరగోపాల్ గుంటూరు వెళ్లాం. నూతన ప్రజాస్వామిక విప్లవం - ఉద్యోగుల పాత్ర వంటి విషయం అనుకుంటాను నేను మాట్లాడింది. అప్పటికే చంద్ర న్యాయవాద వృత్తిలో కన్నబిరాన్‌ను, సామాజిక అధ్యయన, ఆచరణల విషయంలో హరగోపాల్‌ను నమూనాలుగా ఎంచుకున్నాడనుకుంటాను - హరగోపాల్‌ను వినడానికి వచ్చాడు. అయితే అప్పటికి నా ప్రసంగం పూర్తి కాలేదు. సభ అయిపోయాక మేం తిరుగు ప్రయాణంలో ఉండగా హరగోపాల్‌కు ఫోన్ చేసి పంచుకున్న అభిప్రాయాల్లో 'ఆ రోజుల్లో మమ్మల్ని ఉత్తేజపరచిన ప్రసంగాల వలె లేదు వివి స్పీచ్, చప్పగా ఉంది' అన్నట్లున్నాడు. ఆ కారణమూ నిజమే కావచ్చు. కాని అంతకన్నా పాదరస సదృశంగా మారిన చంద్ర జిజ్ఞాసకు, జ్ఞానానికి నా ప్రసంగం చర్వితచరణం అనిపించి ఉంటుంది.

కెవిఆర్, టిఎంఎస్ వంటి అతిరథులు, అక్కడే ఏర్పడబోయే ఏఐఎల్ఆర్‌సి గురించిన చర్చల కోసం వచ్చిన కాంచనకుమార్, దేవవ్రత పాండా, అనురాధ గాంధీ వంటి వివిధ రాష్ట్రాల ప్రముఖ సాంస్కృతిక కార్యకర్తలు - ఒకవైపు - మాచెర్ల, గుంటూరు కళా బృందం - బాలయ్య మొదలైనవారు సూర్యంగారి ప్రత్యక్ష పర్యవేక్షణలో అద్భుతంగా రూపొందించిన స్వాగత ద్వారం, సభా వేదిక, అమరుడు చారు మజుందార్ మొదలు శ్రీకాకుళ, గుంటూరు అమర విప్లవకారుల, సుబ్బారావు పాణిగ్రాహి వంటి విప్లవ కళాకారుల చిత్రాలు ఒకవైపు - మాచెర్ల హనుమంతు పుల్లరి పోరాటాల చిత్రాలు ఒకవైపు. ఎంతో ఉత్తేజకరమైన ఆ సభల్లో స్థానిక విరసం సభ్యుడుగా చంద్ర మహాసభల సదస్యులకు స్వాగతం చెప్తుంటే ఆ చురుకయిన చూపు, మాట - చంద్రవంక జలపాతమే. అట్లా 1984

వరకు ఎక్కువగానే కలుసుకున్నామేమో, కలిసి ప్రయాణం చేసామేమో. మాచెర్లలోనే భవిష్యత్ విరసం నాయకత్వానికి చంద్రలో మాకు ప్రామిస్ కనిపించింది. భవిష్యత్ నాయకత్వాన్ని తయారు చేసుకోవడానికి శిక్షణ ఇవ్వడానికి ఆరుగురు యువ సభ్యులను ఎంచుకుని కృష్ణా జిల్లా వల్లెర్లమూడిలో ఆరు రోజుల పాటు రాజకీయ తరగతులు 1984 వేసవిలో నిర్వహించాం. ఆరుగురిలోచంద్ర ఒకడు. పాఠాలు - టిఎంఎస్ తత్వ శాస్త్రం - కెవిఆర్ - చరిత్ర - సురా రాజకీయార్థిక శాస్త్రం - ప్రతి ఒక్కరూ రెండేసి రోజులు. మా ఎన్నిక సరియైందేనని తర్వాతి కాలం రుజువు చేసింది. చంద్రతో సహా ఈ ఆరుగురూ వేరువేరు ప్రజాస్వామిక రంగాల్లో నాయకులయ్యారు. రాష్ట్ర స్థాయి గుర్తింపును పొందారు. చక్రవేణు ఒకడు అర్ధాంతరంగా విషాద మరణానికి గురయ్యాడు.

1985-89 గడ్డు రోజుల తర్వాత చంద్రను నేను కలుసుకునే వరకు ఆయన బాలగోపాల్ నాయకత్వంలో గుంటూరు జిల్లాలోనే కాదు రాష్ట్రంలోనే ప్రముఖ పౌరహక్కుల నాయకుడయ్యాడు.

ఆ తర్వాత ఒకటి రెండుసార్లు హరగోపాల్ ఇంట్లోనో, నూర్ బాషా, చంద్ర పుస్తకాలు పర్స్పెక్టివ్స్ వేసే సందర్భంలోనో మా ఎన్కౌంటర్లు కొంచెం వేడి వేడి చర్చలుగానే ముగిసేవి. 'నూరు పూలు వికసించనీ, వెయ్యి ఆలోచనలు ఘర్షణ పడనీ' అన్న లక్ష్య ప్రకటన సమయం సందర్భం గురించి, దేశంలో ఉన్న ఉత్పత్తి సంబంధాల గురించి మా అవగాహనలు ఒకటిగా లేవనిపించింది. రాజకీయ పరిభాష వాడే విషయంలో చాల జాగ్రత్త, స్పష్టత, నిర్దిష్టత - దాని తాత్వికార్థంలో పాటించాలి అని చెప్పే టిఎంఎస్ అభిమాని అయినప్పటికీ ఆయన 'నూరు పూలు..' విషయంలో నా మావోయిస్టు ఛాందసానికి కొంటెగా నవ్వినట్లనిపించింది. అటువంటిదే అర్ధవలస - అర్ధ భూస్వామ్య సామ్రాజ్యవాద దళారీ ఉత్పత్తి సంబంధాల వెలుగులోనే నూర్ బాషా పుస్తకాన్ని చూడాలన్న నా చాదస్తమూ ఆయనకు నవ్వు తెప్పించినట్లున్నది. మార్క్సిజాన్నే ఆధునిక సిద్ధాంతమని అనుమానించే స్థితికి చేరుకున్నాక ఇటువంటి రాజకీయ విశ్లేషణల విషయంలో ఆయన అభిప్రాయాలు ఎలా మారాయో నాకు తెలియదు గానీ 1992లో గుంటూరులో జరిగిన విరసం మహాసభల్లో చంద్ర విరసం సభ్యత్వానికి ఇచ్చిన

రాజీనామా మాలో ఒక పెద్ద చర్చనీయాంశమైంది. ఎపిసిఎల్‌సి ప్రజాస్వామిక హక్కుల సంఘంగా రాజ్యహింసను వ్యతిరేకిస్తుంది గనుక ఎంఎల్‌ఎం (మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానం) తన ప్రణాళికలో సభ్యత్వ అర్హతగా పెట్టుకున్న విరసంలో తాను ఉండలేకపోవడమే కాదు హక్కుల సంఘాల కార్యకర్తలూ ఎవరూ ఉండరాదని ఆయన వాదించాడు. ఆ మహాసభలు ప్రారంభించడానికి వచ్చిన బాలగోపాల్‌ను కూడా రాజీనామా చేయాలని చాలా వాదించాడు. విరసం కూడా ఒకటో, అంతకన్న ఎక్కువ వర్గాలు రాజ్యాధికారానికి రావాలని కోరుకుంటుంది. అప్పుడు కూడా అటువంటి రాజ్యాన్ని వ్యతిరేకించవలసిన హక్కుల కార్యకర్తలు విరసంలో ఎట్లా ఉంటారు అన్నదే ఆయన వాదన. ఆయన రాజీనామా లేఖలో ఆ వాదన పెట్టాడు.

అయితే ఆ తర్వాత అతిత్వరలోనే మేం చలపతి, విజయవర్ధనరావుల ఉరిశిక్ష రద్దు ఉద్యమంలో (ముఖ్యంగా గుంటూరు, మరి ఒకటి రెండు చోట్ల జరిగిన సభల్లో), చుండూరు దళితులపై అక్కడ రెడ్డి తదితర అగ్రకులాల దాడికి వ్యతిరేకంగా జరిగిన న్యాయపోరాటంలో అప్పుడప్పుడు కలుసుకున్నాం. ఈ రెండు ఉద్యమాలలో న్యాయవాదిగా, స్పెషల్ పబ్లిక్ ప్రాసిక్యూటర్‌గా ఆయన నిర్వహించిన పాత్ర ఆయనను దళిత బంధువును మాత్రమే కాదు, ప్రజాస్వామిక హక్కుల ఛాంపియన్‌గా కూడా నిలబెట్టాయి. అయితే ఒక ఉరిశిక్ష రద్దు సభలో ఆయన మరణశిక్షను ఎంతో తాత్విక పునాదుల నుంచి వ్యతిరేకిస్తూనే హక్కుల ఉద్యమం, సామ్రాజ్యవాద కుట్ర అని మాట్లాడడం కూడ విన్నాను. ప్రాచీనమూ, ప్రాచ్యమంతా సరియైంది, ఆధునికమూ, పాశ్చాత్యమంతా వ్యతిరేకమైనది అనే కొసకాయన వెళ్లాడంటారు గానీ నాకటువంటి భేటీలు జరుగలేదు.

చంద్రతో ముక్తసరి సంభాషణలకైనా మాకు మాధ్యమం కన్నబిరాన్. ఆయన ఇంగ్లిష్‌లో రాసిన వ్యాసాలు పెద్దవైతే అనువాదానికి చంద్రకు పంపించేవాడు. తెలుగు చేసినవి నాకు పంపించమని చెప్పేవాడు. అట్లా అరుణతార కోసం ఎల్‌టిటిఇపై విమర్శనాత్మకంగా కన్నబిరాన్ రాసిన వ్యాసం తెలుగు అనువాదం చంద్ర స్వదస్తూరిలో ఇప్పటికీ నా దగ్గర ఉంది. జ్ఞాన తృష్ణ వల్ల కాకపోతే అన్ని విధాలా పాశ్చాత్య ఆధునిక ప్రజాస్వామిక భావజాలంలోని

అనుకూలాంశాలకు, అందులోనూ మార్క్సిజానికి విపరీతంగా ఆకర్షితుడైన కన్నబిరాన్ చివరి దాకా చంద్ర రోల్‌మాడల్‌గా ఉండడానికి మరో కారణం ఉండదు. బహుశా న్యాయవాదిగా తత్వశాస్త్రాన్ని, సాహిత్యాన్ని వాదనలకు జోడించే అసాధారణ ప్రజ్ఞను ఆయన కన్నబిరాన్ నుంచే అలవరుచుకున్నాడు.

కసబ్‌ను ఉరితీసినప్పుడు క్యాన్సర్ చికిత్స కోసం ముంబై వెళ్లినవాడు తిరిగి వచ్చి చర్చలో పాల్గొని మరీ వెళ్లిన చంద్ర సాహసం, విశ్వాస బలం నన్ను విచలితుణ్ని చేసినవి. అంత చిన్న వయసులోనే అంత అధ్యయనం, క్రియాశీలత ఒకవైపు, విలువలు, విశ్వాసాల పట్ల కఠోరమైన నిజాయితీ మరోవైపు - అభిప్రాయ భేదాలతో గౌరవించి స్నేహం చేయదగిన వ్యక్తిత్వం. ఎందుకనుకున్నాడో నిమ్స్‌లో చేరాక ఆఖరి రోజుల్లో నన్ను చూడాలని ఒకరిద్దరు స్నేహితులతో చెప్పిపంపాడు. నాకే వీలు కాలేదు. అంత అనారోగ్యంతో బాధపడుతున్న మనిషిని ఆఖరి క్షణాల్లో చర్చలకు, విభేదాలకు దూరంగా ప్రశాంతంగా ఉండనిద్దామనుకున్నానా! కలిస్తే గురుజాడ గురించి మొత్తంగా కాకున్నా మధురవాణి గురించి అయినా తగాదా పడకుండా ఉండే స్వభావం నాది కూడా కాదు. ఏమయితేనేం ఆయన నిమ్స్ నుంచి వెళ్లిపోయాడు. విగత ప్రాణిగా. తాను ఇష్టంగా ఎంచుకున్న మాచెర్ల ప్రాంతంలో కృష్ణా నదీ తీరానికి, ఎప్పుడూ వాదించే, ప్రశ్నించే తల ఎగరేస్తూ, కొంటె చిరునవ్వుతో ధిక్కరించే ఆ ప్రవాహం ఇప్పుడు ప్రవాహంగా లేదు. మట్టిగా మిగిలింది. అవును ఆయన కోరుకున్న దేశీ మట్టి తల్లి ఒడిలో అన్ని వాదాలకు దూరంగా ఆయన నిద్రపోతున్నాడు.



# 28. ఆ పున్నమి వెలుగుల జాడ చెరగదు

**ఎన్. వేణుగోపాల్**

అకాలంగా, అర్ధాంతరంగా వెళ్ళిపోయిన భువనగిరి చంద్రశేఖర్ గురించి ఇవాళ ఆలోచిస్తుంటే, తనతో దూరమై చాలా రోజులు గడిచినా, సన్నిహితంగా గడిపిన రోజులూ, కలసి చేసిన ఆలోచనలూ పనులూ గుర్తొస్తున్నాయి.

తనను 1981 ఫిబ్రవరిలో గుంటూరులో జరిగిన రాడికల్ విద్యార్థి సంఘం మహాసభల్లో మొదటిసారి చూసి ఉంటాను. పరిచయం కూడ అయి ఉంటాడు గాని అది అంతగా గుర్తు లేదు. ఆ తర్వాత ఏడాదికి 1982లో మాచెర్లలో విప్లవ రచయితల సంఘం మహాసభలు జరిగాయి. ఆ మహాసభల అకర్షణీయమైన స్వాగత ద్వారం దగ్గరి నుంచి ప్రాంగణం అంతటా ఉన్న అలంకారాలు, చిత్రాలు అందరినీ ఆకట్టుకున్నాయి. ఆ సభలలో చాల ఉత్సాహంగా, చురుగ్గా అన్నిచోట్లా తానే అయి పాల్గొన్న ఒక కార్యకర్తగా చంద్ర ఎంతో మంది దృష్టిని ఆకర్షించాడు. అప్పటికి ఇంకా రాయడం మొదలుపెట్టినట్టు లేడు గాని, మాటల్లో, వాదనల్లో, పనుల్లో పదును, వేగం అందరి దృష్టికీ వచ్చాయి.

బహుశా ఆ అభిప్రాయంతోనే సృజన కోసం చంద్రతో రచనలు, పుస్తక సమీక్షలు చేయించాలని సాహితీ మిత్రులులో అనుకున్నట్టున్నాం. మేమే ఆ పుస్తకం మీద సమీక్ష రాయమని అడిగామో, తనంతట తానే రాసి పంపాడో గుర్తు లేదు గాని దొమితిలా బారియోస్ ది చుంగారా రాసిన బొలీవియా గని కార్మిక మహిళల పోరాట గాథ మా కథ మీద సమీక్ష రాసి పంపాడు. హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణగా వచ్చిన ఆ పుస్తకం నా తొలి అనువాదం. సమీక్ష బాగా రాశాడు గాని, దొమితిలా పోరాటం విఫలం అయిందనీ, అందుకు కారణం

బొలీవియా సమాజాన్ని అర్ధభూస్వామ్య అర్ధవలసగా అర్థం చేసుకుని తదనుగుణమైన పోరాట రూపాలు చేపట్టకపోవడమేననీ విమర్శ కూడ రాశాడు. బొలీవియా అర్ధభూస్వామ్య అర్ధవలస అని అనలేమని, భారత విప్లవ అవగాహనలను బొలీవియా సమాజానికి అన్వయించడం కుదరదేమోనని, ఏ సమాజానికి ఏ పోరాటం తగినదో ఆ ప్రజలే నిర్ణయించుకోవాలనీ, కనుక ఆ భాగాన్ని తిరగరాయమనీ మే రాసినట్టు గుర్తు. కాని తాను ఆ మార్పుకు అంగీకరించినట్టు లేదు. ఇప్పుడు పాత సృజన సంచికలు చూస్తే ఆ సమీక్ష అసలు అచ్చే కాలేదంటే తాను తిరగరాసి పంపించినట్టు లేదు. చంద్రలో తాను నమ్మిన భావాలపట్ల ఎంత తీవ్రత ఉండేదో చెప్పడానికి ఒక ఉదాహరణ ఇది. అప్పటికి ఆర్ఎస్‌యు కార్యకర్తగా ఉన్నాడు గనుక, అర్ధవలస అర్ధభూస్వామ్య భావనను నమ్ముతున్నాడు గనుక దేన్నయినా ఆ తీవ్రత తోనే చూశాడు. ఆ తర్వాత కొన్నేళ్లకు భారతదేశం నయావలస అయిపోయిందనీ, జాతుల సమస్యే ప్రధానమనీ కూడ అంతే తీవ్రంగా భావించాడు. ఆ తర్వాత రెండు దశాబ్దాలలో తన భావాలు నాలుగైదుసార్లు గుర్తించదగిన మార్పులు పొందాయి. ప్రతి సందర్భంలోనూ అంతే తీవ్రంగా ఆ భావాలు ప్రకటించాడు. వాదనలలోకి దిగాడు.

ఆ రోజుల్లోనే నాకు బాగా గుర్తుండిపోయిన మరొక సన్నివేశం, బహుశా చెరబండరాజు మొదటి సంస్మరణ 1983 జూలై కావచ్చు. సూర్యాపేటలో సభ. నేను అప్పుడప్పుడే వక్తగా సభలకు వెళ్తున్నాను. ఆ సభలో చంద్ర, నేను వక్తలం. చంద్ర చాలా బాగా మాట్లాడాడనీ, నేను అంతగా బాగా మాట్లాడలేకపోయాననీ అనుకున్నాను.

ఆ తర్వాత మళ్ళీ చంద్రతో కలయిక గుర్తు నేను 1986 ఆగస్టులో బెజవాడలో ఆంధ్రపత్రికలో చేరిన తర్వాతనే. అంతకుముందు గంగాధర్ ద్వారా చంద్ర గురించి విషయాలు తెలుస్తుండేవి గాని, కలిసిన గుర్తు లేదు. బెజవాడలో ఆ రోజుల్లో మంచి సాహిత్య, రాజకీయ మిత్ర బృందం ఉండేది. గుంటూరు నుంచి గంగాధర్ తరచుగా వస్తుండేవాడు. ఒక స్టడీసర్కిల్ ఏర్పాటు చేయాలనీ, తత్వశాస్త్రం, రాజకీయార్థిక శాస్త్రం చదువుకోవాలనీ, చర్చించుకోవాలనీ ఒక

ప్రయత్నం మొదలుపెట్టాం. ఆ స్టడీసర్కిల్ సమావేశాలు నాలుగైదు సార్లకన్న ఎక్కువ జరగలేదు గాని చంద్ర రెండు మూడుసార్లు వచ్చాడు. అప్పుడే తాను త్రిపురనేని మధుసూదన రావు ప్రభావం నుంచి బయటపడుతూ ఉన్నాడు. అప్పుడు గుంటూరు - నాగార్జున విశ్వవిద్యాలయ బృందంలో భారతదేశం నయావలస అనే అలోచనలు, భారతదేశం విభిన్న జాతుల నిలయం గనుక ఒకే దేశవ్యాప్త పార్టీ ఉండడమే తప్పు అనే ఆలోచనలు బాగా ప్రభావం చూపుతున్నాయి. సహజంగానే ఎప్పుడూ అన్ని కొత్త గాలులకూ తలుపులు తెరిచిపెట్టే చంద్ర ఈ గాలులను కూడ ఆహ్వానించాడు. ఒకప్పుడు అర్ధభూస్వామ్య అర్ధవలస అని ఎంత తీవ్రంగా వాదించేవాడో ఇప్పుడు నయావలస అని కూడ అంతే తీవ్రంగా వాదించడం మొదలుపెట్టాడు.

అప్పటికే తాను పౌరహక్కుల సంఘం నాయకుడయ్యాడు. ఆ రోజుల్లో పౌరహక్కుల సంఘం సభల్లోనో, ఇతర సభల్లోనో రెగ్యులర్‌గా కలుస్తుండే వాడు. కొద్ది కాలానికే ఆంధ్రపత్రిక మూతపడి నేను బెజవాడ వదిలి, ఉద్యోగాన్వేషణలో హైదరాబాదుకూ, అక్కడ్నించి బెంగళూరుకూ వలస పోయాను గనుక చంద్రను కలవడమూ, చంద్ర గురించి వినడమూ తగ్గిపోయాయి.

మళ్ళీ చంద్రను చూడడం గుంటూరులో 1992 జనవరిలో విరసం సభల సందర్భంగా. వేంకటేశ్వర విజ్ఞాన మందిరంలో సభ జరుగుతుండగా సభలోకి పోలీసులు తోసుకుని వచ్చారు. అప్పటికే న్యాయవాదిగానూ, పౌరహక్కుల సంఘం నాయకుడిగానూ ఉన్న చంద్ర ఆ సి.ఐ. నీ పోలీసులనూ నిలువరించి ప్రధాన ద్వారం దగ్గర గట్టిగట్టిగా వాదిస్తున్న దృశ్యం నాకింకా కళ్లలో ఆడుతోంది.

తర్వాత రెండు మూడేళ్లకనుకుంటాను పర్‌స్పెక్టివ్స్ ప్రచురణగా తన తొలి పుస్తకం శాక్కో వాంజెట్టీ వెలువడింది. పరిశోధకుడిగా, సృజనాత్మక రచయితగా తన శక్తికి గొప్ప నిదర్శనం ఆ పుస్తకం. ఆ రోజుల్లో ఉండిన వాదవివాదాలకు సూచికగా ఆ పుస్తకానికి రావలసినంత ప్రశంస రాలేదు. పుస్తకం కన్న ఎక్కువగా దానికి బాలగోపాల్ రాసిన ముందుమాట మీదనే చర్చ, వివాదం జరిగాయి. తర్వాత కాలంలో పౌరహక్కుల సంఘం నుంచి చీలి, మానవ హక్కుల వేదిక

ఏర్పడి చంద్ర దానితో వెళ్ళిపోవడం, పోస్ట్ మాడర్నిజం చర్చలో అటువేపు తూగడం వినీ చూసీ కాస్త విచారం కలిగినా, చిలకలూరిపేట ఉరిశిక్ష బాధితుల కేసులోనూ, చుండూరు దళితుల హత్యాకాండ కేసులోనూ, ఎన్జీవోల కథ పుస్తక రచనలోనూ తన కృషి, కార్యదీక్ష తనమీద గౌరవాన్ని ఇనుమడింపజేశాయి.

ఆ తర్వాత నేను సభల కోసం చాలాసార్లు గుంటూరు వెళ్ళినప్పటికీ ఆ సభలకు చంద్ర రావడం తగ్గిపోయింది. నేనూ వెళ్ళి తనను కలవలేక పోయాను. 2000 తర్వాత నాలుగైదుసార్లు కూడ కలిసి ఉండం. తన ఆలోచనలలో మార్పులు, పౌరహక్కుల ఆలోచనలను ఆధునికతలో భాగంగా చూసి తిరస్కరిస్తున్నాడనీ, మానవ హక్కుల వేదికను కూడ వదిలేశాడనీ వివరాలు, కాస్త ఎక్కువగానే మద్యం సేవిస్తున్నాడనే ఫిర్యాదులు, ఆధునికపూర్వ దశకు వెళ్లాలంటూ దైవభక్తీ, పూజా పునస్కారాలూ కూడ మొదలుపెట్టాడనే మాటలు వింటూ వచ్చాను గాని అవి మంచీ అనుకోలేదు, చెడూ అనుకోలేదు. అప్పటికి ఇరవై ఏళ్లకు పైగా చంద్రలో అనేక మార్పులు చూస్తున్నవాడిగా ఈ దశ ఎంతకాలమో అనుకున్నాను.

ఈ మధ్యలో చంద్ర గురించి ప్రస్తావన తరచుగా కన్నబిరాన్ గారి దగ్గరే వస్తుండేది. ఆయనకు చంద్రమీద చాలా ప్రత్యేకమైన అభిమానం ఉండేది. తన లైబ్రరీ నుంచి ఎన్నో పుస్తకాలు చంద్రకు ఇచ్చారు. నాతో ఎన్నోసార్లు చంద్ర గురించి చాలా ప్రశంసగా మాట్లాడారు.

బహుశా చాలా ఏళ్ల తర్వాత కసబ్ ఉరిశిక్ష ప్రకటించిన రోజు చంద్రకు ఫోన్ చేశాను. నువ్వు నువ్వు అనుకునే వాళ్లమే గాని, నేను నువ్వని మొదలు పెట్టినా తాను మీరన్నాడు గనుక నేనూ మీరులోకి దిగవలసి వచ్చింది. ఫోన్‌లో వెనుకనుంచి మంత్రోచ్చాటన వినబడుతోంది, తానెక్కడో గుడిలో ఉన్నాడనిపించింది. కసబ్‌కు ఉరిశిక్ష వేశారు. ఈసారి వీక్షణంకు మీరు వ్యాసం రాస్తే బాగుంటుంది. రాయగలరా అన్నాను. ఉరిశిక్ష, పౌరహక్కులు, ఆధునికతల మీద నా అభిప్రాయాలు మారిపోయాయి, నేనిప్పుడేమీ రాయలేను అన్నాడు. అయినా ఇప్పుడు నేను కేరళ, తమిళనాడు గుళ్లు తిరుగుతున్నాను, రాద్దామనుకున్నా రాసే తీరికలేదు అన్నాడు.

మూడు సంవత్సరాల కింద నా జీవితంలోని అత్యంత దురదృష్టకరమైన ఘట్టంలో ఒక టెలివిజన్ ఇంటర్వ్యూలో నా గురించి అన్యాపదేశంగా తన అభిప్రాయం విన్నాను. తనను చర్చకు పిలిచారో, తానే జరుగుతున్న చర్చలో జోక్యం చేసుకుని మాట్లాడాడో గుర్తులేదు గాని, ఒక పాలకవర్గ రాజకీయ నాయకుని మీద ఒక విప్లవ కళాకారుడు పాట రాసిన సందర్భంపై చర్చ అది. ఇటువంటి అమాయకులను ఎందుకు ప్రశ్నిస్తారు. అన్నీ తెలిసినవారు, నాయకులుగా ఉండేవారు ఇటువంటి తప్పులు చేసి మౌనంగా ఉంటున్నారు అని అర్థం వచ్చే మాటలు చాలా ఏవగింపుతో, అకారణ, అనవసర ద్వేషంతో అన్నాడు. నేను చేసిన తప్పుమీద అప్పటికే నేను ఒకటికి రెండుసార్లు బహిరంగంగా క్షమాపణ చెప్పి ఉన్నాను. తన స్పందన చూసి ఆశ్చర్యం కలిగింది. నా అభిప్రాయాలు మారాయని అపోహపడినా, తానే ఎన్నోసార్లు అభిప్రాయాలు మార్చుకున్నవాడు మార్పును అంగీకరించలేకపోయాడా? నా అభిప్రాయాలు మారలేదని, ఘోరమైన తప్పిదం చేశానని, అందుకు ప్రజల ముందర, ఉద్యమం ముందర తలవంచుకుని నిలబడి ఉన్నానని చెప్పిన తర్వాత తానూ మరొక రాయి విసరడానికి పూనుకున్నాడా? వెంటనే ఫోన్ చేసి అడుగుదామని అనుకున్నాను. ఆ ఆలోచన అలా మెరమెరలాడుతూ, మూడు సంవత్సరాలు గడిచాయి. నేనేమిటో కాలమైనా చెప్పలేదా అని అడుగుదామనీ అనిపిస్తూ ఉండేది.

మరణానికి కొద్దిరోజుల ముందు చంద్రకు కాన్సర్ అనీ, ఎక్కువకాలం బతికే అవకాశంలేదనీ తెలిసింది. ఇక ఈ మనిషి వెళిపోతున్నాడు. తప్పులే చేశాడో, ఒప్పులే చేశాడో, అర్థమే చేసుకున్నాడో, అపార్థమే చేసుకున్నాడో, యాభై సంవత్సరాల జీవితానికి సరిపడా, కాదు ఎక్కువే, సమాజానికి తాను ఇవ్వవలసింది ఇచ్చాడు. ప్రశాంతంగా, బాధారహితంగా, సస్నేహంగా, సగౌరవంగా వెళ్ళిపోదగిన జీవితం గడిపాడు. పున్నమి వెలుగులు పంచాడు. బహుశా కొందరికి మచ్చలనింపిచినా వాటితో సహా ఇవాళ అమావాస్య అయినంత మాత్రాన ఆ పున్నమి వెలుగుల జాడ చెరిగిపోతుందా అనిపించింది.



# 29. చంద్రశేఖర్‌తో నా పరిచయం

**దేవరకొండ బాలగణపతి,** అసోసియేట్ ప్రొఫెసర్, ఫిలాసఫీ డిపార్ట్‌మెంట్,
ద్రవిడ యూనివర్శిటీ, కుప్పం

చంద్రశేఖర్‌తో నా పరిచయం B.T.R. ద్వారా జరిగింది. నేను జమ్ములోని మాతా వైష్ణోదేవి విశ్వవిద్యాలయం Indian Theory of Language and Logic మీద Prof. V.N. Jha ఆధ్వర్యంలో జరుగుతున్న వర్క్‌షాప్‌కి వెళదాం రమ్మని B.T.R.ని అడిగితే దానికి B.T.R., నా మిత్రుడు లాయర్ ఒకాయన కూడా వర్క్‌షాప్‌కి రావడానికి Interest చూపుతున్నాడని చెప్పారు. ఆ లాయర్ మిత్రుడే చంద్ర. ఈ Interest చంద్రకి గల జ్ఞాన తృష్ణని తెలియచెప్పే ఒక ఉదాహరణ మాత్రమే. అది 15 రోజుల వర్క్‌షాప్. Prof. V.N. Jha is a serious Intellectual. 15 రోజులు ఒక Non-Academic Person ఆ వర్క్‌షాప్‌లో పాల్గొనడం కొంచెం కష్టమైన విషయయే. In fact నాకు B.T.R కి కూడా చంద్ర కంపెనీ వల్లనే ఆ వర్క్‌షాపు కొంచెం ఉల్లాసంగా ఇంకొంచెం ఉత్సాహంగా జరిగిందంటే అతిశయోక్తి కాదేమో. మేం ముగ్గురం రోజూ సాయంత్రం చాలా విషయాలు చర్చించుకునే వాళ్ళం. కొంతమంది తమ అభిప్రాయాలని తమ వ్యక్తిత్వాన్ని చాలా తొందరగా చాలా forceful గా బయట పెట్టేస్తారు. మరికొందరు అంత తొందరగా బయటపడరు. చంద్ర మొదటి కోవలోకి వస్తే నేను బహుశా రెండవ కోవలోకి వస్తాను. కాని B.T.R.కి చంద్రకి గల ఎన్నో ఏళ్ళ చనువు, clarity in Intellectual stand points వల్ల ఈ చర్చలు చాలా వరకు చూసేవాళ్ళకి యుద్ధాలుగా కనపడుతూ ఉంటాయి. స్వతహాగా లాయర్ అవడంవల్ల మాటలతో చంద్రని గెలవడం - అంత వరకు ఎందుకు 'ఒప్పించడం' కూడా చాలా కష్టం.

అలా అని తాను ఏదిపడితే అది నమ్ముతాడనో, నమ్మిన దానిని గుడ్డిగా ఫాలో అవుతాడనో కాదు. ప్రతి విషయాన్ని కూలంకషంగా చర్చించాకే నమ్ముతాడు. అలా అని చంద్ర rationalist అంటే ఏమో దీనికి B.T.R. లాంటి ఆప్తమిత్రులే సమాధానం చెప్పాలి.

చంద్ర, B.T.R., నేను కలసి వైష్ణోదేవి గుడికి నడుచుకుంటూ వెళ్ళడం ఒక మంచి అనుభవం. సాయంత్రం 3 గం॥లకి బయలుదేరితే రాత్రి 10 గం॥లకి కొండపైకి చేరుకొన్నాం. అక్కడి వైష్ణోదేవి దర్శనం చేసుకొన్నాక, తిరుగు ప్రయాణం గురించి కొంచెం Discussion జరిగింది. 'రాత్రి అక్కడ పడుకుందాం తిరిగి ప్రొద్దుటే వెనక్కి బయలుదేరుదాం' అని నేను - 'కాదు వెంటనే బయలు దేరుదాం' అని చంద్ర. '7 గంటలు నడిచాక, ఇంక నడవడం కష్టం అని, అక్కడే కంబళ్ళు అద్దెకి తీసుకుని ఆరుబయట పడుకొని ప్రొద్దున్నే బయలుదేరుదాం' అని నేను - 'లేదు. ఇప్పటి వరకు కష్టపడి నడిచాం - ఇప్పుడు రిలాక్స్ అయితే ఇంక muscles పట్టేస్తాయి. - కనుక రిలాక్స్ అవకుండా slow గా వెనక్కి బయలుదేరితే జాగ్రత్తగా రూమ్‌కి చేరుకుని - తర్వాత రిలాక్స్ అవ్వవచ్చున్నది' చంద్ర వాదన. ఫైనల్‌గా చంద్ర చెప్పినట్టుగానే వెంటనే బయలుదేరాం. ఉదయం 5 గంటల కల్లా వెనక్కి కొండ కిందకి చేరుకున్నాం. ఇక్కడ Interesting విషయం ఏంటంటే చంద్ర యొక్క knowledge of psychology helped us in coming back quickly and comfortably వెన్నెల్లో చల్లగా శ్రమపడకుండా.

ఒకసారి 'సిటిజన్‌షిప్' మీద Seminar organize చేస్తూ చంద్రని Invite చేశాను. తప్పకుండా వస్తానన్నాడు కాని somehow because of some unexpected program change వల్ల హైదరాబాదుకు వెళ్ళవలసి వచ్చింది చంద్ర. కాని ఆయనకి ఉన్న Intellectual love వల్ల రాత్రికి రాత్రి కార్లో బయలుదేరి సెమినార్ రెండో రోజు మధ్యాహ్నానికి చేరుకున్నాడు. ఆయన Present చేసిన ideas గురించి చాలా మంచి discussion జరిగింది. ఆయన కూడా academic discussion ని in and outside seminar hall బాగా ఎంజాయ్ చేశాడు. His commitment to the academics is really many times greater than the academicians of the University.

నన్ను చాలాసార్లు గుంటూరుకి రమ్మని పిల్చాడు చంద్ర. కాని దురదృష్టం కొద్దీ నేను వెళ్ళలేకపోయాను. గుంటూరులో చంద్రని కలసి ఆయన లైబ్రరీ చూడాలనే కోరిక అలాగే ఉండిపోయింది. చంద్ర నాకు audio form లో పరిచయం చేసింది, యల్లంరాజు శ్రీనివాసరావుగారి అద్వైత lectures. ఇవి నాకు ఎంతో నచ్చాయి. ఇందుకుగాను నేను చంద్రకి ఎంతో ఋణపడి ఉంటాను.

రచయిత సెల్ :9347579967



# 30. కలవకముందే విడిపోతే...

## (చంద్రుని చల్లని జ్ఞాపకాలు)

**ప్రసూన,** టీచర్, రేణిగుంట

ఉదయాన్నే కాఫీ కలుపుకొని, చేతిలోకి దినపత్రిక తీసుకున్నాను. చక్కని, పరిచిత రూపం... చంద్రశేఖర్‌గారు. "ఈసారి ఏ విజయం సాధించారో..." నని అనుకుంటూ ఫోటో కింద అక్షరాలను చూసేసరికి ఒక్కసారి గుండెలయ తప్పింది. "మూగవోయిన హక్కుల స్వరం" అని చూడగానే కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయి. అక్షరాలను కూడ బలుక్కుంటూ గబగబా చదివాను. ఒక్కసారిగా దుఃఖం పొంగుకొచ్చింది. పెద్దగా టి.వి. చూసే అలవాటు లేని నాకు, ఈ వార్త ఓ పూట ఆలస్యంగా తెలిసింది. నా ఒంటరి జీవితంలో నా దుఃఖాన్ని పంచుకునేందుకు ఎవరూ లేరు పక్కన. ఓ పత్రికలో పనిచేస్తున్న ఆప్తమిత్రునికి ఫోన్‌చేసి భోరున ఏడ్చేసాను. 'వెళ్ళాలి. తనను కడసారి చూడాలి. ఎలా? ఎవరితో వెళ్ళను?' అనుకుంటూ చంద్రగారి ఫోన్‌కే call చేసాను. వాళ్ళ అన్నయ్య తీసుకున్నారు. వివరాలు తెలుసుకున్నాను. బాధ, వేదన, దుఃఖం... ఇలా జరగడానికి వీల్లేదు. కానీ జరిగింది. నిజం! నమ్మాలి, తప్పదు. ఈ బాధను భరించాలి...

అందరూ అనుకోవచ్చు ఎవరో గుంటూరు జిల్లాలో పేదల పక్షాన పోరాడే ఓ లాయర్ కోసం, ఎక్కడో చిత్తూరు జిల్లాలో పాఠాలు చెప్పుకునే ఓ టీచర్ ఇలా కన్నీళ్ళు పెట్టుకోవడమేంటని...?! చేతిలో ఉన్న ఈ దిన పత్రికే కదూ...!

నా ఆలోచనలు సంవత్సరం వెనక్కి వెళ్ళాయి. ప్రాణ ప్రదంగా ప్రేమించిన జీవన సహచరుడి అకాల మరణంతో జీవచ్ఛవంలా బ్రతుకుతున్న సమయంలో తన పరిచయం ఎంతో ధైర్యాన్ని, ఊరటను ఇచ్చింది. కన్నబిరాన్‌గారి మరణం తరువాత ఆయనతో ఉన్న అనుబంధాన్ని వ్యాసంగా రాసారు చంద్రగారు. చివర్న

తన Phone Number వుండడంతో, అభినందిస్తూ Message పెట్టాను. అలా అయిన పరిచయం, చంద్రగారి ఇతర వ్యాసాలు కూడా చదివేలా చేసాయి. ముఖ్యంగా పాలోకొయిలో రాసిన 'అల్ కెమిస్ట్'పై తన విమర్శనాత్మక వ్యాసం. తరువాత తను రాసిన "శాక్కొ - వాంజెట్టి' పుస్తకాన్ని అభినందనలతో పంపడం ఎప్పటికీ మరచిపోలేను. తనచేతి వ్రాతను కన్నీళ్ళతో తడిమి చూసుకుంటాను ఇప్పటికీ...

మాటల్లో ఒకరి గురించి ఒకరు చెప్పుకున్నవి గుర్తొస్తున్నాయి. ఒకరికి తెలియకుండా ఒకరం ఒకే ఉద్యమ బాటలో నడిచామని ఇద్దరికీ ఆశ్చర్యం, ఆనందం. చుండూరు, చిలకలూరిపేట కేసులో విజయాలకు నాకు సంతోషం వేస్తే, నా జీవితంలోని విషాదాలకు తనకు బాధేసింది. ఉద్యమంలో ఒక సహచరుణ్ణి, తరువాత మరొకర్ని పోగొట్టుకున్న నాకు ఎంతో ధైర్యం చెప్పారు. ఎప్పటికీ తోడుగా, మంచి స్నేహితునిలా ఉంటానని మాటిచ్చారు. జీవితపు ఎడారిలో ఒయాసిస్సులాంటి తన స్నేహం నా ఆయుష్షుని పొడిగించింది. "నువ్వెప్పుడూ సంతోషంగా ఉండాలిరా" అన్న చంద్రగారి మాటల్ని నేనెప్పటికీ మరువలేను. సగటు, మధ్య తరగతి అమ్మాయి మనస్థత్వాన్ని అధిగమించలేని నేను చంద్రగారి మీద మానసికంగా ఆధారపడడం మొదలు పెట్టాను నాకు తెలియకుండానే... కొద్దిరోజుల్లోనే ఈ విషయం ఇద్దరికీ అర్ధం కాసాగింది. ఏమనుకున్నారో ఏమో... హఠాత్తుగా నేను పంపిన gift pack ని తిరిగి పంపేశారు. చాలా బాధపడుతూ కారణం అడిగితే.... "I don't want to be your agony అని Message ఇచ్చారు. అప్పటికే తనకు cancer ఉన్నట్లు తెలిసిందేమో?! నేను, నా మనస్థత్వం అర్ధమైంది కనుకనే పూర్తిగా మాట్లాడ్డం మానేసారు. ఎప్పుడైనా "ఎలా ఉన్నారని" Message పెట్టినా reply ఇచ్చేవారు కాదు. తను అనుకున్నది ఆచరణలో పెట్టగల పట్టుదల కనిపించింది నాకు చంద్రగారిలో.

కొన్నాళ్ళకు వేసవి శెలవుల్లో ఆయన్ను ఒక్కసారైనా చూడాలని, మా కజిన్‌ను తోడుతీసుకొని, గుంటూరులోని తన Office కు వెళ్లాను. ఎవరో Co-lawyers ఉన్నారు. చంద్రగారు సిగరెట్ తాగుతూ బయటకొచ్చారు. ఆ వాసన నచ్చని నేను, ముక్కు మూసుకుంటే... ఎవరని అడిగి లోపల కూర్చోమన్నారు. ఎండనపడి వచ్చిన బడలిక కనిపించిదేమో, ముందు తాగడానికి నీళ్ళిచ్చారు. కుశల ప్రశ్నలకు భయపడుతూనే జవాబు చెప్పాను. 'Hit and run' incident లో

చనిపోయిన మా కజిన్ case గురించి సలహా అడిగాను. వివరాలు తెలుసుకున్నాక, ఏమి చేయాలో చెప్పారు. చివర్లో కాస్త భయంగానే "మీరెందుకు నాతో మాట్లాడ్డం లేదు" అని అడిగాను. "చెప్పానుగా emotional dependence పెరుగుతోంది మీకు. అది ఇద్దరికీ ఇబ్బందే కదా! అంతేగాని ఇంకేం లేదు" అన్నారు. "నేను balance చేసుకుంటాను" అంటే నవ్వి ఊరుకున్నారు... అదే మొదటిసారి, చివరిసారి ఆయన్ని చూడడం... ఆ తర్వాత కూడా చంద్రగారిని పలుకరిస్తూనే ఉన్నా Message ద్వారా. ఎప్పుడూ Reply రాలేదు. మళ్ళీ విగత జీవుడిగా ఈ పత్రిక ద్వారానే చూడడం ఎంత బాధాకరం?!

ఉద్యోగ బాధ్యతలు, ఒంటరిగా ఎక్కడికీ వెళ్ళలేని నా బలహీన మనస్థత్వం వలన చంద్రగారిని చివరిసారి చూడలేకపోయాను. బ్రతికున్న ఆయన రూపమే మనసులో నిలిచిపోయింది.

చంద్రగారి అంతిమయాత్రతో గుంటూరు జనసంద్రమైంది. శాశ్వతంగా వెళ్ళిపోయారు తన కుటుంబాన్ని, బాధ్యతల్ని, తన కలల్ని, మనల్ని వదిలి... ఇక ఎప్పటికీ కనిపించరంటే ఆ వేదనని అనుభవించే వాళ్ళకే తెలుసు.

ప్రేమించి, పెళ్ళాడిన సహచరుణ్ణి పోగొట్టుకున్న వేదన, వెలితి, దుఃఖం నాకు తెలుసు. ఆయన జీవన సహచరి చంద్రికగారిని పలుకరించాలనే తపన నన్ను నిద్రపోనివ్వలేదు. ప్రతి రోజూ పత్రికల్లో ఆయన కోసం రచనల వెల్లువ. చదువుతుంటే ఎన్నో విషయాలు తెలిసాయి.

చంద్రగారి సంస్మరణ సభ Cards కూడా నాకే పంపారు ఆయన assistant రవిగారు. తిరుపతిలోని మిత్రులకు అందజేసాను వాటిని. అప్పుడు కలిశారు Dr. D.V.R. గారు. కొండంత అండగా డాక్టర్‌గారుండగా రాత్రంతా ప్రయాణించి, తెల్లవారుఝామున నడికుడిలో దిగాము. స్టేషన్‌లో అవల ఉన్న వంతెన దాటగానే దాచేపల్లి. చంద్రగారు పుట్టి పెరిగిన పల్నాటిసీమలోని ఓ చిన్న ఊరు. చలిగాలి రివ్వున తాకగానే చంద్రగారు పలుకరించిన అనుభూతి. నడుస్తుంటే ఈ చోటనే ఆయన అడుగులుపడి ఉంటాయనే భావన గుండెను మరింత బరువెక్కించింది. కళ్ళల్లో నీళ్లు తిరుగుతుంటే వంగి నేలతల్లిని తాకాను. కాస్త దూరం వెళ్ళగానే 'భువనగిరి చంద్రశేఖర్ అమర్ రహే' అనే banners కనిపించాయి. చంద్రుడైనా సూర్యునిలా ప్రకాశించిన ఆయన తేజస్సు గురించి మాటల మాలికలల్లి కట్టారు ఆయన మిత్రులు, అభిమానులు. అది ఆయన

పుట్టి, పెరిగిన ఇల్లని తెలీక, ఆ తెల్లవారు ఝామున అలా బ్యానర్లన్నీ చదువుకుంటూ ఊరంతా తిరిగాము నేను, డాక్టర్‌గారు. బాగా చలిగా ఉంది ఒణుక్కుంటూ కాస్త సేదతీరి, ఉదయాన్నే బయలుదేరి, దారి పొడవునా కలిసిన మిత్రులతోడి చంద్రంగారింటికెళ్ళాము. నా కళ్ళు చంద్రగారి సహచరి కోసం వెదుకుతున్నాయి. అంతలో ఎవరో వచ్చి పలుకరిస్తుంటే 'ఎంతో నిబ్బరంగా నిలబడి' బదులిస్తున్న చంద్రికగారు కనిపించారు. ఆమెను ఎలా పలుకరించాలో, ఏమని ఓదార్చాలో అర్థం కాక అలా కన్నీళ్ళతో చూస్తుండిపోయాను. ఎవరు పూడ్చలేని వెలితిని భరిస్తూ నిలబడ్డ ఆమె స్థైర్యాన్ని చూసి, నేను ధైర్యం తెచ్చుకున్నాను. దగ్గరకెళ్ళి మౌనంగా ఆమె చెయ్యందుకొని నిబడ్డాను. అంతలో చంద్రికగారి అమ్మగారు, చెల్లెలు కనిపిస్తే ఎలా జరిగిందో వివరాలు తెలుసుకున్నాను. CMC Hospital కు తీసుకెళ్ళుంటే ఆయన బ్రతికేవారేమోననే భావన నన్నిప్పటికీ వీడలేదు. కాస్త తేరుకున్నాక పరిసరాలను గమనించాను. ఎప్పుడో కట్టిన పాతకాలం ఇల్లు. ఇంటిముందు పూల మొక్కలు, బావి. పందిళ్ళువేసి భోజనాలు తయారు చేస్తున్నారు. చంద్రగారి ఏకైక కుమారుడు శశాంక్, వాళ్ళ నాన్నగారు, సోదరులలో ఆయన పోలికలు కనిపించాయి. ఆయన్నే చూసినంత సంతోషం నాకు. సామాజిక ఉద్యమ నేపథ్యంలో ఏర్పడిన బంధువులే ఎక్కువమంది కనిపించారు. డాక్టర్‌గారు నన్ను కొంతమందికి పరిచయం చేశారు. అందరూ ఆయన విద్యార్థి దశ నుంచి, వృత్తి దశ వరకు ఉన్న ఆచరణ, పోరాటపటిమ, పట్టుదల, జనంపట్ల గల ప్రేమ గురించే మాట్లాడుకుంటున్నారు గుంపులు గుంపులుగా. నేను మాత్రం చంద్రగారి ఫోటో ఆ పందిట్లో ఉంటే దానికి పూలమాలవేసి చూస్తూ, అందరి మాటలు వింటూ కూర్చున్నాను. ఒకటే దుఃఖం. ఆగని కన్నీళ్ళతో ఉన్న నన్ను కొందరు ఆశ్చర్యంగా గమనించారు. మధ్యాహ్నం భోజనం చేస్తుంటే ముద్ద దిగలేదు. ఒక్కసారైనా చంద్రగారితో కలసి భోజనం చేయాల్సిన నేను, ఆయన లేకుండా సంస్మరణ భోజనం చేయాల్సి రావడం ఎంత విషాదం?!

సాయంత్రం దాచేపల్లి జూనియర్ కళాశాలలో అందరూ సమావేశమయ్యారు. జిల్లా వ్యాప్తంగానే కాదు ఎక్కడెక్కడినుండో ప్రజా పోరాటాలతో అనుబంధం ఉన్న ప్రతి ఒక్కరూ చంద్రగారితో గత అనుబంధాన్ని గుర్తుచేసుకుంటూ మాట్లాడారు. వేదికపై నున్న Banner లోని అక్షరాలు నన్నెంతో

ఆకట్టుకున్నాయి. “మిత్రుడు, జిజ్ఞాసి, అన్వేషి, నిరంతర పరిశోధకుడు, నిత్య శ్రామికుడు... కొత్త లోకాలనన్వేషిస్తూ మహాప్రస్థానం చేశాడు. మళ్ళీ వస్తాడు. బహుశా మరో పేరుతో, మరో రూపంతో... అంత వరకు అతనితో సంభాషించడం కుదరదు. స్మరించుకోవడమే మనం చేయగలిగేది. “... మిత్రుల, అభిమానుల మాటల ద్వారా ఆయన జీవితాన్ని మరింతగా తెలుసుకున్నాను. జీవితాన్ని సార్థకం చేసుకున్నవాడు, ఆ ధన్యజీవి ఇంకా ఉండవలసినవాడు. 49 ఏళ్ళకే ఇంత చరిత్రను, ప్రజల అభిమానాన్ని మిగుల్చుకుంటే ఇంకొంత కాలం ఉండి ఉంటే ఇంకెంత మేలు చేసేవాడో ఈ ప్రజలకు..! “జోహారు భువనగిరి చంద్రశేఖర్” అంటూ నినాదాలతో ఆ ప్రాంగణమంతా మారుమ్రోగింది. డాక్టర్‌గారు, నేను మిత్రుల వద్ద శెలవు తీసుకొని, చంద్రగారి జ్ఞాపకాలను గుండెనిండా నింపుకొని, ఆయనిచ్చిన స్ఫూర్తితో ముందుకెళ్ళాలని, ఆయన ఆశయాలను కొనసాగించాలని, బరువెక్కిన గుండెలతో తిరుగుప్రయాణమయ్యాము. కళ్ళుమూసుకుని కూర్చుంటే చంద్రగారి రూపం అక్షరాలై కనిపించింది.

“ఎరుపును, నలుపును ఒంటికి రాసుకొని
మానవ హక్కుల అమ్ముల పొదిగా మారినోడు
పొద్దున హక్కుగా పొడిపించి
ఉద్యమ సూరీడుగా అస్తమించినోడు
చంద్ర.. ఓ ఉడుంపట్టు
చుండూరుకు గాయాలై సలుపుతున్నప్పుడల్లా
చంద్ర అక్కడ మెరుస్తుంటాడు
ఉరి రద్దును కోరుతున్నప్పుడల్లా
న్యాయకంఠమై ఉరుముతుంటాడు.
అతడొక జ్ఞాన సముద్రం
చంద్ర అంటే హక్కులనే ప్రశ్నించిన హక్కు
విలువైన మాటలముల్లె
దేన్నైనా చర్చించేటప్పుడు, తీర్పును చెప్పేటప్పుడు
చంద్రను చరిత్ర స్మరించుకుంటుంది.”



# 31. హక్కుల మానవీయుడు బి. చంద్రశేఖర్‌కు నివాళులు

**సి.వై. పుల్లయ్య** *(పి.వై.ఎల్)*

మానవ హక్కుల గొంతుక మూగపోయింది. పౌరహక్కుల పోరాటంలో రాటుదేలిన మొండి మనిషి. దండి గుండె ఉన్నోడు. ప్రజలను నమ్మినోడు. త న పోరాటానికి ప్రజలు తప్ప పెట్టుబడిదారులు, పెత్తందారులు, గుత్తెదారులు బలాదూర్ అన్నాడు. విప్లవోద్యమ పురుడు పోసుకుని, రాడికల్‌గా పిడికిళ్ళు బిగించి, పౌరహక్కుల కార్యకర్తగా, బాలగోపాల్ మానవతను ఎలుగెత్తి చాటినోడు. బూర్జువా కోర్టులనే తన పోరాట వేదికగా మలుచుకున్నోడు. జన న్యాయం పట్టపగలు నల్లకోటు మాటున గొంతు నులుమపడుతున్నప్పుడు, తన గొంతునిచ్చి, నిలువరించాడు. ఆ వెర్రిగొంతుకనే, హక్కుల చుక్కనే భువనగిరి చంద్రశేఖర్ - పాలక ప్రజాస్వామ్యం ముసుగు ధరించి, చీలిక, పేలికలు చేస్తున్న దోపిడి విశ్వరూపాలను ఎండగట్ట బయలెల్లిన జన హృదయుడు, ప్రజా న్యాయవాదిని క్యాన్సర్ వ్యాధి బలిగొన్నది. వ్యవస్థకు పట్టిన క్యాన్సర్ పురుగును తొలగించే శస్త్ర చికిత్స చేపట్టిన సామాజిక వైద్యుడికి క్యాన్సర్ శస్త్రచికిత్స చేయాల్సి వచ్చినందుకు కన్నీటితో వినమ్రంగా నివాళులర్పించుదాం. విషణ్ణవదనాలతో పిడికిళ్ళు బిగించి జోహార్లు చెప్పుదాం. నీ ఆశయం, నీ పయనం ఆగిపోదని ఒట్టేసి బాసచేద్దాం.

అది 1987 సంవత్సరం. ఆంధ్రప్రదేశ్ రైతు-కూలీ సంఘం రాష్ట్ర 3 వ మహాసభలు గుంటూరు నగరంలో జరగబోయే ముందు నాతోపాటు PDSU,

PYL మిత్రులం వెళ్ళాము. అప్పుడు అబ్దుల్ నూర్ భాషాకి సార్ రెండోసారి పరిచయం అయ్యారు. ఎందుకంటే ఆయన ఆర్.సి.యస్. మహాసభలకు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. అమరుడు కా॥ అంగడి చెన్నయ్య గారిని కలవడానికి వచ్చి తను మాట్లాడుతున్న విషయాలను మేం శ్రద్ధగా వింటూ పరిశీలన చేస్తున్నాము. ఆ తర్వాత కొన్ని రోజులు గడిచినాక, బి. చంద్రశేఖర్‌ను పోలీసులు రాడికల్ వాళ్ళతో సంబంధాలున్నాయని నేరారోపణ చేసి చేతులకు బేడీలువేసి పోలీసు స్టేషన్‌లో ఉంచారని, ఆ ఆరెస్టును ఖండించాలని, వెళ్ళి పరామర్శించాలని అంగడి చెన్నయ్యగారు కొందరు అనుకుంటుంటే విన్నాము. మేము సభల ప్రచారంకై గుంటూరు నగరమంతా ఆటోలలో, సిటీ బస్సులలో కలియ తిరుగుతూ, బి. చంద్రశేఖర్‌ను నిర్బంధించిన పోలీసు స్టేషన్‌ను రైలుపట్టాలకు దగ్గర ఉండగా చూశాము. దాదాపు 26 సంవత్సరాలనాడు జరిగిన సంఘటన గుర్తుకు తెచ్చుకోవడమంటే ఆయనను స్మరించుకోవడమే. మొట్టమొదటిసారిగా ఆనాడు బి. చంద్రశేఖర్ పేరు విన్నాను. అప్పటి నుండి పౌరహక్కుల రంగంలో తరచుగా ఆయన పేరు వింటున్నాము. ఆయన గురించి చెప్పాలంటే, 1988లో గుంటూరుజిల్లా చుండూరులో దళితులను అగ్రకుల దురహంకారులు అన్యాయంగా వేటాడి చంపి, శవాలను గోనె సంచులలో కుక్కి తుంగభద్రా డ్రైనేజిలో పడేశారు. అప్పుడు వారి హత్యలకు బాధ్యులను అరెస్టు చేసేందుకు ప్రజలను కూడగట్టాడు. పౌరహక్కుల సంఘం తరఫున పోరాటాన్ని నిర్వహించాడు. చుండూరు దళితులు చేసిన నేరమేమిటని ప్రశ్నిస్తూ హైదరాబాదు నగరం నడిబొడ్డున దళిత సంఘాలు, విప్లవ సంఘాలతో కలిసి అగ్రకుల దురహంకారాన్ని ఖండిస్తూ, తుత్తునియలు చేయడానికి సభ జరిపినాడు. ఆనాడు తనకు ప్రేరణనిచ్చినవాడు, విప్లవ రాజకీయాలను శాసించినవాడు, నడిపించినవాడు, విరసానికి బారసాల చేసిన కా॥ కె.జి. సత్యమూర్తిగారితో చేయి కలిపి దళిత సంఘీబావ ఉద్యమాన్ని నడిపినాడు. దేశ వ్యాప్తంగా సంచలనం కలిగించిన దళితుల ఊచకోతకు నిరసనగా చేపట్టిన ఉద్యమం కూడా సంచలనాలు, స్పందనలు, పోరుదారులు వేయించింది. కత్తి పద్మారావు, వై. కోటేశ్వరరావు, కలేకూరి ప్రసాద్, గద్దర్, మారోజు వీరన్న, అంగడి చెన్నయ్యలాంటి వారితో కలిసి చుండూరు దళితులకు న్యాయం చేయాలని ఉద్యమించాడు.

దళితులకు న్యాయం జరగాలంటే, చుండూరులోనే ప్రజాకోర్టును నెలకొల్పాలని చేసిన పోరాటం ఫలించింది. తనే బాధితుల తరపున న్యాయవాదిగా వాదనలు వినిపించినాడు. ఆ కేసును గెలిచి విజయం సాధించాడు. 20 సంవత్సరాలు సుదీర్ఘ పోరాటం చేసినాడు. హంతకులకు శిక్షలు పడేలా చేశాడు. ఆ విజయాన్ని మీడియా పెద్దఎత్తున ప్రాధాన్యతను కల్పిస్తూ ప్రచారం చేసింది. బి. చంద్రశేఖర్ మరొకసారి ప్రపంచానికి తెలిసిపోయాడు. అగ్రకుల కటుంబ నేపథ్యమున్నవాడైనా కించిత్తు కూడా ఆ వాసనల జోలికి వెళ్ళకుండా, లొంగకుండా, ఎరలకు బలికాకుండా క్రమశిక్షణతో, నిజాయితీతో న్యాయ పోరాటం చేశాడు. ఎందరో ఆయనను ప్రశంసలతో పొగిడినా, మరికొందరు గిట్టనివాళ్ళు దుమ్మెత్తిపోసినా, ప్రాణ భయం కలిగించినా లేశమాత్రం కూడా తొణకకుండా, అదరకుండా, బెదరకుండా మునుముందుకు సాగిపోయాడు. ఈ పోరాటంలో కె.జి. కన్నబిరాన్, కె. బాలగోపాల్, ఎస్.ఆర్. శంకరన్‌ల సహకారాన్ని తీసుకున్నాడు. వారితో కలిసి సంభాషించాడు. సలహాలు తీసుకున్నాడు. ముందుకు అడుగువేశాడు. ఆ ఉద్యమంలో ఎన్నిమలుపులో, ఎన్ని నిలుపులో, ఎన్ని కలుపులో, వెన్నుపోట్లు, తన్నుపోట్లు, మరెన్ని విమర్శలు వచ్చినా చూస్తూ, సహనం, ఓపికా, పట్టుదలను ప్రదర్శించాడు. ఆ పోరాటం ఆయనకు వన్నెతెచ్చిపెట్టినా పొంగిపోలేదు. అల్ప సంతోషం, దర్పం ప్రదర్శించలేదు. గర్వంగా పోలేదు.

సొంతింట్లోను, కట్టుకున్న ఇల్లును కాపాడుకోవాలనేటప్పుడు అనేక తాజా విషయాలపై వేడి, వాడి చర్చలు జరిగినప్పుడు గుండె నిబ్బరంతో నిండుగా వుండాలని సాధారణ నియమం చెబుతుంది. కానీ, పౌరహక్కుల సంఘంలో ఎన్ని విభేదాలు, ఎన్నో విమర్శలు, ఎగతాళులు, ఐక్యతకు నీళ్ళు వదలడాలు, చర్చను పాజిటివ్‌గా స్వీకరించలేని స్థితి, రాజ్యం అమలుచేస్తున్న హింసను ప్రతి హింసనెట్లా చూడాలనే దాంట్లో విభేదాలున్నా కలిసి నడిచే వాతావరణం కల్పించిన స్థితిలో హక్కుల సూరీడు బాలగోపాల్, సుబ్రమణ్యం, జీవన్‌కుమార్, లాంటి ఉద్దండులు బయటికెళ్ళిపోయి మానవ హక్కుల వేదికను ఏర్పాటు చేసుకోవాల్సి వచ్చింది. అప్పుడు తను పని రాక్షసుడుగా, మార్పును కోరిన బాలగోపాల్‌వైపు నిలిచాడు. ప్రైవేట్ హింసపై జరిగిన డిబేట్‌లో గట్టిగా నిలబడినాడు. రాజ్యహింస,

ప్రతిహింసలపై పోరాడనందుకు రాజ్యానికి దగ్గరివాడని, తనతో కలిసి నడిచిన సహచరుల విమర్శల నెదుర్కోవాల్సి వచ్చింది.

మరొక ముఖ్యమైన మైలురాయిగా నిలిచిన పోరాటం గుంటూరు యస్.పి. గా పనిచేసిన పి.ఎస్.ఆర్. ఆంజనేయులు నిర్వహించిన పౌరుల హత్యలను ఎలుగెత్తి చాటాడు. విప్లవకారులను బూటకపు ఎన్‌కౌంటర్‌లతో కాల్చి చంపడం, రౌడీషీటర్ల ముద్రవేసి లాకప్పుడెత్ చేసి చంపడం, ఎన్‌కౌంటర్ చేసి చంపడం, సమాంతర పాలన నడిపించడం, యదేచ్ఛగా తన దుర్మార్గాలను కొనసాగించడం పై హక్కుల కార్యకర్తగా క్రూరుడైన యస్.పి. ఆంజనేయులుపై హత్యానేరం కేసులు నమోదు చేయించి శిక్షలు వేయించాలని పోరాడాడు. ఖాకీ దుస్తులు ధరించి, కండకావరంతో ప్రజలపై అన్యాయంగా అణచివేతకు పూనుకుంటే ప్రజాస్వామ్యమా? అటవిక సమాజమా? అని ప్రశ్నించి, యస్.పి. ఆంజనేయులుతో పోరాటానికి పూనుకున్నాడు. చట్టాలను చేతులలోనికి తీసుకుని దుర్వినియోగం చేస్తుంటే మౌనంగా ఉండడమంటే నేరస్తులను పరోక్షంగా ప్రోత్సహించడమేనని "నేరమే అధికారమై ప్రజలను అణచివేస్తుంటే, చూస్తూ ఊరుకునే ప్రతి ఒక్కరు నేరస్తులేనని" పోరాడాలని తనవంతుగానే కాకుండా ఉద్యమరూపంగా కదలినాడు. గుంటూరు జిల్లాలో పి.యస్.ఆర్. ఆంజనేయులు ఒక మంత్రి హోదాలో చెలామణి అయి జోక్యందారీ, పెత్తందారీ, నరహంతకుడుగా ప్రజల ప్రాణాలను హరించాడు. ఆ హంతక ముఠాలలాంటి చర్యలు చెల్లవని ఎదురు తిరిగాడు.

బి. చంద్రశేఖర్ న్యాయవాదిగా కాకుండా, రచయితగా, వక్తగా, కవిగా, అనువాదకుడుగా కృషి చేశాడు. దళితుల హక్కుల మీద, పౌరహక్కుల మీద, విద్యారంగం మీద, మతోన్మాదం మీద, కులోన్మాదం మీద, న్యాయ విషయాల మీద, విద్యార్థుల ఆత్మహత్యల మీద రచనలు చేశాడు. అధ్యయనం అంటే అమితాసక్తిని పెంచుకున్నాడు. పుస్తకాల పఠనమే కాకుండా, అధ్యయనం చేసి, ఆచరించాడు. తన వ్యక్తిగత గ్రంథాలయాన్ని నిర్వహించాడు. లక్షల పుస్తకాలు సేకరించుకున్నాడు. ఆంగ్లం, తెలుగు పుస్తకాలు విపరీతంగా చదివేవాడు. బాలగోపాలంటే అమితంగా ప్రేమించాడు. ఆయన శిష్యుడిగా మిగిలిపోవాలని నిర్ణయించుకున్నాడు. ఆయన ఆచరణ, అధ్యయనం, నిజాయితీని తనకు

ఆదర్శంగా తీసుకోవాలని నమ్మినాడు. నిజాయితీగా మసలుకున్నాడు. తన మిత్రులు నర్రా ప్రభాకర్ రెడ్డి, పురుషోత్తం, ఆజం ఆలీ, కనకాచారీ, డా॥ రామనాథం, గోపి రాజన్నలు పోలీసుల, హంతకముఠాల చేతులలో బలైపోయినా, వారి బాటలోనే పయనించాలని ముందుకు పోయాడు. బాలగోపాల్, కె.జి. కన్నబిరాన్‌లు అనారోగ్యంతో మరణించినా దృఢంగా నిలబడ్డాడు. ఆ తర్వాత చాల ప్రముఖ రచన 'మనిషి-మార్క్సిజం - మానవ ప్రవృత్తి' సిద్ధాంతాన్ని నమ్మాడు. సిగ్మండ్ ఫ్రాయిడ్‌పై సిద్ధాంత పరిశోధన ప్రారంభించాడు. మనిషికి స్వార్థం అనంతమని నమ్మాడు. ఇక తన మానాన తను బ్రతకదలిచి. ఇంటివద్దకు చేరాడు. కృష్ణానది ఒడ్డున ఇల్లు నిర్మించుకుని, వ్యవసాయాన్ని వ్యాపకంగా పెట్టుకున్నాడు. రైతుగా వ్యవసాయ రంగాన్ని నమ్ముకున్నాడు. మానవ హక్కుల కార్యకర్తగా ఉన్న నరేంద్రనాథ్‌ను ఆదర్శంగా తీసుకున్నాడు. పుస్తకాలు చదవడం ఆపలేదు. అకాలంగా తనను పంటను పురుగు పట్టి తిన్నట్లుగా క్యాన్సర్ రోగం వెన్నుపూసను తినేసింది. తన న్యాయపోరాటాన్ని తనవారసుడుగా కొడుక్కి అందించాడు. డబ్బుతో దేనిని కొలవ వద్దని ఉద్బోధించాడు. నల్లకోటును తన కొడుకుపైన కప్పాడు. తను మాత్రం తెల్లకోటును ఉంచుకుని చితిమీద పడుకుని, కాలిపోయాడు. బాలగోపాల్ శిష్యుడు కనిపించడం లేదు. కోర్టులు మూగబోయాయి. హక్కుల సభలు వెలితిగా ఉన్నాయి. దినపత్రికలలో తన రచనలు కనిపించడం లేదు. తను రచనలు చేసిన పత్రికలలోనే తన మరణం గురించి రచనలు చేశారు. భువనగిరి చంద్రశేఖర్ భువికి ఏగాడు. మానవ హక్కుల కార్యకర్త ఇప్పుడు మనందరికి, మానవ హక్కులకు సంస్మరణీయుడు. ఆయన ఆశయాలకోసం, సమాజ మార్పుకోసం మనం ఒక గొంతకవుదాము. గుంటూరు నుంచి బయలుదేరిన హక్కుల నినాదాన్ని ఆదర్శంగా తీసుకుని దేశమంతా వినిపించుదాం. జోహార్ భువనగిరి చంద్రశేఖర్.



# 32. ఈ చంద్రుడికి అమావాస్య లేదు!

**పున్నా కృష్ణమూర్తి**

'మూడెకరాల పొలం కొన్నా. దైద శివార్లో అమరలింగేశ్వర స్వామి గుడి దగ్గర. అక్కడ పగలు పగలే. రాత్రి రాత్రే. పొలాన్ని ఆనుకుని అడవి. హాయైన వాతావరణం. ఒక పంటే వేశా. బాగా వచ్చింది. ప్రస్తుతం గుంటూరు నుంచి వీకెండ్ వ్యవసాయం. మావాడు (లా పూర్తి చేసిన కుమారుడు శశాంక్) దార్లో పడ్డాక పొలంలోనే కాపురం. సుబ్రహ్మణ్యం మాష్టారూ వస్తానన్నారు. మీరంతా మా చేనుకు రావాలి...'

నిన్నగాక మొన్న మంగళవారం రాత్రి 10 గంటల వేళ నిమ్స్‌లో చంద్ర ఎప్పటిలా ఉద్వేగంగా మాట్లాడుతూనే ఉన్నాడు. శ్వాసకు సహకరించేందుకు తగిలించిన మాస్క్ ట్రాన్స్‌పరెంట్‌గా ఉంది. 'లో-వెలుతురు'లోనూ కళ్లు ప్రకాశిస్తున్నాయి. తాను కోలుకుంటాననే అంతులేని నమ్మకం ప్రతి మాటలో ధ్వనించింది. డాక్టర్ల సూచనతో సెలవు తీసుకున్నాను. పొద్దున్నే 10 గంటలు దాటిందో లేదో చంద్ర తమ్ముడు, సుబ్రహ్మణ్యంగారు ఫోన్ చేసి 'కార్డియాక్ అరెస్ట్' అన్నారు. 'అరెస్ట్'లను అణువణువునా వ్యతిరేకించే చంద్రకు 'అరెస్ట్' ఏమిటి?

వృత్తిరీత్యా గుంటూర్లో చంద్రతో పరిచయం. జిల్లాలో అతడు పరిచయం లేని జర్నలిస్టు ఎవరైనా ఉన్నారంటే అతిశయోక్తే. జిల్లా కేంద్రంలోని పత్రికా కార్యాలయాలకు దాదాపు ప్రతిరోజు కనీసం ఒక్కటైనా పత్రికా ప్రకటన వచ్చేది. ఏ రోజైనా ప్రకటన లేదు అంటే రిపోర్టర్లు ఆశ్చర్యపోయేవారు. ఈ రోజు 'ఎ.బి'ల

స్టేట్‌మెంట్స్ ఏమీ లేవా? అని! ఎ ఫర్ ఎ. సుబ్రహ్మణ్యం, బి ఫర్ బి. చంద్రశేఖర్! పరిచయం పెరిగేకొద్దీ చంద్రశేఖర్ మా ఊరు మాచర్లలో డిగ్రీ చేశాడని, మా మేనత్త ఊరు పెదమాచవరంలో ఎలిమెంటరీ చదువు చదివాడని తెలిసింది! మేం కలిసి చదవకపోయినా వేర్వేరు సందర్భాల్లో బీవీ మాష్టారు విద్యార్థులం! చంద్రలో పల్నాడియన్ క్యారెక్టర్ స్పష్టంగా తొణికిసలాడేది!

చంద్ర జర్నలిస్ట్‌లకు డార్లింగ్. 'ఎ.బి' ల పేర్లతో ప్రకటన వచ్చినా రాసేది చంద్రశేఖరే. కుదురుగా, ఒక్క కొట్టివేత లేకుండా, టెలిప్రింటర్ ఆపరేటర్ టేబుల్ మీద పెట్టుకున్నా స్పష్టంగా కనిపించే రీతిలో ఉండేది. యథాతథంగా కంపోజ్ చేసుకోవచ్చు. జిల్లాలో ఏ కుగ్రామం నుంచో, తండా నుంచో ఫోన్ వచ్చేది. ఫలాన చోట అత్యాచారం లేదా హత్యాచారం అని. 'ఎ.బి' లు తెల్లవారేసరికి అక్కడకు చేరుకునేవారు. నిజనిర్ధారణ చేసి గుంటూరుకు వచ్చి రిపోర్ట్‌లు ఇచ్చేవారు. 'అన్ని పత్రికలూ ఒకే విధంగా రాశాయి' అనిపించని విధంగా చంద్ర తీసుకునే లీడ్ పాయింట్స్‌లో వైవిధ్యం చాలా తక్కువ మంది అనుభవజ్ఞులైన జర్నలిస్ట్‌లు మాత్రమే చూపగలరు. మీరు జర్నలిస్ట్ కావాల్సింది అంటే 'అయ్యేవాడినే. రామచంద్ర మూర్తి కానివ్వలేదు. నీవు ఇక్కడ ఇమడలేవు. నీలాంటి వారి అవసరం జిల్లాలోనే ఉంది అని తిప్పి పంపకపోతే' అనేవాడు.

చంద్ర జర్నలిస్ట్ అయితే వేలల్లో ఒకడయ్యేవాడు. లాయర్ కాబట్టే ఒకే ఒక్కడు కాగలిగాడు. ఢిల్లీలో ఇటీవల జరిగిన జ్యోతిసింగ్ పాండే ఘటన ఇరవయ్యేళ్ల క్రితమైతే సింగిల్ కాలమ్ ఐటమ్ అన్నారు వినోద్ మెహతా. నిజమే ఇరవయ్యేళ్ల క్రితం మాచర్ల అమ్మాయి ధనలక్ష్మి అత్యాచారానికి గురైతే అలాగే జరిగింది. కాని, అక్కడ చంద్ర ఉన్నాడు. ఆ సింగిల్ కాలమ్ ఐటమ్‌ని ఉద్యమం వేడితో పత్రికలలో బ్యానర్లు చేయించాడు. దశాబ్దాలు పోరాడి బాధితులకు న్యాయం జరిగేలా చేశాడు.

ఒక లాకప్ హత్య కేసులో హతుడి బొటన వేలిముద్రతో తప్పుడు ఆధారాలు సృష్టించారని, ఫోరెన్సిక్ విజ్ఞానం సహాయంతో నిరూపించగలిగాడు. చంద్ర మాటలు వినక ముందు విన్నాక ఒక్కలాగే ఉండటం కష్టం. అతడి వాదనా పటిమ, స్వరం, హావభావాలు సహజాతిసహజంగా తీవ్రాతి తీవ్రంగా ఉంటాయి.

ఫలానా వాడు నేరస్తుడు అతడికి ఫలానా శిక్ష విధించాలి అని తీర్మానించుకున్న న్యాయమూర్తులు చంద్ర వాదనలు విన్నాక, ముద్దాయి నేరంలో సమాజానికీ, అందులో భాగంగా తమకూ పాత్ర ఉందని ఆంతరంగికంగా అంగీకరించిన సందర్భాలున్నాయి. బళ్ళారి రాఘవ గురించి వినడమే. చంద్రను కోర్టులో వాదిస్తుండగా చూసిన వారు రాఘవను తలచుకునేవారు.

కారంచేడు కేసులో సీనియర్ల దగ్గర పనిచేసిన అనుభవం చుండూరు కేసులో బాధితులకు బాసటగా నిలిచేందుకు ఉపకరించింది. దేశంలో తొలిసారిగా నేరం జరిగిన చోటనే కోర్టును నెలకొల్పడం కేవలం చుండూరు కేసు విషయంలోనే జరిగింది. మాకు న్యాయం చేయగలిగేది చంద్రశేఖర్ మాత్రమే అని చుండూరు దళితులు ముక్తకంఠంతో తీర్మానించింది ఎందుకో తీర్పు ప్రపంచానికి స్పష్టం చేసింది. నేటి సామాజిక వర్తమానంలో 'ఫలానా వ్యక్తి ఫలానా మతం వాడు, కులం వాడు కాబట్టే...' అనే ఆరోపణలను ఎదుర్కోని వ్యక్తులు ఆరుదు. నాకు తెలిసిన వారిలో చంద్ర మాత్రమే అందుకు అతీతుడు!

'చంద్రిక' అతడికి తగిన జీవిత భాగస్వామి. శశాంక నోట్లోంచి ఊడిపడ్డట్టే ఉంటాడు. 'వాటె లునాటిక్ ఫ్యామిలీ!' ఒక పౌర్ణమి రోజున దైద పంట చేనులో తుళ్లింతలతో గడపాలనే నీ కోర్కెను మిత్రులు పాటిస్తారు! నువ్వక్కడ ఎలా కనిపించవో చూస్తాం!



# 33. చంద్రశేఖరమా చకోర గీతమా

గోరటి వెంకన్న

బతుకంతా నీతిగా బతికినా మా నేత
బాలగోపాల్ నీడలో కదిలినా జాడలా
బంగారు పళ్ళెంలో సిరులు వలసొచ్చిన
కొనగోటతాకని బోళ శంకరుండ

ఆచారమనే మనువు విషగీతల్ని తోసి
అగ్రహారపు హద్దులన్నీ చెరిపేసి
అంటరాని పల్లె మంచినే ప్రేమించి
హక్కుల ఉద్యమ కాగడై వెలిగావు

వెంటాడే కావరపు కత్తి కసిగట్టిన
అణువంత జడవని హక్కుల ధీశాలి
చుట్టు చీకటి గమ్మి నిట్టాడు నిలువొంగి
నీడ చెదిరిన దళిత వాడలకు గొడుగయ్యి
తల్లి పాల పొదుగు తడిధారగా నీవు

వెలివాడగొంతులనుతడిమావు చెలిమితో
పరుగలెత్తే నది తరగ వోలే నీవు
మనువాదమలినాల కుళ్ళుగడిగేశావు
ఏమాట చెప్పావో అదే ఆచరించావు
త్యాగాలదారికి తలవంచి మొక్కావు

కుల రాజ్య హింసపై వురిమావు నిప్పోలే
మానవీయత సిగన మెరిశావు కొప్పోలే
మనిషిలోపలి బయట మాయపొరలొద్దని
ప్రతిక్షణమూ తపియించి శోధనై నడిచావు

మనిషి వికసించేటి మార్గంబు వెతికెతికి
గతవర్తమానాల మూలాల చదివావు
ఒకసారి నిట్టూర్పు ఒకసారి ఓదార్పు
లోలోన తెలియని లోకాల గాలింపు
విలువలూ విలువలని కలవరింతలతోని
నీదైన అలజడితో నిను నీవే మరిచావు

ఎవరు ఏ తీరున్నా వెనువెంట రాకున్నా
ఏకాకివైనా నీతిని వదలనన్నావు
లావాల వుడికేటి అగ్ని పర్వతమీవు
భావాల కొలుపైన మేథోమదనంబీవు

యోచనలో లోకముతో తేడాలు ఎన్నున్నా
వంచనకు నేనెపుడు తలవొంచనన్నావు
పారేటి యేరులా పచ్చని చెట్టులా
శ్రమజీవి చెమటలా మాలిన్యమంటక కడదాక బతికావు
మరణమని తెలిసినా చిరునవ్వు వదలక
కనుసైగతో దాన్ని కవ్వించి కలిశావు
వీచేటిగాలివలే మోచేటి నేలవలె పొంగే గంగావోలే
పొడిచే పొద్దువోలే నిలిచేవు మా యదలో
చంద్రశేఖరమా చకోర గీతమా
వెన్నెలాతాపమా మా కన్నీటి రూపమా
తలవొంచి మొక్కేము మా తండ్రి నీకెపుడు



# 34. ఐ అబ్జెక్ట్ యువరానర్!

కోటేశు

అప్పుడే చెప్పేశావా?
అంతిమ తీర్పు యువరానర్

అర్ధాంతరంగా చెరిగిపోతే ఎలా?
మానవ హక్కుల బ్యానర్

పోటెత్తి ఘోషించింది ప్రజాస్వామ్య హృదయాంబుధి
పొగిలి పొగిలి ఏడ్చింది రక్త క్షేత్రంలో వీరుని సమాధి

దళిత జనావళి తలలోని నాలుకలా భాషించావు
ధర్మదేవత కళ్ళగంతలు విప్పి న్యాయాన్ని పోషించావు

నిజాయితీ జీవనశైలికి ఇంకెవరు నీకు సరిజోడు
నిన్నుచూసి మనసారా గర్విస్తుంది ఇండియన్ పీనల్ కోడు

ఉన్నత తాత్విక విలువల్ని రాశిపోసిన ధీశాలీ!
ఉపవాసాల జడిలో మునిగితేలేవెందుకు? ఒక్కోపాలి

# 35. చంద్ర దర్శనం

**రాణి శివశంకర శర్మ**

చంద్రతో నాకు గల సాన్నిహిత్యం ఎటువంటిది? చంద్ర మరణం వల్ల నేను యింతగా శూన్యాన్ని ఎందువల్ల ఫీలవుతున్నాను.

త్రిపురనేని శ్రీనివాస్ మరణించినప్పుడు కూడా నేను ఒక ఖాళీనీ అగాధాన్నీ చూశాను. శ్రీనివాస్ మరణించిన కొన్ని రోజుల తర్వాత నేను మళ్ళీ శ్రీనివాస్‌ని ఒక బస్‌స్టాండ్‌లో చూశాను. అతని వెనకాలే వేగంగా నడుచుకొంటూ వెళ్ళాను. కాని అతడు శ్రీనివాస్ కాదని, నేను భ్రమపడ్డానని తెలుసుకొన్నాను.

మరణానంతరం ఆస్తిత్వాలన్నీ వొక భ్రమగా మిగిలిపోతాయా! వట్టి శూన్యాన్ని మాత్రమే మనుష్యులు మిగులుస్తారా! ప్రతిరోజూ ఫోన్‌చేసి తన అభిప్రాయాలని తెలియజేసే చంద్ర గొంతు వినబడకపోవడాన్ని ఎలా అర్ధం చేసుకోవాలి? యిక చంద్రలేడా? అతడు వట్టి అభావమేనా?

తెనాలిలో జరిగిన సంస్మరణ సభలో చంద్ర గురించి మాట్లాడమన్నప్పుడు నేను మాట్లాడడానికి తిరస్కరించాను. కారణం కరిగిపోయిన ఆస్తిత్వాన్ని భాషతో పట్టుకోగలమా అనే నా సమస్య. యిలా రాస్తూపోతూ ఉంటే వట్టి పదాడంబరమే మిగులుతుందేమో. నిజంగా ఆ మనిషి గురించి ఆ ప్రత్యేక ఉనికి గురించి యేదీ పలకనేమోనని భయం.

కొందరు లేక చాలామంది మిత్రులు ఆరోపించేటట్లు ఎంతో అహంభావంతో లేక ఆత్మవిశ్వాసంతో ఒక న్యాయవాదిలా యిహపరాల గురించి, రాజకీయాల గురించి, తత్వశాస్త్రం గురించి అనర్గళంగా మాట్లాడే ఆ గొంతు

యిక వినబడదు. ఆ వ్యంగ్యం యిక పలకదు. అన్ని విషయాల్లోనూ న్యాయవాదిగానే కనబడే ఆ ముఖవైఖరి యింక ప్రత్యక్షం కాదు.

చంద్రలోని ప్రత్యేకత న్యాయవాదిలాగే వొక పక్షాన్నీ వొక వాస్తవాన్నీ హేతుబద్ధంగా స్థాపిస్తూ పోవడం, వొక విలువని స్థాపించడం. అతడు సాపేక్ష వాదికాదు.

నిజానికి చంద్రని చూస్తున్నప్పుడు పందొమ్మిదవ శతాబ్దానికి చెందిన బెల్లంకొండ రామరాయకవి అనే సంస్కృత పండితుడు గుర్తుకు వస్తాడు. యీయన నరసరావుపేట ప్రాంతానికి చెందినవాడు.

మొదట మిషనరీ పాఠశాలలో ఆధునిక విద్య అభ్యసించాడు. ఆధునిక విద్యని అభ్యసించడంవల్ల రోగగ్రస్తుడయ్యాడు. ఆ వాస్తవాన్ని గుర్తించి క్రైస్తవ విద్యకి స్వస్తి పలికాడు. సంస్కృతాన్ని శ్రద్ధగా అభ్యసించాడు. కుటుంబ సంప్రదాయానికి చెందిన వైష్ణవాన్నీ, విశిష్టాద్వైతాన్ని ఖండించాడు. అద్వైతాన్ని సమర్థించాడు.

బెల్లంకొండ రామరాయకవి రచించిన అద్వైత విజయం అనే గ్రంథం వొక కోర్టులోని వాద ప్రతివాదాల రూపాల్లో సాగుతుంది. బహుశా బెల్లంకొండ రామరాయకవి అంత తీవ్రంగా ద్వైతాన్ని ఖండించడానికి కారణం వలస క్రైస్తవాన్ని తాత్వికంగా ఎదుర్కోవాలనే తపనే కారణం కావచ్చు. అంతే కాని రామానుజుని పట్ల వ్యతిరేకత కారణం కాకపోవచ్చును.

రామరాయ కవి రచించిన అద్వైత విజయంలో వాది - ప్రతి వాదుల మధ్య సాగే ద్వైత అద్వైత చర్చలాగే, చంద్ర కూడా ఆధునికతకి వ్యతిరేకంగా తీవ్ర చర్చని కొనసాగించేవాడు. అంతే ధిషణాహంకారంతో సనాతన స్థాపనకి సిద్ధమయ్యేవాడు.

సనాతనం అంటే కేవలం ప్రీమోడర్న్ అని అనువదించి ఖండించడానికి సిద్ధపడే ఆధునిక విద్యావంతులైన మూర్ఖులని పక్కనబెడదాం. సనాతనం నుంచి మనం తప్పిపోయాం. దాన్ని వెతకాలి. నిజానికి అది ఉన్నచోటనే ఉంది. నిలబడిన చోటనే వుంది. కాని నిన్ను నువ్వు చేరుకోవడానికి వొక జీవిత కాలం పడ్తుంది.

ఈ జీవితకాల అన్వేషణకి చంద్ర సిద్ధమయ్యాడు. సంప్రదాయానికి పూర్తిగా దూరమైన యీ నవీన చంద్రుడు సనాతన చంద్రుడిగా మారాడు. తన తల్లికి కర్మని వైదిక ధర్మ పద్ధతిలో ఆచరించాడు.

విచిత్రం ఏమిటంటే - సంస్కృతం తప్ప మరేమి చదవని నేను, ఆధునిక విద్యయిసుమంతైనా లేని, ఏబీసీడీలు యిప్పటికీ వరసగా అప్పచెప్పలేని నేను రాణి శివశంకర శర్మ అని పిలవబడే కోనసీమ ద్రావిడ బ్రాహ్మణుణ్ణి తల్లిదండ్రులకి కర్మకాండని తిరస్కరించడం.

కర్మ జరిగే రోజుల్లో మట్టిలో కొన్ని విత్తనాల్ని మొలకెత్తేలా చేస్తారు. అంటే జీవం కొనసాగుతుంది. జీవికి మరణం లేదు. కాకి వచ్చి పిండాన్ని ఆరగిస్తుంది. పునః పునర్జాయమానా - ఉషస్సు తిరిగి తిరిగి జన్మిస్తుంది అని ఋగ్వేదంలో ఉంది. యిదంతా అనంత ప్రక్రియ.

బాగానే ఉందికాని మృత్యు భయానికి అర్థం లేదా? మరణించిన వాళ్ళ ఆత్మలు మన చుట్టూ తిరుగుతుంటాయా? పునర్జన్మిస్తాయా? యీ గ్రహంలోనా? యితర గ్రహాల్లోనా?

ఈ ప్రశ్నలని ప్రక్కనబెట్టి మనం ఎందుకు మృత్యువుకి భయపడాలి? అంటే జీవితానికి ఒక అర్థం వుందా సార్థకత ఉందా? లక్ష్యం ఉందా?

చంద్ర రోగ గ్రస్తుడయ్యాక వొకరోజు చెల్లా చెదురుగా పడి ఉన్న తన పుస్తకాలన్నిటినీ జాగ్రత్తగా కొత్తగా కొన్ని అలమారుల్లో సర్దాడు. ఆ పుస్తకాల గదిని అలా అంత చక్కగా సర్దిన సందర్భం ఏదీ లేదు.

అలా తీర్చిదిద్దిన పుస్తకాల గది గుమ్మం దగ్గర చంద్ర నిలబడి ఉన్నాడు. “నేను రాయవలసిందంతా తొందరలో రాసెయ్యాలి. బహుశా నేనింక యెక్కువ కాలం ఉండకపోవచ్చు” అన్నాడు. చంద్ర కళ్లల్లో నీళ్ళు రావడమే తక్కువ.

నేను ఆ గదికి గుమ్మానికి యివతల నిలబడి ఆ వాక్యాన్ని విన్నాను. తర్వాత ఆలోచించాను. నేను కొన్ని రోజులలో కొన్ని గంటలలో లేక ఒక గంటలో ఒక పావుగంటలో మరణిస్తే ఏమవుతుంది అని ఆలోచించాను. మంచం మీద మరణించినట్లు జడంగా పరుండి ఆలోచించాను. ఏమీ కాదు, ఏమీ కాదు.

అదీ చంద్రకీ నాకూ వున్న తేడా. అందుకే భగవంతుణ్ణి ప్రార్థించాను. "భగవాన్ నా ఆయుష్షుని తగ్గించి వెయ్యి. చంద్రని బతికించు. అతడు సాధించవలసినవెన్నో వున్నాయి. సమాజం కోసం, సత్యం కోసం అతడు ప్రయాణించవలసిందెంతో ఉంది. అతని కొక గమ్యం ఉంది. లక్ష్యం అర్థం ఉంది. అతడు నిజమైన అర్థంలో సార్థకమైన వ్యక్తి. అతడు జీవించాలని ప్రకృతి తపిస్తోంది. భగవాన్ నేను శాపగ్రస్తుణ్ణి, వ్యర్థుణ్ణి. నా ముగింపు మిగిల్చేదేమీ లేదు. కానీ చంద్ర ముగింపు శూన్యాన్ని మిగులుస్తుంది."

చంద్ర మరణించాడు సరే నేనెందుకు బతికి వున్నాను. ఇండియన్ నీషే అని చంద్ర నామకరణం చేసిన మిత్రుడు నరహరి అంటాడు. శర్మా! శబ్దంగా తప్ప నువ్వు మిగిలి లేవు. అందుకే రచించడం నీ కర్మ అని. శబ్దానికి బయట నీకు అర్థం లేదు అని నన్ను శపించాడు నరహరి.

అందుకే నేనెప్పుడూ భాషలో బతుకుతాను. అనేక రంగుల్తో రుచుల్తో శబ్దాలు నా చుట్టూ తేలుతూ ఉంటాయి.

శబ్దం ముఖ్యమా అర్థం ముఖ్యమా అనే చర్చ చంద్రకీ నాకూ మధ్య చాలా కాలం కొనసాగింది.

వేదం అపౌరుషేయం. అంటే పక్షుల జంతువుల శబ్దాల్లాగే లయబద్ధం, శ్రుతిబద్ధం, ప్రకృతి సహజం. అదొక సహజ సంగీతం. అర్థం వ్యర్థం. అందుకే వేద శబ్దం సుస్వరంగా పరంపరగా కొనసాగుతోంది, అర్థం కాదు అని ప్రాచీన అర్వాచీన ప్రమాణాల్తో చంద్రతో వాదించాను కాని ఒప్పించలేకపోయాను.

"అర్థం లేకపోతే సార్థకత ఏమిటి, జీవితానికైనా శబ్దానికైనా" యిదీ చంద్ర ప్రశ్న.

నేను శబ్దాన్ని, చంద్ర అర్థం. శబ్దార్థాలు కలిసిపోయే అద్వైతాన్ని కూడా చంద్ర తిరస్కరించాడు.

"నేను అద్వైతాన్ని ఎంతో అభిమానిస్తాను. కాని అద్వైతం దేన్నైనా స్థాపించ గలదా? ఒక విలువని నిలుపగలదా? ఒక నీతినీ సత్యాన్నీ స్థాపించగలదా? అందువల్లనే సారా కాంట్రాక్టరులో కూడా పరబ్రహ్మాన్ని చూస్తున్నారు నేటి అద్వైతులు" అన్నాడు చంద్ర.

ద్వంద్వాతీత స్థితిని బోధించే అద్వైతం ఏ పరమమైన విలువనీ స్థాపించ లేదు. దాన్ని సామాజికం చేయాలనుకొన్నప్పుడు విశిష్టాద్వైతంగా మారిపోతుంది (యూజీ). కాని నిజమైన అద్వైతానికి సిద్ధితప్ప సాధ్యం లేదు; గమ్యం లేదు.

ఇట్టి అద్వైత స్థితిని చంద్ర కోరుకోలేదు; కనీసం ఆవైపు ప్రయాణించాలనే తపన కూడా అతనికి లేదు.

అందువల్లనే వలస క్రైస్తవం స్థానంలో ఒక భారతీయ ద్వైత స్థితినే చంద్ర కోరుకున్నాడనిపిస్తుంది.

మిత్రులు సుబ్రహ్మణ్యం గారు చంద్రలోని దైవభక్తి తత్పరత అద్వైత శాస్త్ర విరుద్ధం అన్నారు. అద్వైతం ఆత్మాన్వేషణే కాని దైవాన్వేషణ కాదన్నారు.

నిజమే కావచ్చు. శంకరాచార్యులు రచించిన దక్షిణామూర్తి స్తోత్రం కూడా నిజానికి స్తోత్రం కాదు. అంతా అద్వైతమే, నిర్గుణ స్థితే ఆ స్తోత్రం నిండా.

చంద్ర నిర్గుణుడు కాడు. అతనిది సగుణోపాసన. జీవితంలో శృంగారానికి గల ప్రాధాన్యాన్ని చెపుతుండేవాడు చంద్రం. "ఆత్మారాముడిగా ఆత్మానందంలో జీవించడమే మంచిది. పూర్తిగా భిన్న మానసిక స్థితుల్లో జీవించే యిద్దరిమధ్య కలయిక అసాధ్యం, భావప్రాప్తి మిథ్య" అన్నాను నేను.

యిదిగో యిటువంటి జీవిత వ్యతిరేక వ్యక్తీకరణల్లో నేను అద్వైతిగా తేల్తాను, చంద్ర కాదు.

మృత్యు విహంగం వొక భుజంమీద వాలివుందనే స్పృహతో జీవించాలి మనిషి అంటాడు నరహరి. చంద్ర స్థితి అదికాదు. అతడు మృత్యువుని జయించాలనుకొన్నాడు. తీవ్ర అహంభావంతో జయించాలనుకొన్నాడు. శివోహం శివోహం అని అతడు భావించలేదు. నేనూ శివుడూ వేరు. నేను చేరవలసిన గమ్యం శివుడు. శివుడు ధర్మానికీ నీతికీ చిహ్నం. అతని సన్నిధికి మనం నిరాడంబరంగా ప్రయాణించాలి అని చంద్ర భావించాడు.

అందుకే నన్నూ సుబ్రహ్మణ్యంగారినీ తన శివారాధనలో భాగం చేశాడు. సత్రశాలలో, దైద గుహలో శివలింగార్చనలో మమ్మల్ని భాగస్తుల్ని చేశాడు. నిజానికి నేను దైవభక్తికి దూరమై చాలాకాలమైంది.

"నీకు పిచ్చెక్కింది నువ్వు పిచ్చాసుపత్రిలో చేరాలి" అన్నాడు చంద్రని వొక మిత్రుడు. యీ విషయం చెప్పి బాధపడ్డాడు. అతిరాత్ర మహాయాగాన్ని గురించి చంద్ర రాసిన వ్యాసాన్ని గురించి ఆ కమ్యూనిస్టు మిత్రుడు చేసిన వ్యాఖ్యానం యిది.

కాని చంద్రకి పిచ్చెక్కినా ఆ పిచ్చికి కూడా సార్థకత ఉంటుంది. క్రైస్తవ కళ్లద్దాలలోంచి భారతీయ కర్మకాండనీ, విశ్వాసాల్నీ, శాస్త్రాల్నీ తిరస్కరించడాన్ని ఆయన వ్యతిరేకించాడు. తృతీయ ప్రపంచ దేశాలపై ముస్లింలపై పాశ్చాత్య హేతుబద్ధత చేస్తున్న దాడిని చంద్ర వొక సనాతన ఉన్మాదంతో తిరస్కరించాడు. అందుకే పార్లమెంటుపై దాడి కేసులో ఉరిశిక్షకు గురైన కసబ్‌కి ఉరిశిక్ష విధించడాన్ని వ్యతిరేకించాడు. వొక ముక్కుపచ్చలారని యువకుడిని ఉరితీసి పండగ జేసుకోవడాన్ని సిగ్గుపడవలసిన చర్యగా అభివర్ణించాడు.

కంచె ఐలయ్యలాంటి క్రైస్తవ మేధావులు యిటువంటి విషయాల్లో మౌనం వహిస్తారు. అందుకే సాక్షి టీవీ 'లా పాయింట్' కార్యక్రమంలో కంచె ఐలయ్యని పాశ్చాత్యుల తొత్తుగా, వలస క్రైస్తవుడిగా నిలదీశాడు.

మాట కూడా ఆచరణే. ఆలోచన కూడా ఆచరణే. వలస క్రైస్తవం, సాంస్కృతిక దాస్యాలపట్ల చంద్ర తీవ్ర వ్యతిరేక వైఖరి చుండూరు కేసుని వాదించడం కన్నా ముందుచూపు కలిగిన చర్య. యీ తీవ్ర శక్తిని సనాతన శంకరుడే ఆయనకి ప్రసాదించాడు.

ఎందుకంటే చుండూరు హత్యలవంటివి గత చరిత్ర మాత్రమే. వలసవాదం తీసుకువచ్చిన నూతన వ్యవసాయిక పద్ధతులలో భాగంగా ఆ హత్యలు జరిగాయి. యిప్పుడు వ్యవసాయం కూడా అడుగంటి పట్టణీకరణ జరుగుతోంది. వ్యవసాయం లాభసాటియైన వ్యాపారం కాదు. రియలెస్టేట్ బిజినెస్సే లాభసాటి అనే అభిప్రాయం బలపడ్తోంది. హింస సూక్ష్మ హింసగా మారుతోంది. అందువల్ల ప్రత్యక్ష దాడులు తగ్గుతున్నాయి.

దానితోపాటు సాంస్కృతిక దాడి ముమ్మరమైంది. ఆలోచనకి అవకాశం లేకుండా పోతోంది. విద్యా విధానం ఆలోచనలేని తరాన్ని సృష్టిస్తోంది. యిదంతా అమెరికీకరణకీ, వస్తు వ్యామోహానికీ దారితీస్తోంది.

ఈ దశలో ప్రకృతిలోకీ పురాణాల్లోకీ తిరోగమించాలని ప్రయత్నించాడు చంద్ర. పురోగమనమే కాదు తిరోగమనమూ విప్లవమే.

చంద్ర చుండూరు బాధితుల తరపున వాదించడమే కాదు, అటువంటి హింస నుంచి పుట్టుకొచ్చిన ప్రగతిశీల వ్యాపారాన్ని కూడా వ్యతిరేకించాడు. దళిత ఉద్యమాలు పాశ్చాత్య క్రైస్తవ సామ్రాజ్యవాదానికి బానిసలుగా మారడాన్ని, అవే దోపిడీ సంస్థలుగా మారడాన్ని బట్టబయలు చేశాడు. దళిత దళారీలకి కంటిమీద కునుకు లేకుండా చేశాడు. ఎన్‌జీవోల కథ బట్టబయలు చేశాడు.

యిదంతా చంద్ర అనే బ్రాహ్మణుడు చేసిన అతిరాత్ర మహాయాగం.

చంద్ర ద్వైతి. మీమాంసకుడైన ద్వైతి. కర్మకాండని అధమమైనదిగా భావించే అద్వైతాన్ని సందేహించాడు. అతనికి ప్రాచీన కర్మకాండ అంటే అభిమానం. అందుకే పల్నాటి వీరోత్సవాలన్నా, తిరునాళ్లన్నా పడిచచ్చేవాడు. వైదిక అవైదిక కర్మకాండల్ని యిష్టపడ్డాడు. యెందుకంటె యివి సాంస్కృతిక వ్యక్తీకరణలు. వీటిని ముగించేస్తే మిగిలేది వలస క్రైస్తవమే.

అయితే చంద్ర అద్వైతాన్ని ఎందుకు అధ్యయనం చేశాడు? అద్వైత ఉపన్యాసాలకి అంత ఠంచనుగా ఎందుకు హాజరయ్యాడు?

అవధులని చెరిపేసే విశాలత్వం అద్వైతంలో వుంది. కాని అవధులు లేనిదే సంస్కృతి లేదు. సంప్రదాయం లేదు. వొక జాతి ఉనికి లేదు. అందుకే విశ్వమానవుడు అనే భావాన్ని చంద్ర వ్యతిరేకించాడు. నిజానికి అద్వైతం పట్ల యీ సందేహం యీ నాటిది కాదు. ప్రముఖ రచయిత చలం కూడా అద్వైతాన్ని సందేహించాడు.

అద్వైతమూ, సైన్సూ అనుభూతికి స్థానం లేకుండా చేశాయని, జీవితాన్ని నిస్సారం చేశాయని చలం విమర్శించాడు. (గీతాంజలి ముందుమాట). అద్వైతం, సైన్సు యీ రెండింటిలోనూ సబ్జెక్టివిటీకి స్థానం లేకపోవడం చలానికి విసుగు తెప్పించింది. గగనానికి యిలకూ బహుదూరంబనినాడో అనే త్యాగరాజ కృతిలోని ఆవేదన చలాన్ని కదిలించింది.

నిజానికి అద్వైత స్థితిలో వ్యక్తీకరణ అసాధ్యం. శంకరుని గురువైన గౌడ పాదాచార్యులు అజాతవాదాన్ని ప్రతిపాదించారు. అసలు సృష్టే జరగలేదు.

అందువల్ల బంధమూ లేదు మోక్షమూ లేదు. యతో వాచో నివర్తంతే. మనస్సుతో కలిసి వాక్కులు కూడా నిష్ఫలంగా వెనుతిరుగుతాయని ఉపనిషత్ వాణి.

అందువల్ల అద్వైతంలో మునిగిపోతే తేలడం కష్టం. ఎంతో విశాల దృష్టిని కనబరచే అద్వైతం ద్వారా వచ్చిన సామాజిక మార్పు ఏమీ లేకపోవడం శోచనీయమని చంద్ర మిత్రులు మంత్రి డొక్కా మాణిక్య వరప్రసాద్ గారు అన్నారు. యీ సంగతి చంద్రయే నాతో చెప్పాడు.

అయితే అద్వైతం నుంచి దేన్నైనా ఆశించడం అసాధ్యం. అది పూర్తిగా అంతర్ముఖీన స్థితి. దాన్ని భాషలో వెలువరించడమూ అసాధ్యమే. నిజంగా అటువంటి స్థితి ఉన్నదా అనే ప్రశ్నకి సమాధానం దొరకడం కష్టం. అసలు ఆ స్థితి ఏమిటి అనేదే అంతుచిక్కని ప్రశ్న. అందుకే "వాడంతా అద్వైతం" అంటే అయోమయం అనే అర్థంలో సామెత స్థిరపడింది.

కాని మోక్ష భావన భారతీయ ఆలోచనలో అతి ప్రధానమైనది. అటువంటి అవధూతలు లెక్కకు మిక్కిలిగా కనబడ్తారు. ఇంతకీ వాక్కులకి అందని అద్వైతం ద్వారా స్థాపించదగినదేమీ లేదు. నువ్వు దేన్ని గురించి మాట్లాడినా అది ద్వైత స్థితికి దారితీస్తుంది. అద్వైతంలో వినేవాడు వినబడేది, చూసేవాడు చూడబడేది అనేవేమీ లేవు. అందువల్ల ఏది మాట్లాడినా ప్రవచించినా అది ద్వైతస్థితిలో మాత్రమే సాధ్యం.

తనకీ ప్రపంచానికీ సమన్వయం కుదిరేదాకా కవి చేసే అంతర్ బహిర్ యుద్ధారావమే కవిత్వం అంటాడు చలం. ఇక్కడ తానూ, తాను సంఘర్షించ వలసిన ప్రపంచమూ వేరు. ఇది ద్వైతస్థితి. ఈ ద్వైతస్థితి కరిగిపోతే కవిత్వమూ లేదు, సాహిత్యమూ లేదు. అస్పష్ట అవ్యక్త శబ్దాలు మాత్రమే మిగుల్తాయి.

తన అహంభావాన్ని జెండాగా ఎగరవేసిన చంద్ర అద్వైతానికి చాలా దూరంలో వున్నాడని చెప్పవచ్చు. నిర్లిప్తతని వహించడానికి అతడు ప్రయత్నించలేదు. యాక్టివ్‌గా ఉండదలచుకొన్నాడు.

నాలుగవ కీమో థెరపీ జరిగిన తర్వాత కూడా "నేను చాలా యాక్టివ్" అని ప్రకటించుకొన్నాడు. నేనెప్పుడూ యాక్టివ్‌గానే ఉంటాను. కాని ఈ వ్యాధి నన్ను మరీ యిబ్బంది పెడ్తోంది అన్నాడు చంద్ర.

వ్యాధులూ, భయాలు, మానవ సంబంధాల్లోని అసంబద్ధత యివన్నీ నన్ను భయగ్రస్తుణ్ణి చేస్తాయి. నిర్లిప్తంగా వుండమని బలవంతపెడ్తాయి. యీ భూమండలం మీద చీమకి ఉన్న జాగరూకతతో జీవించాలని శాసిస్తాయి. కమ్యూనికేషన్ ఈజ్ ఇంపాజిబుల్ బిట్వీన్ హ్యూమన్ బీయింగ్స్ అనేది నాకు యిష్టమైన వాక్యం. ఏమి వెదుకుతున్నావూ యీ జీవిత శిథిలాల్లో నీవు అనే బైరాగి కవితా వాక్యం నిరంతరం నాలో కదులుతూ ఉంటుంది.

నాలోని వైదీక విషాదానికి బహిర వ్యక్తీకరణయైన నరహరి నన్ను హెచ్చరిస్తుంటాడు. "నువ్వు నీ ముఖాన్ని అద్దంలో చూసుకోకు. ఎందుకంటే నీకు ముఖం లేదు. నువ్వు వట్టి శబ్దానివి, వైదిక శబ్దానివి. ఒక శబ్దం చలిస్తూంది అంతే. అందుకే నీ చావు పుట్టుకలకి సార్థకత లేదు. స్వరం తప్ప అర్థంలేనివాడివి నువ్వు."

చంద్ర అననే అన్నాడు "శర్మా నువ్వు చదివి జ్ఞానం సంపాదించి మాట్లాడ్తున్నట్లుండదు. నీ కంటె బాగా చదివిన వాళ్ళు చాలామంది వుంటారు. నువ్వొక సహజ స్థితిలో మాట్లాడ్తుంటావు అదే నిన్ను సత్యానికి దగ్గరగా నిలుపుతుంది" అన్నాడు చంద్ర దైదలోని స్వీయ క్షేత్రంలో.

అప్పుడే వొక కప్ప మా పక్కనుంచి గెంతింది. కప్పని చూసి చాలా కాలమైంది అన్నాడు చంద్ర. అది వైదిక ధర్మానికి ప్రతీక. ఆధునికత దానిని మరుగుపరిచింది అన్నాను నేను.

ఋగ్వేదం, వేదం వల్లెవేయడాన్ని కప్పల అరుపులతో పోల్చింది. ఒక కప్ప అరుస్తుంది. మరొక కప్ప అనుకరిస్తూ అరిచినట్లు ఉంటుంది. వానాకాలంలో యీ బెకబెకలూ అనంతంగా సాగుతాయి.

ఇంతకీ 'చంద్ర' శబ్దం కాదు, అర్థం మాత్రమే. అందుకే విశ్లేషణా శక్తీ, తర్కమూ చంద్రలో ప్రాధాన్యత వహించేవి. ప్రత్యర్థిని నోరుమూయించే అహంభావపూరిత న్యాయవాదిగా కూడా కొందరికి పొడగట్టేవాడు. అతడి నవ్వులో కూడా అహంకారం స్ఫురిస్తుందని వొక స్నేహితుడు అన్నాడు.

అయితే అహంభావం అనేది అనాదిగా అలంకారంగానే భావించబడ్తోంది. విశ్వనాథ సత్యనారాయణగారు చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రి గారికి తనలాంటి శిష్యుడు

దొరకడం గురువుగారి అదృష్టం, నన్నయకీ తిక్కనకీ కూడా తనలాంటి శిష్య పుంగవుడు దొరకలేదు అని పద్యం రచించాడు. తిరుపతి వెంకటకవులు తాము మీసాలు పెంచడానికి కారణం సంస్కృత ఆంధ్ర ఉభయ భాషల్లోను పండితులుగా ప్రకటించుకోవడానికేనని ఉద్ఘాటించారు.

మాకురు ధనజన యౌవన గర్వం అనే భజగోవింద శ్లోకంలో పాండిత్య గర్వాన్ని చేర్చలేదు శంకరాచార్యులు. ధిషణాహంకారం అనే పదం సుప్రసిద్ధం. అంటే నేను బుద్ధిశాలిని అనే గర్వం. యిది చంద్రలో ఉండేది. అవసరం కూడా. అదొక చారిత్రక అవసరంగా మారింది.

ఈ అహంకారంవల్లనే గురజాడ అంతటివాణ్ణి సామ్రాజ్యవాద దాసుడు, గిరీశానికి నకలు అని అనగలిగాడు. విశాఖపట్నంలో నేను యివ్వబోతున్న ఉపన్యాసంలో గురజాడపై విమర్శని ఎక్కుపెట్టమని సలహా యిచ్చాడు.

అప్పారావు నా నేస్తం

ఆంధ్రత్వం నా శాపం

అన్నాడు శ్రీశ్రీ - ఆంధ్రత్వం శాపమే. ఎందుకంటే తెలుగునాట నాటకం అభివృద్ధి చెందలేదు. ఏ కళలు అభివృద్ధి చెందలేదు. వట్టి సినిమా మాత్రమే అభివృద్ధి చెందింది. అదీ ఫక్తు వ్యాపార సినిమా.

నేటి సినిమాలో డైలాగులకి గురజాడే మూలం అన్నారు మిత్రులు రాజేశ్వరరావు గారు. ఆలోచన కంటె ఠక్కున మెరవడమే ఆ డైలాగుల్లోని సారం.

గురజాడ మీద వొక వ్యాసం రాస్తానని, అందులో సెటైర్‌ని కూడా కలిపి కొత్త పద్ధతిలో రాస్తానని చంద్ర అన్నాడు. ట్యాంక్ బండ్‌మీద విగ్రహాల్లోని అల్లూరి సీతారామరాజు గురజాడ మీద ఎదురు తిరిగినట్లు, నా ప్రక్కన నువ్వెందుకు నిలబడ్డావు అని గురజాడని నిలదీసినట్లు వ్యంగ్యంగా రాస్తానని అన్నాడు. కన్యాశుల్కం రాసి పారేసిన నాటకం. "గురజాడ - సీతారామరాజు" చంద్ర రాస్తానని రాయని రూపకం.

అందుకే ఆంధ్రత్వం నా శాపం అన్నాడు.

ఈ అరచిత రూపకంలో తనదైన అహంభావంతో సీతారామరాజు ధనస్సుని గురజాడపై ఎక్కుపెట్టాలని సంకల్పించాడు చంద్ర.

అహంభావం.

ఇది చంద్రపై వున్న ఆరోపణ మాత్రమే కాదు. అతనిలోని శక్తి కూడా. ఇది నా స్వభావానికి విరుద్ధం. కనీసం నా దైనందినిక ప్రవర్తనకి విరుద్ధం.

ప్రతి దానికీ సమాధానం యిస్తూ కూర్చోవడం చాలా కష్టం. అడిగేవాడికి చెప్పేవాడు లోకువ. పరిష్కారం చెప్పండి ప్రత్యామ్నాయం చెప్పండి అనే వాళ్లు చాలామంది కనిపిస్తారు. ప్రతీ వాళ్ళకీ రెడీమేడ్ పరిష్కారాలూ సమాధానాలూ కావాలి. అందుకే యిందరు స్వాములూ, డాక్టర్లూ, యిన్ని వేశ్యా గృహాలూ, దేవాలయాలూ.

మార్కెట్ ఎకానమీలో పుట్టి పెరిగిన నేటి తరానికి సత్వర పరిష్కారాలు కావాలి.

ఆధునికతని విమర్శించాము. అయితే దానికి పరిష్కారం ఏమిటి ప్రత్యామ్నాయం ఏమిటి అని నిలదీస్తారు.

సనాతనం అన్నామా వెనక్కి పోతున్నారా అని గగ్గోలు పెడ్తారు.

వీళ్ళకేదో స్పష్టంగా దారితెలుసున్నట్లు. నాలుగు పాశ్చాత్య సిద్ధాంత గ్రంథాలు చదివాడా వాణ్ణి పట్టుకోలేం. వీటన్నిటికీ సమాధానం చంద్ర అహంభావం.

చంద్ర పాశ్చాత్య గ్రంథాల నుంచి క్రమేపీ స్వదేశీ గ్రంథాల్లోకి, సంస్కృత కావ్యాల్లోకి, వేదపురాణాల్లోకీ దారిపట్టాడు. సంస్కృతం అభ్యసించడం మొదలు పెట్టాడు. సంస్కృత భాష విశిష్టత గురించి వొక సభలో ఉపన్యసించాడు కూడా.

వలస క్రైస్తవులు భారతీయ దృక్పథాన్ని తమకి అనుగుణంగా మలుచుకోవడం కోసం సంస్కృతాన్నీ, పర్షియన్ భాషనీ బలహీన పరిచారు. వాటికి పోటీగా స్థానిక భాషల్ని నిలబెట్టారు. అందుకే గురజాడలాంటి వైతాళికులు స్వధర్మ నిరసనని, వలస క్రైస్తవ దాస్యాన్నీ తమ జీవిత లక్ష్యంగా మార్చుకొన్నారు. ఎందుకంటే దేశభాషల ఉద్ధరణ పేరుతో జరిగిందంతా క్రైస్తవ సామ్రాజ్యానికి స్థానికతను చేకూర్చడమే.

చంద్ర ప్రవర్తన యీ ఆంగ్లేయ గురజాడలకి విరుగుడుగా కనబడడం మొదలు పెట్టింది. చంద్రకి పౌరాణిక నాటకాలంటే చాలా యిష్టం. హరిశ్చంద్ర నాటకం అంటే మరీ ఇష్టం. పల్నాటి వీరగాథని సుదీర్ఘంగా గానం చేస్తారని, మనం కలిసి వెళ్ళి విందామన్నాడు కాని కుదరనే లేదు. యిది పౌరాణిక గాథలపైన గురజాడ దృక్పథానికి విరుద్ధం. నిస్సార ఆధునిక హేతుబద్ధతకి ఎదురీదడం.

ఆధునిక హేతువుపై చంద్ర చాలా రకాలుగా దాడి మొదలుపెట్టాడు. మానవ హక్కుల కార్యకర్తగా చిరకాలం పనిచేసిన చంద్రశేఖర్ మానవ హక్కులు అనే భావననే వ్యతిరేకించాడు. నిర్బంధ విద్య పేరుతో పిల్లలు అందర్నీ పాఠశాలల్లోకి నెట్టి వ్యవసాయం, చేపలు పట్టడం వంటి సంప్రదాయ వృత్తుల్ని బలహీన పరుస్తున్నారని విరుచుకుపడ్డాడు. అన్ని రంగాలనీ మార్కెట్టుకి అప్పజెప్పే కుట్రగా స్పష్టం చేశాడు. పరంపరగా అందివచ్చిన జ్ఞానం జ్ఞానం కాకుండాపోతోంది అన్నాడు.

చివరిలో దేవదాసీ వ్యవస్థ గురించి అధ్యయనం మొదలు పెట్టాడు. దేవదాసీ వ్యవస్థ రద్దు హక్కుల ఉల్లంఘనే అని స్పష్టం చెయ్యదలచుకొన్నాడు. యీ చట్టం ఆస్తితో సంస్కృతితో ప్రాచీన విద్యలతో ఆ వర్గానికి గల హక్కుల్ని కాలరాయడమేనని భావించాడు. గోదావరి జిల్లాలకి వెళ్ళి ఒక దేవదాసిని యింటర్వ్యూ చెయ్యాలని కూడా భావించాడు.

బ్రాహ్మణ సంస్కర్తలే కాదు జ్యోతిబాఫూలే, అంబేద్కర్ లాంటి దళిత సంస్కర్తలు కూడా దేవదాసీ వ్యవస్థ రద్దుని బలపరిచారు. కాని బెంగులూరు నాగరత్నమ్మవంటి దేవదాసీలే దేవదాసీ వ్యవస్థ కొనసాగాలని కోరుకున్నారు. బెంగుళూరు నాగరత్నమ్మ నేను దేవదాసీని అని సగర్వంగా ప్రకటించుకొని మరీ మాట్లాడేవారు.

తమ తమ అస్తిత్వాల్ని బహిరంగపరుచుకోవడం ఆధునికతపై తిరుగుబాటు బావుటా ఎగురవేయడమే. యీ పని చంద్ర కూడా చేశాడు. చివరికి తాను బ్రాహ్మణుడిని అనే వాస్తవాన్ని బట్టబయలు చేశాడు. బ్రాహ్మణ సంఘంలో సభ్యుడిగా కూడా మారాడు. చంద్ర మరణించాక బ్రాహ్మణ సంఘం పత్రికలో సంతాప ప్రకటనని ప్రచురిస్తామని బ్రాహ్మణ సంఘం వారు అన్నారు.

దీని ద్వారా బ్రాహ్మణులు ఎలా జీవించాలో ఎటువంటి విలువలతో జీవించాలో చంద్ర దిశానిర్దేశం చేశాడనిపిస్తుంది.

చంద్ర యెప్పుడూ అనేవాడు యీ ఆధ్యాత్మిక బోధలు చేసే వారికి, అద్భుతంగా అద్వైతం బోధించే వారికి ఆధునికతపట్ల అవగాహన, వ్యతిరేకత లేకపోవడం విషాదకరం అనేవాడు. ప్రతీ కొండమీద ఒక దేవాలయం నిర్మిస్తే కొండల్నీ గుట్టల్నీ నాశనం చేసే వ్యాపారతత్వానికి గండిపడ్తుందని అనేవాడు.

ఆధునికతకీ, ఆధునికత తీసుకువచ్చిన ధనకాంక్షకీ చంద్ర ఎదురీదాడు. ధనార్జనపట్ల వ్యతిరేకత బ్రాహ్మణ ధర్మశాస్త్రాలలో వున్నదే. బౌద్ధం వడ్డీ వ్యాపారాన్ని సమర్థిస్తే, బ్రాహ్మణ ధర్మశాస్త్రాలు వ్యతిరేకించాయి. ఈ విషయాన్ని ప్రముఖ చరిత్రకారుడు డి.ఎన్.ఝా కూడా గుర్తించాడు.

ఇస్లాం కూడా వడ్డీ వ్యాపారానికి విరుద్ధమే.

చంద్ర మరణించేనాటికి సొంత యింటిని కూడా సమకూర్చుకోలేక పోయాడు.

యీ సందర్భంగా కంచి పరమాచార్యుల వారి ప్రబోధం నాకు గుర్తుకు వస్తోంది. ధనకాంక్ష పెరగడంవల్ల బ్రాహ్మణుడి గౌరవం క్షీణించిందన్నారు పరమాచార్యులు.

ఈ సరళమైన జీవిత విధానమే బ్రాహ్మణులలోని జీవశక్తిని యింకా నిలిపి ఉంచుతోంది. ఆయన బ్రాహ్మణుడు, నీతిమంతుడు అన్నా, ఆయన బ్రాహ్మణుడైనప్పటికీ నీతిగా ధర్మంగా జీవించాడని లోకం ప్రస్తుతించినా యీ సరళమైన నిరాడంబరమైన జీవన శైలే కారణం.

నాకో సంగతి గుర్తుకు వస్తోంది. నేనొకసారి నరహరితో అన్నాను. ప్రముఖ మానవ హక్కుల నాయకుడు కె. బాలగోపాల్ అనేకమంది విదేశీ తత్వవేత్తల గురించి మాట్లాడారు కాని వైష్ణవుడైనప్పటికీ రామానుజ వేదాంతాన్ని గురించి కనీసం ప్రస్తావించకపోవడాన్ని యెలా అర్థంచేసుకోవాలి అని అడిగాను. “ఆయనే రామానుజుడు” అన్నాడు నరహరి.

ప్రతీ విషయాన్ని మాట్లాడవలసిన అవసరం లేదు. వాచ్యం చెయ్యవలసిన అవసరం లేదు. జీవన శైలే సిసలైన భాష్యం.

ఇంతకీ బ్రాహ్మణులందరూ ఒకరు కాదు. బ్రాహ్మణా నా మనేకత్వం. ఎమ్మెల్ పార్టీల్లో ఏకత్వం ఎలా సాధ్యం కాదో బ్రాహ్మణుల్లోనూ ఏకత్వం సాధ్యం కాదు. కాని బ్రహ్మణ జీవనశైలి అనదగినది వొకటి వుంది.

వేదాంతకో బ్రాహ్మణః స్యాత్

క్షత్రియో విజయీ భవేత్

వైశ్యో ధనసమృద్ధః స్యాత్

శూద్రః సుఖమ వాప్నుయాత్.

సుఖమూ, ధనమూ బ్రాహ్మణుడికి చెందవు. విజయమూ అతనికి సంబంధించినది కాదు. వైరాగ్యమే అతని ఆస్తి.

కనీసం యిటువంటి విలువలు బ్రాహ్మణుడు కలిగి ఉండాలని శాస్త్రాలు శాసించాయి. అతడు దారితప్పి ఉండవచ్చు. కాని ప్రపంచం అతని నుంచి అటువంటి విలువలని యుగాలుగా ఆశిస్తోంది. అదే అతని సాంస్కృతిక భారం (కల్చరల్ బర్డెన్) కూడా. దాన్ని అతడు పూర్తిగా తృణీకరించలేడు. ముండిత శిరస్సుతో నిరాడంబర వేషధారణతో కూడిన బ్రాహ్మణుని రూపం ఆకర్షణీయం కాదు. అతడు అలా జీవించాలని ధర్మం శాసిస్తోంది.

ధర్మాన్ని అతిక్రమిస్తే, ధనార్జనే పరమధ్యేయంగా మారితే జరిగేదేమిటి? బ్రహ్మణునికి మిగిలేది దుఃఖమే. దానివల్ల వచ్చే నిందని భరించడం కన్న బ్రాహ్మణునికి చావే శరణ్యం.

ఇది బ్రాహ్మణునికి నిర్దేశించబడిన విలువ మాత్రమే. దీనిని అందరూ అనుసరించారని చెప్పలేం. కాని ఇది ఒక విలువగా బ్రాహ్మణున్ని వెంటాడింది. అందుకే ధనం పుచ్చుకొని విద్య చెప్పరాదని, వైదికుడు ప్రతిగ్రహం దానాన్ని స్వీకరించడం చెయ్యరాని పని అని వైదిక బ్రాహ్మణుల విశ్వాసం. అటువంటి ధర్మాన్ని అతిక్రమిస్తే పాపం సంక్రమిస్తుంది. ఇదంతా ఆధునిక పరిభాషలో ఫ్యూడల్ మనస్తత్వం అనికూడా పిలవవచ్చు. ధనస్వామ్యం పట్ల వ్యతిరేకత, మార్పుని వ్యతిరేకించడం అని సూత్రీకరించవచ్చు. ధనం పంటలు పండవలెనోయ్ అనే గురజాడ దృక్పథానికి విరుద్ధం అని కూడా అనవచ్చు.

సరిగ్గా యీ మార్పుపట్ల వ్యతిరేకతే బ్రాహ్మణుణ్ణి శక్తిమంతుడిగా నిలిపింది. ధనస్వామ్యంలో కొట్టుకుపోకుండా చేసింది. చుండూరు కేసుని గెలిపించింది కూడా యీ బ్రాహ్మణ్యమే. అదీ 'చంద్ర' దర్శనం.

నీతి కలిగి ఉండడం దానికదే పరమ లక్ష్యం కాదు. నిరపేక్షమైన నీతిని ప్రతిపాదించడం అవివేకం. అన్నాహజారే అవినీతి వ్యతిరేక ఉద్యమం చిత్తశుద్ధి లేనిది. లక్ష్యాన్ని సాధించడానికి నీతి అవసరం. అది లోపించడంవల్ల స్వీయవర్గాలనుంచే పీడితులకి నమ్మకద్రోహం జరిగిందని చంద్ర నిరూపించాడు

ఆ రోజే చంద్రకి కీమోథెరపీ జరగబోతోంది. చంద్ర మితిమీరిన నడుం నెప్పితో బాధపడ్తున్నాడు. అయినప్పటికీ నన్ను దిగవల్లి శివరావు రాసిన కథలు గాథలు పుస్తకం నుంచి మొదటి ఛాప్టర్ చదివి వినిపించమన్నాడు. భారతీయుల్ని క్రైస్తవీకరించడం కోసం బ్రాహ్మణ సన్యాసి వేషం ధరించిన ఫ్రెంచి మిషనరీ జీవిత వృత్తాంతం అది. ఆ సన్యాసి తత్వబోధక స్వామి అని పేరుకూడా మార్చుకున్నాడు. ఈ వృత్తాంతాన్ని నాటకీకరిస్తే అద్భుతంగా వుంటుందన్నాడు చంద్ర. హిందూవాదులు దుర్వినియోగం చేసే అవకాశం ఉందని కూడా వ్యాఖ్యానించాడు.

అంత నెప్పితోనూ కూడా అంత శ్రద్ధగా వినడమే కాదు, ఆ విషయాన్ని గురించి చర్చకూడా చేశాడు. యిదంతా బాధనుంచి ఉపశమనంగా పనిచేస్తుందన్నాడు.

మానసిక శక్తి కూడా వ్యాధిపై విజయానికి తోడ్పడ్తుందన్నాను నేను. అలా అంటూ నా సంచీలోని పుస్తకం బయటికి తీశాను. ఆ పుస్తకం పేరు టైమ్, స్పేస్ అండ్ మెడిసిన్. ఒక ఆంగ్లేయ వైద్యుడు రాసిన గ్రంథం. వైద్యశాస్త్రం ప్రపంచాన్ని యంత్రంగా భావించిన న్యూటన్ కాలపు భౌతిక శాస్త్రం దగ్గరే నిలిచిపోయిందని ఆ పాశ్చాత్య వైద్యుడు వ్యాఖ్యానించాడు. పదార్థమూ, శక్తీ ఒకటే అనే కాలంలో మనం అడుగుపెట్టాం. అలాగే నిరపేక్ష కాలం, నిరపేక్ష స్థలాల స్థానంలో పరస్పరాధారితమైన స్పేస్ టైమ్‌లోకి మనం పురోగమించాం. కాని వైద్యశాస్త్రం శరీరం, ఆత్మ పూర్తిగా భిన్నమైన ప్రాచీన క్రైస్తవ విశ్వాసంలోనే ఘనీభవించిపోయింది. చైతన్యమూ పదార్థమూ పరస్పరం పూరకాలు. ఈ

సత్యాన్ని గ్రహిస్తే వైద్యశాస్త్రంలో మానసిక అంశాలకి గల ప్రాధాన్యం బోధపడుతుందంటాడు ఆ వైద్యుడు. ఇదంతా చంద్రకి వివరించాను. ఈలోగా డాక్టర్ రవిబాబుగారు మేమున్న గదిలో అడుగు పెట్టారు.

యల్లంరాజు శ్రీనివాసరావుగారి అద్వైత ఉపన్యాసాలకి వెళ్లినప్పుడు, అక్కడ రవిబాబు గారు చంద్ర ద్వారా పరిచయమయ్యారు.

రవి బాబుగారు చంద్రని పలకరించి నన్ను తనతో రమ్మన్నారు. నాతో మాట్లాడవలసి ఉందన్నారు.

చంద్రశేఖర్ ఎందరో కేన్సర్ వ్యాధిగ్రస్తులకంటే ధైర్యంగా వ్యాధిని ఎదురీదుతున్నారు అన్నారు రవిబాబుగారు మెచ్చుకోలుగా.

అప్పుడు నేను స్పేస్ టైమ్ అండ్ మెడిసిన్ అనే గ్రంథాన్ని రవిబాబుగారికి ఇచ్చాను. అందులోని సారాన్ని వివరించాను.

తర్వాత మా చర్చ దేహం, ఆత్మల చుట్టూ తిరిగింది. దేహ బాధల్ని నిజంగా మనిషి అతిక్రమించగలడా? మోక్షం పొందిన అవధూతలైనా వొళ్లుకాలితే, కేన్సర్ సోకితే చీమకూడా కుట్టనట్లు నిర్లిప్తంగా ఉండగలరా? అద్వైతం ద్వారా అధిగమించగలరా? దేహాన్ని యెక్కడో దారిలో తగిలిన గులకరాయిని తన్నేసినట్లు, సింపుల్‌గా తీసుకోగలరా? యిలా ప్రశ్నల మీద ప్రశ్నలు గుప్పించాను నేను.

ఒక కేన్సర్ స్పెషలిస్టుకి సంబంధంలేని ప్రశ్నలు యివి. కాని రవిబాబుగారు డాక్టరేకాదు, వేదాంతాన్ని అధ్యయనం చేసిన శ్రద్ధాశీలి కూడా.

కేన్సర్ వ్రణాన్ని కూడా రమణ మహర్షి నిర్లిప్తంగా భరించాడంటారు అన్నారు రవిబాబు.

మానసిక శక్తితో వ్యాధిని భరించదగినదిగా మార్చుకోవచ్చేమో అన్నాను నేను.

కావచ్చు కాని వ్యాధి వ్యాధే. కేన్సర్ కేన్సరే. అది పిరికివాళ్ళనీ ధైర్యవంతుల్నీ, రుషుల్నీ, క్రిమినల్స్‌ని వొకేలా కబళిస్తుంది అన్నారు డాక్టర్.

అందరూ పరాజితులే. ఎందుకంటే చివరికి అందరూ మరణిస్తారు అన్నాడు మళయాళీ రచయిత వైకం మహమ్మద్ బషీర్.

కాని చంద్ర పరాజయం చెందదలచుకోలేదు. పరాజయం అనే మాట అతనికి నచ్చదు. తనదైన తార్కిక శక్తితో న్యాయ వ్యవస్థనీ, బౌద్ధిక రంగాన్నీ శాసించదలుచుకున్న ధీరుడు అతడు. బుద్ధిశాలి అతడు.

నాలాగ అతడు పరాజయాన్ని అంగీకరించడు. నాది పురోహిత మనస్తత్వం. ఎవరైనా గొంతెత్తి అరిచారా గొడవెందుకని వెనక్కి తగ్గుతాను. తక్షణం స్థాపించవలసిన సత్యం వుందన్నట్లు ఎవరితోనూ తలపడను. నా అభిప్రాయం చెప్తాను. ఊరుకొంటాను. ఊరుకోడమంత ఉత్తమం లేదు. బోడిగుండంత సుఖం లేదు అని భావిస్తాను.

చంద్ర మనస్తత్వం అందుకు భిన్నం. ఖండించవలసిన విషయాన్ని ఖండించాలి అని భావించేవాడు. 'అతడొక వీరశైవుడు' అన్నాడు నరహరి. నిర్లిప్తతని చంద్ర భరించలేడు. బౌద్ధిక రంగంలో కూడా మౌనం వహించడం అతడు అసహ్యించుకొనేవాడు. నీ అభిప్రాయం ఏదో నువ్వు చెప్పాలి అనేవాడు. మౌనంతో తప్పించుకు తిరిగే ధన్యుల్ని చీల్చి చెండాడేవాడు. వాళ్లు పిరికి వాళ్ళు అనేవాడు.

సాధించవలసినదీ స్థాపించవలసినదీ నిరూపించవలసినదీ ఉందన్న చంద్ర వైఖరి అతన్ని పూర్తి అద్వైతంలో లీనం కాకుండా నిలిపింది. యిది ఈశ్వర సంకల్పం కావచ్చు. ఈశ్వరుడు చంద్ర ద్వారా ధర్మస్థాపన చెయ్యడం కోసం అతన్నొక త్రిశూలంగా మార్చుకొన్నాడనిపిస్తుంది.

అతడొక త్రిశూలం. ఎప్పుడూ అంతే. తీవ్ర వ్యాధిగ్రస్తుడైనప్పుడు కూడా అతడి బుద్ధీ వాక్కు క్షీణించలేదు.

తీవ్రంగా వ్యాధితో బాధపడ్తున్న కాలంలోనే మృత్యుంజయరావూ, వొక జడ్జీ, చంద్ర, నేనూ అతని ఆఫీసులోనే కలుసుకొన్నాం. చంద్ర తీవ్రమైన నెప్పితో బల్లమీద పడుకొన్నాడు. సాధారణ శిక్షల్లా ఉరిశిక్షలు వేస్తూపోయే ఒక జడ్జిని అపహాస్యం చేస్తూ మాట్లాడాడు. అదే సందర్భంలో మొపాసా కథని ఒకదాన్ని ఉదహరించాడు. ఒక జడ్జీ విరివిగా ఉరిశిక్షలు వేసేస్తుంటాడు. ఇంతకీ హత్యలు చేసే క్రిమినల్ ఆ జడ్జిగారే.

ప్రతీ దాన్ని ఆధునిక న్యాయ దృష్టితో చూసే దృష్టిని సంకుచిత దృష్టిగా, వలసవాద దాస్యంగా చంద్ర అభివర్ణించాడు. యీ సందర్భంగా గోపిని కరుణాకర్ కథని దృష్టాంతంగా చూపాడు.

న్యాయ శాస్త్రాన్నీ, సాహిత్యాన్నీ రెండింటిని కలిపి విశ్లేషించేవాడు చంద్ర. ఇక్కడ అతడొక ఆకర్షణీయమైన న్యాయవాదిగా కనబడేవాడు.

ఇంతకీ ఈ ఆధునిక న్యాయవాది నిజంగా ఆధునికుడేనా? ఆకర్షణీయమైన ఆధునిక దుస్తుల్లో కారులో విహరిస్తూ, పాశ్చాత్య తత్వవేత్తల మాటల్ని విరివిగా విసిరే ఈ మేధావి ఆధునికుడేనా? నా ప్రశ్నలోని వైరుధ్యాన్ని నేను గుర్తిస్తున్నాను. కాని నా ప్రశ్న అర్ధ రహితం కాదు. నా ప్రశ్నలోని అంతరార్థాన్ని ఒక సామెత ద్వారా స్పష్టం చేస్తాను. తెల్లనివన్నీ పాలుకావు నల్లనివన్నీ నీళ్లుకావు. చంద్ర ఆధునికుడు కాదు. అతడు సనాతనుడు.

చంద్ర మరణానంతరం దాచేపల్లి పురవీధుల్లో నేనూ, మృత్యుంజయరావు నడిచి వెళ్తున్నాం. ఒక మరణానంతర వైదిక కర్మ అక్కడ జరగవలసి ఉంది. అది చంద్ర స్వగ్రామం. మృత్యుంజయరావు హఠాత్తుగా ఆగి "అంత యెత్తుకు యెదిగిన న్యాయవాది, మేధావి చంద్రశేఖర్ ఈ ఇరుకు సందుల్లోనే బాల్యంలో ఆటలాడాడని నమ్మడం కష్టం" అన్నాడు.

నిజానికి చంద్ర పల్నాటివాడు. ఆ వీరశైవం, ఆ ఆవేశం అంతా పల్నాటి పౌరుషమే. ఆ భక్తి భావం కూడా పల్నాటిదే. అతని హృదయం ప్రాచీనం.

కాటన్ దొర గోదావరీ జలాల్ని అపవిత్రం చేశాడు. కోనసీమని అప్రాచ్యం చేశాడు. ఆ విచ్ఛిత్తిలోంచే ఆ పగుళ్లలోంచే నీ రచనలు వస్తున్నాయి. నువ్వు ఆధునికతా శాపగ్రస్తుడివి అన్నాడు నరహరి నాతో ఒకసారి.

కోనసీమ చాలా అందమైన ప్రాంతం అని నేనన్నప్పుడు చంద్ర వెంటనే ఖండించాడు. అది కృత్రిమమైన సౌందర్యం అన్నాడు. కోనసీమలో వైవిధ్యం తక్కువ. పల్నాడులో తెలంగాణాలో ఉన్న ప్రకృతి వైవిధ్యం కోనసీమలో మచ్చుకైనా కనబడదు అన్నాడు. బారులు తీరిన కొబ్బరిచెట్లు, యిళ్ళు తప్ప కోనసీమలో మరేముంది అన్నాడు.

ఆధునిక నీటిపారుదల సౌకర్యాల నుంచి వచ్చిన వినూత్న రూపురేఖలే తప్ప కోనసీమలో ప్రాచీన సౌందర్యం మటుమాయమైందనిపిస్తుంది. ప్రతాపరుద్రుని పతనం తర్వాత తెలంగాణా బ్రాహ్మణ కుటుంబాలు వలసవచ్చి కోనసీమలో స్థిరపడ్డాయి. ఈ విషయం ఉప్పులూరి గణపతిశాస్త్రిగారి వేదసార రత్నావళిలో ఉటంకించిన ఒక శాసనం ద్వారా తెలుస్తోంది. ద్రావిడ బ్రాహ్మణులు తమిళనాడు నుంచి వలస వచ్చారని అంటారు. ఇలా యెక్కడెక్కడి బ్రాహ్మణులకి నిలయమై స్వచ్ఛమైన వేదపఠనానికి నిలయమైన కోనసీమ, క్రైస్తవమూ నీటిపారుదల సౌకర్యాలవల్ల ఆధునికతలోకి అడుగుపెట్టింది. కొందరు బ్రాహ్మణులు కాటన్ దొరకి తర్పణాలు వదిలేవారని కూడా అంటారు. కాని ఆధునికత సనాతన సంప్రదాయాల్ని పూర్తిగా మింగెయ్యలేదు. కాని సంక్షోభానికి కారణమైంది. పూర్తిగా నీటి పారుదల మీద ఆధారపడిన వ్యావసాయక విధానాన్ని విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలలో విమర్శించాడు. వలసవాద ఆధునికతకి మూలం అదేకదా? సరిగా ఈ వలసవాద అధునికతనే చంద్ర చీల్చి చెండాడాడు. అతడు ఆధునిక సౌకర్యాలకి దూరంగా నిలిచిపోయిన పలనాటిలో పుట్టి పెరిగాడు. అది అతనిలో స్వచ్ఛమైన సనాతన దృక్పథానికి కారణమైంది అనిపిస్తుంది.

చంద్ర పాశ్చాత్య సాహిత్యాన్ని, సిద్ధాంత గ్రంథాల్ని అపోశన పట్టి వుండ వచ్చు. కాని అతనిలో ఆధునిక వ్యక్తివాదం బలంగా ప్రవేశించలేదు. అందుకే పద్యాన్ని ప్రేమించాడు. పద్య నాటకాల్ని ఇష్టపడ్డాడు. హరిశ్చంద్ర నాటకం అంటే ప్రాణం. అదే సమయంలో వచన కవిత్వం అంటే తీవ్రమైన అసహనం.

వచన కవిత్వం సనాతన గ్రామీణ వ్యవస్థ మీద దాడి అనేవాడు. అది కమ్యూనిటీకి విరుద్ధం అని చీల్చి చెండాడేవాడు. నువ్వెందుకు వచన కవిత్వ పంకిలంలో కూరుకుపోయావు అని నిలదీశాడు నన్ను. వేగుంట మోహన ప్రసాద్‌ని వ్యక్తివాది అన్నాడు. ఈ పదం చంద్ర దృష్టిలో తిట్టు.

కాని వేగుంట మోహన ప్రసాద్ కూడా మెచ్చుకున్న వచన కవిత్వం రాసిన వాడిని నేను. అట్లాగని పెద్ద బాధా ఉండదు లాంటి వాక్యాలు నాలో ఇప్పటికీ తచ్చాడ్తాయి. ఇది 'మో' కవితలోనిది. ఆధునిక జీవితనిస్సారతలోంచి, ఏకాంతపు బోర్‌డమ్ నుంచి వెలువడిన వాక్యం.

ఏకాంతంలోకి కూరుకు పోవడాన్ని చంద్ర ఇష్టపడలేదు. కొట్లాడుతూనైనా జనంలోనే వుండడానికి యిష్టపడ్డాడు. ఇది పూర్తిగా గ్రామీణ మనస్తత్వం. అందుకే రూపంలోనే ఆధునికతలోకి ప్రవేశించాడు కాని సారంలో కాదు.

ఒక కాఫ్కా కథని అనుసరిస్తూ కథ రాశాడు. అది న్యాయం కోసం, తీర్పు కోసం జీవితకాలం ఎదురుచూస్తూ, న్యాయస్థానపు గుమ్మం ముందే కడతేరిన అభాగ్యుని కథ. దానిని ఆధునిక న్యాయ వ్యవస్థయొక్క అసంబద్ధతనీ, క్రౌర్యాన్నీ, నిర్దాక్షిణ్యతని వ్యక్తం చెయ్యడానికి చంద్ర రాశాడు కాని పాశ్చాత్యుల వైయక్తికతలో చంద్ర కూరుకుపోలేదు.

ఈ అర్థంలో పాశ్చాత్య విద్యావంతుడైన చంద్ర పాశ్చాత్యంలో ప్రాచ్యాన్ని అన్వేషించాడనిపిస్తుంది. గాంధీని గురించి ఇలాంటి వ్యాఖ్యానమే యెవరో చేశారు. ఆధునికత తీవ్రంగా ముంచెత్తినప్పటికీ ఆ మకిలి అంటని సనాతనుడు చంద్ర అనిపిస్తుంది.

జితేంద్ర వ్యాఖ్యానం రాసిన వ్యవహార చింతామణి గ్రంథం గురించి చర్చ జరిగింది. దైద క్షేత్రంలో నేనూ, సుబ్రహ్మణ్యంగారు, జితేంద్ర, చంద్ర కలిసి వాచస్పతి మిశ్రుని వ్యవహార చింతామణి గ్రంథంయొక్క సుదీర్ఘమైన ముందుమాటని ఆమూలాగ్రం చదివాం. ఆ ముందుమాట జితేంద్ర రచించినది.

అందులో రాజ్యం ఆవిర్భావాన్ని గురించి, కారణాల గురించి బుద్ధుడు చేసిన సిద్ధాంతాన్ని గురించి కూలంకషంగా చర్చించాడు చంద్ర. అదే సమయంలో ఆధునిక పాశ్చాత్య సిద్ధాంతాలతో గల సామ్యాన్ని ప్రస్తావించాడు. చివరికి యేమన్నాడంటే - రాజ్యం, న్యాయ వ్యవస్థలాంటి విషయాల గురించి భారత దేశంలో యెన్నో గొప్ప సిద్ధాంతాలు పుట్టాయి. భారతీయ వ్యక్తీకరణ పాశ్చాత్యంకంటె భిన్నమైనది, గాఢమైనది, దానిపై పాశ్చాత్యం మబ్బులా కమ్ముకుపోయింది అన్నాడు చంద్ర.

అందుకే మనం ఋగ్వేదంలోని సూర్యునీ ఉషస్సునీ ఆవాహన చేస్తున్నాం. ఆ మబ్బుల్ని చెదరగొట్టడానికి సంకల్పించాం అన్నాను నేను.

ఋగ్వేదం ఆధారంగా సనాతనాన్ని పునరావిష్కరించడానికి ప్రయత్నిస్తూ గ్రంథరచన చెయ్యాలని నేనూ, చంద్ర, జితేంద్ర ఉమ్మడిగా ప్రమాణం చేశాం.

కాని, ఆ ప్రమాణాన్ని నెరవేర్చకుండానే చంద్ర అస్తమించాడు. చంద్రుడు సూర్యకిరణాలవల్లనే ప్రకాశిస్తున్నాడన్న సత్యం ఋగ్వేదం ఋషులకి తెలుసును అని చంద్ర ఋగ్వేద ప్రమాణం చూపాడు ఒకసారి. అమావాస్య కమ్ముకుందే కాని చంద్ర అస్తమించలేదు. పునః పునర్జాయమానా. ఉషస్సు తిరిగి తిరిగి ఆవిర్భవిస్తోంది, జన్మిస్తోంది అని ఋగ్వేదమే ఘోషిస్తోంది. ఉషస్సుకీ చంద్రుడికీ వెల్తురుకీ మరుగు కావడమే కాని అంతం లేదు. బాడీ ఈజ్ ఇమ్మోర్టల్ (యూజీ). ప్రతీదీ రూపాంతరం చెందుతుందే కాని అభావం చెందదు. అదీ సనాతనం.

చంద్రుని కాంతి సూర్యునిదైతే మా వాక్యాలపై ప్రసరించే కాంతి చంద్రునిది. ఆ వెలుగులోనే ఈ వాక్యాలు రచిస్తున్నాను.

వ్యక్తివాదాన్నీ తనలోకి తాను కూరుకుపోవడాన్నీ వ్యతిరేకించిన చంద్ర నన్ను కూడా శూన్యస్థితిలో ఉండనిచ్చేవాడు కాదు. ఒకటి రెండు రోజులకే ఫోను మోగేది. ఒకొక్కసారి రోజులో అనేకసార్లు. ఏదైనా ఒక గ్రంథం చదువుతుంటే ఒక వాక్యం వెంటాడిందా, ఒక పదం స్ఫురించిందా అది యితరులతో పంచుకోవలసిందే. ఏదీ శూన్యంలో అంతర్ధానం కావడానికి వీలులేదు. ఇలా ప్రతిదానికీ రూపం యివ్వడానికి ప్రయత్నించాడు రూపలాలసుడూ, సగుణోపాసకుడూ చంద్ర.

ఇదొక మహావాక్యం గుర్తుంచుకో నీషే చెప్పిన మాట ఇది అంటూ ఇలా చెప్పాడు: ‘‘మైథాలజీని యాంత్రొపాలజీగా వ్యాఖ్యానించడం, మైథాలజీ స్థానాన్ని దురాక్రమణ చెయ్యడమేనన్నాడు నీషే.’’ ఈ మాటని నేను బస్సులో ప్రయాణిస్తుండగా హఠాత్తుగా ఫోనుచేసి చెప్పాడు చంద్ర. పురాణం, చరిత్ర, సోషల్ సైన్సులు, వీటి మధ్య సంబంధం గురించి చర్చ చాలానే జరిగింది.

అసలు పరిణామవాదాన్ని అంగీకరించవచ్చా అనే మౌలికమైన ప్రశ్న మాలో చెలరేగింది. సనాతనంలో పరిణామవాదం ఉందా? ఉంది, భారతీయమైన పరిణామవాదం ఉంది అన్నాను నేను.

భారతీయ వాఙ్మయంలోనూ పరిణామవాదం ఉంది. అది సూక్ష్మం నుంచి స్థూలానికి జరిగే వ్యక్తీకరణ. తిరిగి సూక్ష్మంలోకి తిరోగమించి లయించడం. యిదొక చక్రభ్రమణం.

సామాజిక పరిణామాన్ని గురించిన ప్రసక్తి పురాణాల్లో ఉంది. పృథు చక్రవర్తి నగర, గ్రామ విభాగం చేశాడు. అంత క్రితం అడవులూ కొండలే తప్ప గ్రామాలూ నగరాలూ అనే వాడుకే లేదు. వాయు పురాణం స్పష్టం చేస్తున్నదేమిటంటే - మనుష్యులు అందరూ మొదట ఆటవికులే. తరువాత క్రమేపీ వస్త్రధారణనీ గృహనిర్మాణాన్నీ అలవరచుకొని, గ్రామాలను ఏర్పరచుకొన్నారు. నాగరికులయ్యారు.

వ్యావహారిక సత్తాగా పరిణామవాదాన్ని అంగీకరిస్తారు అద్వైతులు. పారమార్థికంగా మాత్రం సృష్టే మిథ్య. ఈ విషయాన్నే నేను చంద్రకి వివరించాను.

నీషే భావించినట్లే కంచి పరమాచార్యులవారు కూడా వేద పురాణాలకి సామాజిక మానవ శాస్త్ర వ్యాఖ్యానాలు చెయ్యడాన్ని నిరసించారు. అదంతా వలసవాద చరిత్రకారుల వ్యాఖ్యానంగా కొట్టివేశారు. నా ఉద్దేశ్యంలో భారతీయ పద్ధతిలో చరిత్రని నిర్మించడం సాధ్యమే. అది పురాణానికి కొనసాగింపుగా ఉంటుంది. అది చరితమే కాని చరిత్ర కాదు.

ఆబ్జెక్టివ్‌గా గతాన్ని క్రమపద్ధతిలో పేర్చడం అనేది అసాధ్యం. మన ప్రాపంచిక దృష్టిమీద ఆధారపడి చరిత్ర ఉంటుంది. అందువల్ల చరిత్ర కూడా ఒక పురాణమే. మనదైన పురాణాన్ని మనం రచించుకోవాలి. యెప్పటికప్పుడు సృజించుకోవాలి. ఇదిగో ఇలా సాగేవి మా ఆలోచనలు. అందుకే గురజాడ వెర్రిపురాణ గాథలు అనడాన్ని మేము నిర్ద్వంద్వంగా నిరసించాం. గురజాడది వలసవాద దృష్టి.

ఇంతకీ ఇప్పుడు చంద్ర కూడా ఒక పురాణ పురుషుడే. అతనికి ఎటువంటి ఆకృతిని ఇవ్వాలని యెవరికి వారు ఆలోచిస్తున్నారు. విగ్రహాన్ని చెక్కాలని ఆలోచిస్తున్నారు.

చంద్ర కళేబరం ముందు నిలబడి మృత్యుంజయరావుగారు అన్నారు: బుద్ధ భగవానుని మరణానంతరం అతని శిష్యులు బుద్ధుని శరీర అవశేషాల్ని పంచుకొన్నారు. ఒకరు వెంట్రుకల్ని, మరొకరు జుట్టుని, మరొకరు మరొకటి. ... చంద్ర విషయంలో కూడా యిదే జరుగుతోంది. చంద్రని సమగ్రంగా ఎదుర్కోవడానికి అందరూ నిరాకరిస్తున్నారని, అతనిలోని యేదో ఒక పార్శ్వాన్ని

మాత్రమే చూడడానికి ఇష్టపడుతున్నారని ఆయన అభిప్రాయం. ఆ ఒక్క పార్శ్వాన్నే సమగ్రమైనదిగా చిత్రించాలని చూస్తున్నారని కూడా అంతరార్థం.

అదే ప్రగతి శీలం, ఆధునికమైన చంద్ర గతం.

ఆ ఆధునికతతో చంద్ర రూపాన్ని మొత్తంగా కప్పెయ్యాలని చూస్తున్నారు.

చంద్ర మరణానంతరం తక్షణం జరిగిందదే. అతని గురించి రాసిన బేనర్లలో నినాదాలలో చాలా సంవత్సరాల క్రితం చంద్రయే కళ్లకు కట్టాడు. అతడు నేటి చంద్ర కాదు.

15 సంవత్సరాల క్రితం చంద్ర మరణిస్తే యే నినాదాలు యివ్వాలో, ఆ నినాదాలు ఇప్పుడు ఇస్తున్నారు.

సమాజం స్థిరం. అది తాను ఏర్పరుచుకున్న ఇమేజినే బృహత్ రూపంలో ప్రదర్శిస్తుంది. లెఫ్టిస్టు, మానవ హక్కుల ఉద్యమకారుడు... ఇదిగో ఇలాంటి విశేషణాలే చంద్ర కళేబరం ముందు వీరవిహారం చేశాయి.

తర్వాత కొందరు మేధావులు రాసిన వ్యాసాల్లో పోస్టు మోడర్నిస్టుగానో, మరో రూపంలోనే చంద్ర సాక్షాత్కరించాడు. మరి అతనిలోని సనాతనం సంగతి ఏమిటి? అది ఒక బిందువు మాత్రమేనా? సింధువులోని బిందువేనా? లేక చంద్ర చేరుకొన్న చివరి గమ్యమా?

చంద్ర తీవ్రమైన నెప్పితో మెలికలు తిరుగుతూ ఆసుపత్రిలో బెడ్డుమీద ఉన్నాడు. నేను ప్రక్కన స్టూలుమీద కూర్చొని ఉన్నాను. చంద్ర పెదాల మీంచి రెండు కావ్యాలపేర్లు వినబడ్డాయి. ''కాదంబరి'', ''నైషధం''. కష్టం మీద మాట్లాడుతున్నాడు. చూడు శర్మా, నువ్వురాసే సనాతనం అనే గ్రంథంలో ఒక భాగం కావ్య సాహిత్యానికి కేటాయించు. సంస్కృత కావ్య సాహిత్యానికి ముఖ్యస్థానం కల్పించు. రసానందం కంటె దివ్యానందం వేరే యేముంది! నేనీ దుర్భర స్థితిలో కూడా ఆ ఆనందాన్ని పొందగలిగాను. అమూర్త విషయాలని కూడా పెర్సానిఫికేషన్ ద్వారా రూపుకట్టించే గొప్ప ప్రతిభ ఈ కావ్యాల్లో కనిపిస్తుంది. ముఖ్యంగా శృంగార నైషధంలో కలిపురుషుని వర్ణన చూడు అన్నాడు చంద్ర.

ఆ క్షణంలో చంద్ర నా కళ్లముందు కనుమరుగై కొంపెల్ల సుబ్బరాయ శాస్త్రిగారి బ్రహ్మమయ మూర్తి గోచరించింది. కామధేనువుని గడ్డిమేపుతూ, పంచ

కావ్యాలు, అందలి స్వారస్యం గ్రంథం చూడకుండానే గట్టుమీద కూర్చొని బోధించే గురుమూర్తి స్మృతిపథంలో మెదిలారు. బహు గ్రంథకర్త, మహా పండితుడు, మహా మహోపాధ్యాయ పుల్లెల శ్రీరామచంద్రుడి గారికి గురువు కూడా ఆయనే.

అట్టి మహా పండితుడు వ్యాకరణాంభోధి సుబ్బరాయశాస్త్రి గారి వద్ద కావ్యపఠణం చేసిన సుకృతం నాకు దక్కడం పూర్వజన్మ సుకృతమే. నల్లబల్ల లేదు. సుద్దముక్క లేదు. పాఠం పూర్తయ్యేటప్పటికి శ్లోకం నోటికి వచ్చేసేది. ఆయన దండాన్వయ పద్ధతి ద్వారా శ్లోకాన్ని శాశ్వతంగా స్మృతిలో నిలిచిపోయేలా చేసేవారు. దండాన్వయ పద్ధతి అంటే శ్లోకాన్ని చిన్న చిన్న ప్రశ్నలుగా, సమాధానాలుగా విభజిస్తూ బోధించడం.

పద్యనాటకాల మీద ఉండే సహజ పామర ఆసక్తి నుంచి, కావ్యాలలోని సరసతని ప్రేమించే పండితలోక విహారంలోకి అడుగుపెట్టాడు చంద్ర. యిది చంద్ర లోకంలో జరిగిన ఆంతరంగిక ప్రయాణం. ఇది జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ అనే సత్యాన్ని కనుగొన్న క్షణం. ఈ పలనాటి బాలచంద్రుడి చుట్టూ సుబ్బరాయు శాస్త్రిగారి సనాతన ఆత్మ పరిభ్రమిస్తోందా అని ఆశ్చర్యపోతుండేవాడిని నేను.

చంద్ర కావ్య సాహిత్యం పట్ల అంత యెక్కువగా యెందుకు ఆసక్తి చూపించాడు? చంద్ర సహజంగా స్వాప్నికుడు. అందుకే కావ్యాలలోని కల్పనాశక్తి అతన్ని ఉత్తేజితుణ్ణి చెయ్యడం మొదలు పెట్టింది. పైగా ఆధునిక యాంత్రిక యుగం శృంగార రసానికి స్థానం లేకుండా చేస్తోందని చంద్ర భావించాడు. ముఖ్యంగా ఆధునికతలో ఊహకీ, కల్పనకీ స్థానం లేకుండా పోయింది. అంతా ఎస్సెమ్మెస్‌ల యుగం. భాష క్షీణించడంతో భావమూ బలహీనపడింది.

ఇట్టి యాంత్రిక యుగంలో వస్తు వ్యామోహ పరతంత్రత మధ్య హృదయాంగమ వర్ణనలకీ, చతుర సంభాషణలకీ, నేల విడిచిన ఊహా విహారానికీ, సంకెళ్ళు తెంచుకున్న కథన మాధుర్యానికి నిలయాలైన ప్రాచీన కావ్యాలు చంద్రకి పెయిన్ కిల్లర్స్‌గా పని చేశాయి. ఆధునిక కార్యకారణ సంబంధం నుంచి ఊపిరి పీల్చుకునేలా చేశాయి.

మరోసారి చెప్తున్నాను. చంద్ర స్వాప్నికుడు. సుందర స్వప్నాలలో విహరించాలని చూసేవాడు. దీన్ని హెడొనిజం అనగలమా?

భార్యాభర్తల మధ్య శృంగారలీలని బ్రహ్మానుభూతి స్థాయిలో వర్ణించిన విశ్వనాధవారి వేయిపడగల్ని వేనోళ్ల కొనియాడాడు. శృంగారం నుంచి ప్రకృతి వరకు, ప్రకృతిలోనూ, శృంగారంలోనూ, సహజ ఇంద్రియ అనుభూతుల్లోను మనిషి అవధులు తెంచుకొని లీనం కావాలనేంత వరకు చంద్రలోని స్వాప్నికుడు విజృంభించాడు. దైద అతని స్వప్నం. అయితే చంద్ర బ్రాహ్మణ సనాతనుడా, వామాచారియా? దక్షిణాచారంలోనూ వామాచారం ఉందని భావించాడా?

చంద్రలోని స్వాప్నికుడు మెచ్చే కథ ఋగ్వేదంలోనూ వుంది. ఆ కథని నేను చంద్ర దగ్గర ప్రస్తావించినప్పుడు చాలా ఆనందం వ్యక్తం చేశాడు.

మహర్షి అగస్త్యుడు తీవ్ర తపస్సులో మునిగిపోయాడు. సకల దేవతల్ని ఆవాహన చెయ్యాలనుకొన్నాడు. ఘోర తపస్సులో మునిగి భార్యతో శృంగారాన్ని త్యజించాడు. అప్పుడు అతని భార్య లోపాముద్ర వశిష్టునికి హితబోధ చేసింది. శృంగారం తపోభంజకం కాదు అని వివరించింది. ఆమె మాటని మహర్షి శిరసావహించాడు.

అసలు ఋగ్వేదమే బూతు అంటూ యలమంచిలి వెంకటప్పయ్య నిందాపూర్వకంగా రాసిన పుస్తకాన్ని ఒక జిల్లా జడ్జి చంద్రకి తెచ్చి యిచ్చాడు. చంద్ర అది నింద కాదు స్తుతి అన్నాడు. శృంగారం పాపం అనే క్రైస్తవ భావనపై విప్లవం అన్నాడు.

రొమాంటిసిజం ప్రధానం కావడం వల్లనే కావచ్చు, శుష్కవేదాంత చర్చలు కాక ఈశ్వర భక్తి అవసరమైంది చంద్రకి. పార్వతీ పరమేశ్వరుల శృంగారాన్ని కాళిదాసు అవధులు మీరి వర్ణించాడు. భక్తి, శృంగారమూ కలిసే ఉంటాయనిపిస్తుంది. రెండూ కాల్పనిక లోకంలో కావ్యరసానందంలో మునకలు వేయడానికి రహదారులే.

చంద్ర ఆసుపత్రిలో ఉన్నప్పుడు పదేపదే నేను తిరిగి వస్తాను అనే మాటని ఆంగ్లంలో చెప్పేవాడు. నా కోసం వేచిచూడు అనే కవిత అతని మదిలో మెదిలి ఉంటుంది. కాల్పనికుడు కావడంవల్ల శివసాగర్ కవితల్ని ఇష్టపడ్డాడు. శివసాగర్

స్వర్గస్తుడైనప్పుడు నన్ను కూడా తీసుకొని వెళ్ళి కవి కళేబరంపై పుష్పమాలని ఉంచాడు. కారులో తిరిగి వస్తున్నప్పుడు శివసాగర్ కవితల్లోని ప్రాకృతిక సౌందర్యాన్ని మెచ్చుకున్నాడు. శివసాగర్‌వి వచన కవితలు కావు అవి లయబద్ధమైనవి, శ్రవణ సుభగమైనవి అన్నాడు.

లయ తప్పిన, కల్పన అంతరించిన ఆధునికత నుంచి కాల్పనిక లోక విహారంలోకి వెళ్ళిపోయేవాడు చంద్ర. అతనికి దైవం, దైద, శృంగార భావనలు ఇవన్నీ కాల్పనిక జగత్తులో అవిభాజ్యమైనవి. శృంగారమూ, దైవమూ ఒకటే. ఒకటి అంతరిస్తే మరొకటి కూడా అంతరిస్తుంది (యూజీ).

బైబిలులో కూడా దేవుణ్ణి ప్రియునిగా సంబోధించే కాల్పనిక గీతాలు వున్నాయి. కాని క్రైస్తవంలో తండ్రి భావన ప్రధానం. మన కర్మభూమిలో దైవాన్ని ప్రియునిగా భావించడం సాధారణం. అటువంటి కవిత్వం చాలానే ఉంది. ఈ సంగతి ప్రస్తావించి భారతదేశంలో దైవానికీ, మానవుడికీ దూరం తక్కువ అన్నాను నేను. "దైవాన్ని ప్రియుడిగా చూడడంలో పితృస్వామిక భావజాలం ఉంది. స్త్రీ దేవతని ప్రియురాలిగా చూడగలమా" అని చంద్ర ప్రశ్నించాడు. దీని గురించి ఆలోచించాలి నిజమే. కాని వామాచారం ఉండనే ఉంది కదా? నిజానికి లలితా సహస్రనామాలకి భాస్కరాచార్యుడనే వామాచార తాంత్రికుడు రాసిన భాష్యం మాత్రమే ప్రాచీనం. దానిలో దేవి శృంగార రసపూర్ణగా అభివర్ణించబడింది అని సమాధానం చెప్పాను నేను.

చంద్రలో రొమాంటిసిజం చాలా ప్రధానమైనది. ఈ కాల్పనికత ప్రకృతి ఆరాధనలో తీవ్రస్థాయికి చేరింది. ప్రకృతి సౌందర్యం ప్రతిచోట సాక్షాత్కరించడంవల్లనే శివసాగర్ కవిత్వాన్ని చంద్ర ప్రేమించాడు. శివసాగర్ కవిత్వంలో ఛందస్సు ఉంది, లయ ఉంది ప్రకృతిలోలాగే. పైగా సంస్కృత పదాలతో, గ్రాంధిక వాసనలతో ఒక ప్రాచీన ప్రబంధ భాషే శివసాగర్‌లోనూ కనబడుతుంది. గేయ లక్షణాలు ఎక్కువ. అందుకే చంద్ర పద్యాన్ని ప్రేమించినట్లుగానే శివసాగర్ కవిత్వాన్నీ ప్రేమించాడు. అతని కవిత్వంలోని నెలవంకల్నీ ఆటవిక సౌందర్యాన్నీ చూసి ముగ్ధుడయ్యాడు.

అస్తిత్వ వేదనలో కూరుకుపోవడానికి చంద్ర ఇష్టపడలేదు. వ్యక్తిత్వాన్ని విచ్ఛిన్నం చేసే ఆధునిక పరిభాషలోకి ప్రయాణించలేదు.

జీవితంలోనూ, కవిత్వంలోనూ ఛందస్సునూ వ్యాకరణాన్నీ లయనీ ఇష్టపడ్డాడు. చంద్ర క్షణికవాది కాదు. అందుకే శృంగార నైషధంలోని కవి వర్ణనని ఇష్టపడ్డాడు. కలి పురుషుడు బౌద్ధజైనుల్ని చూసి సంతృప్తి చెందుతాడన్న వర్ణనని చంద్ర గుర్తు చేశాడు. వేదపండితుల్ని చూసి భయపడ్తాడన్న సంగతి గుర్తు చేశాడు.

వేదంలోని స్వరబద్ధత ప్రకృతి నుంచి, పశుపక్ష్యాదుల నుంచి స్వీకరించినదేనన్న ఫ్రిట్స్‌స్టాల్ ప్రతిపాదనని చంద్రకి వివరించాను. అలాగే వైదిక కర్మకాండ కూడా పశుపక్ష్యాదుల రిట్యువల్ నేచర్ నుంచి వచ్చిందేనన్నాడు ఫ్రిట్స్‌స్టాల్. ఈ విషయాన్ని చర్చిస్తున్నప్పుడు వేదం అపౌరుషేయం అంటే అర్థం యిదే అన్నాడు. వేదం ప్రకృతిలయలోనుంచి వచ్చినదే అన్నాడు చంద్ర. ఈ దైద క్షేత్రంలోనే వేదం పుట్టింది అన్నాడు చెట్లూ పక్షులకేసి చూస్తూ.

చంద్రకి వ్యాకరణమన్నా అభిమానమే. సంస్కృత ఉపాధ్యాయుని వద్దనుంచి వ్యాకరణ పరిజ్ఞానాన్ని పొందడానికి కూడా కృషి చేశాడు. వేదంలో మాత్రమే ఉండే లేట్ ప్రయోగాన్ని గురించి కూడా ప్రస్తావించి సంస్కృతంలో పుట్టి పెరిగిన నన్ను ఆశ్చర్యచకితుణ్ణి చేశాడు.

వ్యాకరణమూ, సంగీతమూ, ఛందస్సూ ఇవన్నీ ప్రకృతిలోని లయ వంటివే. వేదం వర్ణించినట్లు ప్రకృతిని సూత్ర బద్ధంగా నడిపే రుతం వంటివే.

ప్రకృతిలో లయనీ, సంగీతాన్నీ, వ్యాకరణాన్నీ వెతికాడు చంద్ర. ఇది బౌద్ధ దృక్పథానికి భిన్నమైన మీమాంస దృక్పథం. ఈ దృక్పథమే వచన కవిత్వాన్నీ ఆధునిక జీవితశైలిని ప్రశ్నించేలా చేసింది. మితిమీరిన వైయక్తిక ప్రతీకల్లోకి కూరుకుపోవడాన్ని చంద్ర బాహాటంగానే విమర్శించేవాడు

ఈ ప్రాకృతిక దృక్పథమే మానవతా వాదం మీద, మానవ హక్కుల భావన మీద దాడికి కారణమైంది. దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ అన్న గురజాడ దృక్పథాన్ని తీవ్రంగా విమర్శించాడు చంద్ర. కారణం ఏమిటంటే - మనిషిని మట్టినుంచి విడదీయడమే. మనిషిని ప్రకృతి నుంచి వేరుపరచడమే. ఇక్కడ ఒక రెడ్ ఇండియన్‌లా, సనాతనుడిలా యేక కాలంలో సాక్షాత్కరిస్తాడు.

గురజాడ గురించి వ్యాసం రాయాలనుకున్నప్పుడే విశ్వనాథ సత్యనారాయణగారి వేయి పడగలు నవలని కూడా అధ్యయనం చెయ్యడం మొదలు పెట్టాడు. సుబ్రహ్మణ్యంగారు విశ్వనాథ వారి మనవడిని కలిసి విశ్వనాథ సాహిత్యం కొని తెచ్చియిచ్చారు చంద్రకి.

విశ్వనాథవారు ఆధునిక యాంత్రిక నాగరికత ప్రవేశంవల్ల ప్రకృతి విధ్వంసం జరగడాన్ని వర్ణించారు వేయిపడగలులో. ఈ కర్తవ్యాన్ని ఏ ప్రగతి శీల రచయిత నిర్వర్తించకపోవడాన్ని చంద్ర విమర్శించాడు. మరి విశ్వనాథవారి సాహిత్యాన్ని యింత వరకు ఎందుకు చదవలేదని ప్రశ్నించాను. విశ్వనాథ సాహిత్యంపై అప్రకటిత నిషేధం ఉండేదని చంద్ర చెప్పేవాడు. విశ్వనాథ పుస్తకాల్ని చేతిలో పట్టుకొని తిరిగే ధైర్యం తనకి ఒకప్పుడు ఉండేది కాదని చంద్ర అన్నాడు.

సనాతన దృక్పథంతో కూడిన విలువైన గ్రంథాల్ని మొదటి నుంచి పఠించకపోవడం వల్ల తనలో ఒక శూన్యం యేర్పడిందని చంద్ర అంగీకరించాడు. కాని తాను వామపక్షవాదిగా జీవించకపోయి ఉన్నట్లయితే, ఈనాడు సాధించిన వెన్నో సాధించలేకపోయేవాణ్ణి అన్నాడు. ఇది తనని ద్వైధీ భావానికి గురిచేస్తోందని అన్నాడు. పాతకీ కొత్తకీ మధ్య సంధి దశలోని వేదనని చంద్ర తన జీవిత చరమాంకంలో అనుభవించాడు. ఇటువంటి వేదనతోనే రాణి శివశంకర శర్మ తనని తాను సంధియుగపు బ్రాహ్మణ సైకిక్‌గా అభివర్ణించుకొన్నాడు.

ఈ సంధి దశని దాటడానికి ప్రయత్నిస్తుండగానే చంద్ర మరణించాడు. ఆధునికత వ్యక్తీకరణకి సంబంధించిన సమస్యని సృష్టించింది. అది సహజ అభివ్యక్తిని కుంటుపరచింది. ముఖ్యంగా ఆధునిక విద్యావిధానం. ఈ విద్యావిధానం చేసిన పనేమిటంటే గ్రంధానికి ప్రాధాన్యం పెంచడం, మౌఖిక సంస్కృతిని అణగద్రొక్కడం.

“చంద్ర ఎప్పుడూ సెంటర్ ఆఫ్ ఎట్రాక్షన్‌గా ఉండడానికి ప్రయత్నించేవాడు. అందుకోసం అతడు ప్రతిసారీ ఒక నూతన గ్రంథంయొక్క పేరు ప్రస్తావించేవాడు. దాన్ని గురించి తెలియకపోవడం సిగ్గుపడవలసిన విషయంగా న్యూనతాభావాన్ని పెంచేవాడు” అంటారు డాక్టర్ రమణ. ఈయన గుంటూరులో మానసిక వైద్యులు. రచయిత. చంద్రకి చిరకాల మిత్రులు. చంద్ర చదువుకొనే రోజులలో రాడికల్

స్టూడెంట్స్ యూనియన్‌లో పనిచేసినప్పటి నుంచీ అతని వైఖరి అదే అంటారాయన. అలాగే ఇతరుల అభిప్రాయాలకి తక్కువ ప్రాధాన్యం ఇచ్చేవాడనేది కూడా కొందరు చేసే ఆరోపణ.

ఇవన్నీ చంద్రకి సంబంధించిన ప్రత్యేకమైన లోపాలేమీ కావు. ఆధునిక విద్యావంతులు పాశ్చాత్య దేశాలకి సంబంధించిన కొటేషన్స్‌ని దిగుమతి చేసుకుంటూ వచ్చారు. ఆ ఉటంకింపుల్ని భారతీయ మౌఢ్యంపైన పాశ్చాత్య జ్ఞానంయొక్క విజయంగా భావిస్తూ వచ్చారు. జ్ఞానమార్గంగా భావిస్తూ వచ్చారు. ఇప్పటికీ చాలామంది అంతే. క్రమేపీ ఆధునిక విద్యావంతులలో దేశీయ సంస్కృతి, దేశీయ భాషల జ్ఞానం కనుమరుగైపోయింది. ఆ శూన్యాన్ని పాశ్చాత్య దేశాల గ్రంథ పరిజ్ఞానంతో నింపడం మొదలుపెట్టారు. ఇది ఇక్కడ పెరిగిన మొక్క కాదు. అందువల్ల ఈ వాతావరణానికి ఇమిడీ ఇమడనట్లే ఉండిపోయేది ఈ జ్ఞానం.

ఈ శూన్యాన్ని చంద్ర జీవిత చరమాంకంలో స్పష్టంగా గుర్తించాడు. ఆధునికతవల్ల మనుషులు గాఢ బంధంలేని చెదిరిన అణువులుగా అటామిస్టిక్ ఇండివిడ్యువల్స్‌గా మారిపోయారని పాశ్చాత్య తాత్వికుడు బౌమన్ మాటల ద్వారా గుర్తించాడు. ఈ విచ్ఛిత్తి వ్యక్తీకరణలో కూడా ప్రతిఫలించిందని గుర్తించాడు.

మాట, పాట స్థానాన్ని పూర్తిగా పుస్తక జ్ఞానం ఆక్రమించడంలోని విషాదాన్ని అంగీకరించాడు. భారతీయ మౌఖిక సంస్కృతివైపు ప్రయాణం మొదలు పెట్టాడు. దానిలో భాగమే సంస్కృత భాషా అధ్యయనం.

సుబ్రహ్మణ్యంగారు విశాఖపట్టణంలో ఉన్నప్పుడు నన్నూ, చంద్రని, నాగేశ్వరరావునీ అతిథులుగా ఆహ్వానించారు. అక్కడ జరిగిన ఒక సంఘటన నాకు గుర్తుకు వస్తోంది.

చంద్ర ఒక సంస్కృత శబ్దాన్ని వివిధ విభక్తులలో నాకు వినిపించాడు. తృతీయా విభక్తి తప్పుగా ఉచ్చరించావని నేను అన్నాను. తనదే కరెక్టని, తప్పు అయినట్లైతే 500 రూ॥లు ఇస్తానని అన్నాడు. శబ్దమంజరి పరిశీలించాడు. తన ఉచ్చారణలో చిన్న తప్పుదొర్లిన మాట నిజమే. నాకు డబ్బు ఇవ్వబోయాడు. వద్దన్నాను. ఈ సంఘటన యెందుకు చెప్తున్నానంటే చంద్ర ఏకాంతంలో

పుస్తకాన్ని చదువుకునే పాశ్చాత్య విధానం నుంచి శబ్దంవైపు, శ్రుతి వైపు ప్రయాణం మొదలు పెట్టాడు. గురువు ద్వారా శిష్యునికి పరంపరలుగా మౌఖికంగా అందించబడే సంస్కృతం వైపు, సంస్కృతి వైపు దృష్టి సారించాడు. ఈ దృష్టిలోని మార్పు అనేది అతని వ్యక్తిత్వంలో కూడా మార్పుని తీసుకురావడం మొదలు పెట్టింది.

అందుకే చంద్ర చప్పని సిద్ధాంత వ్యాసాల స్థానంలో వ్యంగ్యమూ వినూత్న కథావిధానమూ కలగలసిన రచనలు రాయడం మొదలు పెట్టాడు. తన ఆలోచనల్ని, తాత్విక చింతననీ అకడమిక్ మూసలో కాక బామ్మలు చెప్పే కథలా చెప్పడానికి ఇష్టపడ్డాడు. కంచిపరమాచార్యుల వారి సంభాషణలన్నీ చదివి నాతో అన్నాడు "నువ్వు కూడా పరమాచార్యుల వారిలాగే ప్రవచిస్తుంటావు. ఆయన మాటల్లోలాగే నీ రచనల్లో కూడా పిట్టకథలు, ఆర్యోక్తులు, శ్లోకాలు, పద్యాలు, పిచ్చాపాటి సంభాషణలు కలగలసి ఒక హరికథా కథనంలా కొనసాగుతాయి. ఇప్పుడు రచన కొనసాగవలసిన విధానం అదే" అన్నాడు చంద్ర నాతో ఒకసారి.

కథ, నవల, కవిత ఇలాంటి విభాగాలన్నీ ఆధునికమైనవి. జగత్తులో సర్వమూ ఉన్నట్లే కావ్య జగత్తులో కూడా అన్నీ ఉండేవి, ఉండాలి కూడా అన్నాను. ప్రాచీన కావ్యాలతో పరిచయం ఏర్పడే కొలదీ నా అభిప్రాయాన్ని బలపరచడం మొదలు పెట్టాడు చంద్ర.

ఆధునిక విద్య, సంస్కారము సహజ వ్యక్తీకరణని కుంటుపరిచాయని గుర్తించడం చంద్రలో జరిగిన పెద్దమార్పు. ఈ మార్పుని ప్రతిబింబించే రచనలు అతని నుండి వ్యక్తం కావలసి ఉన్నాయి. కాని చంద్ర ఈలోగానే అస్తమించాడు.

తనను తాను అధిగమిస్తూ పోవడం చంద్రలోని ప్రత్యేక లక్షణం. కాని చంద్ర తన అహంభావాన్ని అధిగమించలేదని కొంతమంది ఆరోపణ. రమణగారి భాషలో చెప్పాలంటే - చంద్రలోని సెంటర్ ఆఫ్ ఎట్రాక్షన్ అదే. తాను చెప్పేదానికి అహంభావాన్ని జోడించడం. బహుశా చంద్రలోని న్యాయవాది కూడా దానికి కారణమేమో.

చంద్ర మొదట వార్తాపత్రికల్లో జర్నలిస్టుగా చేరాలనుకొన్నాడు. కాని అతనికి ఉద్యోగం లభించలేదు. ఈ సంగతి చంద్రయే చెప్పాడు.

పత్రికలతో పాత్రికేయులతో అనుబంధం అనేది మేధావి వర్గాన్ని, ప్రపంచాన్ని గురించి, సమాజాన్ని గురించి ఆలోచించే అవకాశాన్ని విస్తృత పరిచాయి. సామాజిక అవగాహన లేనప్పుడు ప్రతీదానికీ భయపడే లక్షణం ఎక్కువగా ఉంటుందని చంద్ర ఒకసారి అన్నాడు. వామపక్ష సంస్థలే కాదు పత్రికలతో సంబంధం కూడా రాడికల్ స్వభావం గల యువకులలో సామాజిక చింతనని పెంచుతూ వచ్చాయి. రోజువారీ సామాజిక సంఘటనల్ని సామాజిక విశ్లేషణల్ని పత్రికలు అందిస్తూ రావడమే కారణం.

చంద్ర లెక్చరర్ కావాలనుకొన్నాడు, పాత్రికేయుడు కావాలనుకొన్నాడు ఈ రెండూ కాలేకపోయాడు. ఈ కాలేకపోయిన విషయాలు కూడా చంద్ర వ్యక్తిత్వాన్ని ప్రభావితం చేశాయి. అభావం కూడా దేనికో ఒక దానికి సంబంధించినదే.

"న్యాయవాదిగా ఉండడంవల్లే నువ్వు సాధించవలసినవి సాధించావు" అని అన్నాను నేను. కాని చంద్ర వట్టి న్యాయవాది మాత్రమే కాదు. సామాజిక విశ్లేషకుడుగా, మేధావిగా, బోధకుడు కాని బోధకుడుగా చంద్ర మారడంలో అతడు అవ్వాలనుకొని కాలేకపోయిన విషయాలు కూడా కారణం.

చంద్ర పత్రికల పట్ల మీడియాపట్ల నిర్లిప్తంగా ఉండలేకపోవడం మాట అలావుంచి వాటిపట్ల మితిమీరిన ఖాతరు కలిగి ఉండేవాడు. దీనివల్ల వచ్చిన నష్టమేమిటంటే తాత్వికమైన ఎదుగుదలకి ఇది అడ్డంకి. దీన్ని చంద్ర తన దైద ప్రయాణంతో అధిగమించాలని ప్రయత్నించాడు.

పత్రికలూ, మీడియా పాపులర్ పద్ధతివైపు మనిషిని నెడ్తాయి. రోజువారీ సంఘటనలూ, రాజకీయాలూ, వాటి విశ్లేషణలూ ఇవే ప్రధానంగా మారిపోతాయి. మితిమీరిన కాలబద్ధత పెరుగుతుంది. స్థలమూ, కాలమూ కుదించబడ్తాయి. తేదీల మధ్య పేజీల పరిమితి మధ్య యిరుక్కుపోతాం. రోజువారీ సంఘటనల చుట్టూ చక్కర్లు కొడ్తాం. ఇది మృత్యు సమానం. చంద్ర దీన్ని అధిగమించడం కోసం సనాతనం వైపు ప్రయాణించాడు. సనాతనమే సమాధానం అని మిత్రుడూ, సహ న్యాయవాదీ నాగేశ్వరరావుతో చెప్పాడు జీవితంలో చివరిసారి కలిసినప్పుడు. సనాతనం అంటే స్థల కాలబద్ధం కానిది అని అర్థం. అటువైపు ప్రయాణించాడు చంద్ర.

చంద్ర అసలు స్థల కాల బద్ధుడు కాదు. అతనిలో కాల్పనికుడైన మహా కవి విహరిస్తుంటాడు. కవి న్యాయవాదిని శాసించేవాడు. ఈ కవి తనదైన భాషని కనుగొనవలసి ఉంది. అది ఆంగ్ల భాషలో పాశ్చాత్యంలో లేదు. ఇంతకీ చంద్ర పల్నాటిలోని ఒక పల్లెటూరిలో పుట్టి పెరిగిన బ్రాహ్మణుడు.

నేను కొంత కాలం చుండూరులో ఉపాధ్యాయుడిగా పనిచేశాను. చుండూరులో రెడ్లు ఊచకోత కోసిన దళితుల కళేబరాల్ని గ్రామం నడిబొడ్డున ఖననం చేశారు. దానిని రక్తక్షేత్రం అంటారు. ఆ రక్తక్షేత్రానికి ఎదురుగానే టీ బడ్డీ ఉంది. రోజూ నేను టీ తాగడానికి వెళ్ళేవాడిని. అక్కడ చేరిన ఒక దళిత వృద్ధుడు అంటున్నాడు. చంద్రశేఖర్ అనే ఒక బ్రాహ్మణుడు చుండూరు కేసు వాదించబోతున్నారు. ఆయన గొప్ప నిజాయితీపరుడు, నిస్వార్ధజీవి అని. చదువుకొనే రోజుల్లో పాత ఆంధ్రపత్రికల్ని ఒకసారి వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తిరగేస్తున్నాను. పాత ఆంధ్రపత్రికలలో ప్రతిపేరు చివరన కులం పేరు ఉండేది. అది భారతీయ గ్రామీణ సంస్కృతి. భారతదేశం అంటే గ్రామాలే, కులాలే.

చంద్రశేఖర్ అనే బ్రాహ్మణుడు తన లోపలికి తాను ప్రయాణం చేశాడు. ఈ ప్రయాణానికి అర్ధం ఏమిటి, సార్ధకత ఏమిటి?

ఈ ప్రయాణపు ఆనవాళ్లు పెద్దగా కనబడవు. ఎక్కువగా అతని మాటలలోనే అతని ప్రయాణం వ్యక్తమైంది. లిఖితమైందే గ్రంథస్థమైనదే సత్యం అనుకొనే ఆధునిక విద్యావంతులకి యిది కొరుకుడుపడని విషయం. క్రీస్తు కాని బుద్ధుడు కాని ఏ ఒక్క వాక్యమూ రాయలేదనే విషయాన్ని వీరు మరచిపోతారు.

విశ్వవిద్యాలయాలు చంద్రకి ఉద్యోగం ఇవ్వనందుకు మనం కృతజ్ఞులుగా ఉండాలి. పాశ్చాత్య దేశాలలో సంగతి నాకు తెలియదు కాని భారతదేశంలో విశ్వవిద్యాలయాల్లో ఆచార్య పదవిలో చేరడం ఆత్మహత్యా సదృశం. ఎందుకంటే - భారతీయ విశ్వవిద్యాలయం పాశ్చాత్య విశ్వవిద్యాలయానికి వెయ్యోనకలు. ఈనాడు అదికూడా అబద్ధమే. అందుకే గొప్ప పరిశోధనలూ, సాహిత్యము, తత్వశాస్త్రమూ విశ్వవిద్యాలయాల బయటే వర్ధిల్లుతూ వచ్చాయి.

విశ్వనాధ సత్యనారాయణగారివంటి కవి పండితులకి విశ్వవిద్యాలయాలు సగౌరవంగా స్థానం కల్పించవలసి ఉంది. కాని అలా జరగలేదు. అటువంటి

వారు ప్రైవేటు కళాశాలల్లోను మరోచోటో బతుకుతెరువు వెతుక్కోనవలసి వచ్చింది. ఇది విశ్వవిద్యాలయాల్లో విలువలు లేకపోవడాన్ని సూచిస్తుంది అనేవాడు చంద్ర. విలువలకి ప్రాధాన్యతనిచ్చే చంద్ర సర్వరంగాల్లోనూ విలువలు ఉండాలని భావించేవాడు. ఫెలోషిప్పులతో కొండని తవ్వి ఎలుకలు పట్టే విశ్వవిద్యాలయ జీవుల గురించి చిన్నచూపు ఉండేది అతనికి.

అయితే భారతీయ విద్యావిధానం భారతీయ సంస్కృతిలాగే కేంద్రీకృతమై లేదు. అది చాలా వరకు మౌఖికం. భారతీయ జ్ఞానం కేంద్రీకృతం కాదు. ఎందుకంటె భారతదేశంలో మతం లేదు. ఒకప్పుడు రాడికల్ స్టూడెంటుగా గ్రామాలకి తరలండి అనే నినాదాన్ని అందుకొని గ్రామాలవైపు దృష్టి సారించాడు. ఇప్పుడు తన మూలాల్ని వెతుక్కొంటూ, స్వదేశీ జ్ఞానాన్ని అన్వేషిస్తూ దైద అనే గ్రామానికి పయనించాడు చంద్ర.

దైదలో పొలంకొన్నాడు. దైవ సన్నిధిలోనే కొన్నాడు. అక్కడ ఆవాసం ఏర్పరచి మిత్రులతో కలిసి సనాతన జ్ఞానాన్వేషణ చెయ్యాలని సంకల్పించాడు. నేను, చరిత్రకారుడు, సంస్కృత పండితుడు జితేంద్ర, సుబ్రహ్మణ్యంగారు మేము ముగ్గురం చాలాసార్లు దైద శివాలయం ప్రాంగణంలో కలవడం మొదలు పెట్టాం. నేను నా రచనల్ని చదివి వినిపించేవాడిని. జితేంద్ర తన గ్రంథాలనుంచి కొన్ని ముఖ్యాంశాల్ని చదివి వినిపించేవాడు. తీవ్రంగా చర్చ సాగేది. మిత్రులు మృత్యుంజయరావుగారిని కూడా ఆహ్వానించాడు. కాని ఆయనకి చివరి వరకు కుదరలేదు. ఈ విషయాన్నే తలచుకొని యిప్పటికీ మృత్యుంజయరావు గారు బాధపడ్తూ ఉంటారు. మరణానంతరం చంద్ర కళేబరాన్ని దైదలోని స్వీయ క్షేత్రంలోనే దహనం చేశారు. తనని అక్కడే దహనం చెయ్యమని చంద్ర స్వయంగా కోరాడు. బహుశా తన ఆత్మ ప్రశాంత ప్రకృతిలో, పక్షుల కల కూజితాల మధ్య, పూజారి సంజీవి పఠించే వేదమంత్రాల మధ్య సంచరిస్తుందని ఆశించి ఉండవచ్చు. తానెక్కడ జీవించాలని, సంచరించాలని, తన ఆలోచనలకి గమ్యాన్ని అన్వేషించాలని, పరమార్థాన్ని చేరుకోవాలని కోరాడో అదే క్షేత్రంలో తన మరణానంతర స్థితి కొనసాగాలని చంద్ర ఆశించాడా? అక్కడొక పక్షిగానైనా పునర్జన్మించాలని కోరుకున్నాడా?

క్షేత్రం అంటే దేహమని అర్థం. క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగం అనేది భగవద్గీతలోని ఒక అధ్యాయం. క్షేత్రజ్ఞుడు అంటే ఆత్మ అని అర్థం. దైద క్షేత్రానికి క్షేత్రజ్ఞుడు చంద్ర. ఆత్మలేని ఆ క్షేత్రానికి చంద్ర ప్రేత కర్మ సందర్భంగా తాను రాలేనని మృత్యుంజయరావుగారు అన్నారు. అతడు ప్రేమగా పిలిచినప్పుడు తాను రాలేకపోయానని కళ్ళనీళ్ళ పర్యంతమయ్యారు.

కాని పన్నెండవ రోజున దైద క్షేత్రానికి నేనూ, మృత్యుంజయరావు గారూ, సుబ్రహ్మణ్యంగారు కలిసి వెళ్లడం తటస్థించింది. చంద్రలేని ఆ వృక్షాలూ, ఆ పర్వత శిలలూ, ఆ నదీ జలాలూ అన్నీ శూన్యాన్ని మోస్తున్నాయి. దేవతలు రాత్రికి రాత్రి ఒక శివాలయాన్ని పరిపూర్ణంగా నిర్మించడానికి సంకల్పించారు. కాని పూర్తి కాకుండానే తెల్లవారిపోయి జనసంచారం పెరిగిపోవడంతో దేవతలు తమ లోకానికి వెళ్ళిపోయారు. దేవాలయ నిర్మాణం ఆగిపోయింది. అది యెప్పటికీ అపరిపూర్ణంగానే మిగిలిపోయింది. ఇది ఒక శైవక్షేత్రాన్ని గురించి నేను విన్న స్థలపురాణం. ఆ క్షేత్రం పేరు నాకు గుర్తులేదు. ఇటువంటి వెలితి యేదో దైదలో కొట్టవచ్చినట్లు కనిపించింది.

దైదలోనే కాదు, అంజయ్యగారి ఇంటిలోనూ ఇటువంటి శూన్యస్థితి యేర్పడి ఉంటుంది. పెద్ద గ్రంథాలయంలా అందంగా పేర్చిన పుస్తకాలతో నిండివుండే ఆ సుందర గృహం పై అంతస్తులో తీవ్ర తాత్విక చర్చలకు దారితీసే సభలు జరిగేవి. మొదటిసారిగా నేను హాజరైన సభ ఆశిష్‌నందీ 'ఇంటిమేట్ ఎనిమీ'కి డి. వెంకట్రావుగారు చేసిన అనువాద గ్రంథంపై చర్చ. ఆ పుస్తకానికి వెంకట్రావుగారు రాసిన ముందుమాట చంద్రకి బాగా నచ్చింది. నేను రచించిన పురాణ వేదంపై కూడా ఒక సమావేశం జరిగింది. ఈ సమావేశం తీవ్రమైన వాదోపవాదాలకి దారితీసి చంద్రకి మరొకరికి మధ్య ఘర్షణగా కూడా మారింది.

తాత్విక చర్చలు కూడా ఇలాంటి ఘర్షణకు యెందుకు దారితీస్తాయి. ఎందుకంటే ప్రతిచోట మనిషి అహమే కేంద్రంగా పనిచేస్తుంది. ఆబ్జెక్టివ్‌గా చర్చించడం అనేది మిథ్య మాత్రమే.

చంద్ర అహంభావానికి వెలుగునీడలుండేవి. కొన్నిసార్లు ఆయన అహంభావం దారితప్పిందనే నేను భావించాను. ఈ విషయమే నరహరితో ప్రస్తావించినప్పుడు "అహంభావమంటేనే దారి తప్పడం. నీ అహంభావం మాత్రం

దారి తప్పలేదా? అహంభావాన్ని గుర్రంపై స్వారీ చేసినట్లు యెవరు స్వారీ చేయగలరు'' అన్నాడు నరహరి.

చంద్ర అహంభావంయొక్క మంచిచెడుల్ని ప్రక్కనపెడదాం. అహంకారం అనేది నశిస్తే ఆలోచన కదలికే ఆగిపోతుంది. సకల బౌద్ధిక కార్యకలాపాలూ అహంకారం యొక్క తీవ్ర చలనాలే. నేను ''భావ కవిని కాదు అహంభావ కవిని'' అన్న పఠ్తాభి వాక్యం పఠ్తాభికే కాదు అందరికీ వర్తిస్తుంది.

చంద్రలోని అహంకారం నాకు శ్రీనాథ మహాకవిని గుర్తుకు తెస్తుంది.

దివిజకవివరు గుండియల్ దిగ్గురనగ
అరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి.

శ్రీనాథుడి అహంకారానికి అర్థమేమిటి? జీవిత చరమాంకంలో అప్పు తీర్చనందుకు తీవ్ర అవమానాలకి గురయ్యాడు. అయినప్పటికీ అహంకారాన్ని వదల లేదు శ్రీనాథ మహాకవి. ఎందువల్లనంటే ఈ అహంకారం ధనం నుంచి రాలేదు, విద్యాధనం నుంచి వచ్చింది. ఇది ఆంతరంగికమైన సంపద, పైకి కనబడేది కాదు.

సాధారణంగా మనుషులు దృష్టిగోచరమైన దానిని బట్టే గౌరవం యిస్తారు. ధనహీనుడు గర్వించడాన్ని జీర్ణించుకోలేరు. దాన్ని పిచ్చిగానైనా మూర్ఖత్వంగానైనా భావిస్తారు.

''ఈ గ్లోబలైజేషన్ యుగంలో ధనం సంపాదించగలిగి కూడబెట్టక పోవడం చెయ్యెత్తి నమస్కరించవలసిన విషయం'' అంటారు డాక్టర్ రమణ. చంద్ర గురించి ప్రస్తావిస్తూ ఈ మాట అన్నారు.

చంద్ర మరణించినప్పుడు చంద్ర కుమారుడు శశాంక ఒక వ్యాసం రాశాడు. ఆ వ్యాసంలో చంద్ర ధనానికి ప్రాధాన్యం ఇవ్వలేదని, యశస్సుకి మాత్రమే ప్రాముఖ్యతనిచ్చాడని రాశాడు.

నేనిక్కడే ఒక ప్రశ్నవేస్తాను. ధనంలేని యశస్సుకి విలువ వున్నదా? ధనమూ యశస్సూ కలిస్తేనే ఒక విలువ యేర్పడ్తుంది. ముఖ్యమంత్రి రాజశేఖర రెడ్డిగారు మరణించినప్పుడు కొందరు దళిత ఉపాధ్యాయులు నన్ను ''నువ్వెందుకు రాజశేఖరరెడ్డిగారిపై రచన చెయ్యవని'' అడిగారు.

నేనటువంటి రచన ఏదీ చెయ్యలేకపోయాను. కాని విరసం మిత్రుడు వేణుగోపాల్ తన ప్రగతిశీల కీర్తి ప్రతిష్ఠల్ని పణంగా పెట్టి ఆయనపై చక్కని వ్యాసం రాశాడు.

సెలబ్రిటీ అనే పదానికి నిఘంటు అర్థం నాకు తెలియదు కాని డబ్బూ యశస్సూ రెండూ ఆడవారి జడలోని పాయల్లా అల్లుకుపోయిన గొప్ప వ్యక్తుల్ని సెలబ్రిటీలు అంటారు. ఆధునిక ఉద్యమకారులు చాలామంది ఇటువంటి స్థితినే కోరుకుంటున్నారు. ఆస్తి ఆశయమూ కలగలిసిన స్థితిని కోరుకుంటున్నారు, తమకి ఉద్యమాల ద్వారా ఉపన్యాసాల ద్వారా వచ్చిన కీర్తిని ధనంగా మలచుకొంటున్నారు. ఇప్పటికే మలచుకొన్నారు. సినిమా వాళ్లు సామాజిక సమస్యల్ని పెట్టుబడిగా మార్చి కోట్లు గడించినట్లు వీళ్లు చుండూరుల్నీ, కారంచేడుల్నీ ఆస్తులుగా మలచుకొన్నారు. మానవ చరిత్ర చివరికి హాస్యాస్పదంగా ముగుస్తుంది.

ఇటువంటి హాస్యాస్పద స్థితికి గురికాని వాడే చంద్ర. అతడు బ్రాహ్మణ సంఘంలో సభ్యుడయ్యాడే కాని ఆశయాలని పెట్టుబడిగా వడ్డీ వ్యాపారంగా మార్చుకోలేదు. సనాతనం అన్నాడే కాని, ఆధునికత తెచ్చిన అవకాశాల్ని ఉపయోగించుకొంటూ ఆకాశహర్మ్యాలు నిర్మించలేదు. చివరికి ఒక సొంత ఇల్లు కూడా సమకూర్చుకోలేదు. సొంత ఆస్తి ఆవిర్భావంనుంచే కుటుంబం వచ్చిందని, కుటుంబం కొనసాగేది సొంతఆస్తి కొనసాగింపుకోసమేనని కమ్యూనిస్టు పాఠాలు చదివినవాడే. కాని కుటుంబంకోసం యెటువంటి ఆస్తినీ మిగల్చకుండా వెళ్ళిపోయాడు. శశాంక చివరికి తన తండ్రి మిగిల్చిన ఆస్తి యశస్సేనన్నాడు. ఈ మాటకి మనం నవ్వవచ్చు లేకపోతే యేడవవచ్చు కాని యశస్సు ఎప్పటికీ ఆస్తికాదు. నీ వయస్సు తక్కువ, అందుకే యశస్సే ఆస్తి అనకు అని ఆశు కవిత చెప్పాడు నరహరి.

ఎందుకంటె యశస్సు కోసం మంచి పనులూ, దానధర్మాలూ చేసి దివాళాతీసే ఫ్యూడల్ దశని మనం యెప్పుడో దాటేశాం. మనం యిప్పుడు ధనస్వామ్యంలోకి పీకల్లోతు మునిగిపోయాం. ప్రముఖ సినీ హీరోయిన్ త్రిష కేన్సర్ రోగుల నిమిత్తం నిధిని ఏర్పాటు చేసిందని వార్తాపత్రికల్లో చదివాను. బిల్ గేట్సు లాంటివాళ్లు చేసే దానధర్మాలూ, ఉదారత్వమూ నాకు అర్థమౌతాయి.

అవన్నీ వారికి వజ్రపుటుంగరాల్లా శోభిస్తాయి. వారికి యశస్సు ఒక ఖరీదైన అలంకారం.

అలాగే కొందరు దళిత మేధావులు ప్రభుత్వం భూములు పంచేలా చేస్తామని, కడుపేద స్త్రీలనుంచి వందలు వసూలుచేసి, అలా కోట్లు గడించి మిన్నకుండిపోవడం వెనుక అంతరార్థం నాకు బోధపడ్తుంది. వాళ్లు టీ.వీల్లో కనబడి నీతి ఉపన్యాసాలు యిస్తున్నప్పుడు గొప్ప ఔచిత్యం గోచరిస్తుంది. ధనస్వామ్యం యొక్క సహజ చలనాలే యివి.

ధనంలేని కీర్తి, ఆస్తిని కూడబెట్టలేని ఆశయం ఇవి విచిత్ర ప్రాణులు. అంతరించిపోతున్న భాషలు.

అందుకే నేను చంద్ర ఒక ఫూల్ అని లక్ష్మితో అన్నాను. ఇదే మాట రాస్తున్నానని కూడా అన్నాను.

కాని మేధావులూ, ప్రగతిశీలురూ, నీతిమంతులూ, ఆశయాలు వల్లించేవాళ్లు వీళ్ళతో ప్రపంచం కుళ్లిపోయింది. అందువల్ల ఫూల్స్ అవసరం ఈ ప్రపంచానికి ఎంతో ఉంది. వారి వల్లనే ప్రపంచంలో ఈ మాత్రం సౌందర్యం మిగిలి ఉంది. చంద్ర మాటల్లోను, నవ్వులోనూ, కదలికలోనూ, రూపంలోనూ సౌందర్యం ఉంది. ఈ మాట చాలామంది అంటారు. దాంతోపాటు అహంకారం ఉందని కూడా అంటారనుకోండి అది వేరే సంగతి.

చంద్ర రాతకోతల్లోకి మునిగిపోకుండా రూపమూ, దానికి తగిన వాక్చాతుర్యమూ అడ్డుకొన్నాయనిపిస్తుంది. రవీంద్రనాథ్ ఠాగూర్ రూపం కూడా పాశ్చాత్యుల్ని ఆకర్షించిందంటారు. అతనిని చూస్తూ సాక్షాత్తూ ఏసుక్రీస్తుని చూస్తున్నామని భావించారు వారు (ఆర్గ్యుమెంటేటివ్ ఇండియన్ - అమర్త్యసేన్). అంటే ఆకర్షణీయమైన రూపం ఆ మేధావి మాటలకి విలువనిస్తుంది. అట్టిరూపం రచన యొక్క ఆవశ్యకతని తగ్గించి వేస్తుందంటాడు మిత్రుడు అంబటి సురేంద్ర రాజు. అంటే చూపులతోనూ మాటలతోను తమని తాము అందంగా వ్యక్తం చేసుకొనేవాళ్లు రచన చేసే శ్రమని నివారించుకొంటారేమో!

తన ఉత్సాహపూరితమైన చతురోక్తులతో, పరిపూర్ణమైన రూపంతో మా మిత్రులందరికీ ఒక అధ్యక్షస్థానంలో ఉన్నట్లుండేవాడు చంద్ర. నేను నా

విశాఖపట్నం ఉపన్యాసం "సనాతనం - ఆధునికత"ని ప్రతి వాక్యం చంద్రకి వినిపించాను. చంద్ర ప్రతి వ్యాకం దగ్గర ఆగి చప్పట్లు కొట్టేవాడు. అద్భుతం అనేవాడు. అట్లా రసాస్వాదన చేసే వ్యక్తులు అరుదుగా ఉంటారు. దైదలో నా వ్యాస పఠనానికి ప్రత్యక్ష సాక్షులు సుబ్రహ్మణ్యంగారూ, జితేంద్ర.

ఆధునికతని విమర్శించడానికి గురజాడని తార్కాణంగా తీసుకొమ్మని సలహాయిచ్చింది చంద్రే. ఆ పాపం చంద్రదే.

ఒక మాటకీ, ఒక కొత్త ఆలోచనకీ, ఒక కొత్త ఊహకీ అంత ఉత్సాహంగా స్పందించే వ్యక్తి మళ్లీ కంటబడ్తాడా అనేది అనుమానమే. విగ్రహారాధకులు తప్ప, స్వతంత్ర ఆలోచనాపరులు అరుదైపోయారు. చంద్ర విగ్రహారాధకుడు కాడు.

చంద్ర శివారాధన ఒక కావ్య రసాస్వాదన వంటిదేకాని వట్టి మూఢ భక్తి కాదు. కావ్యాలలోని అద్భుత ఊహాశక్తికి తన్మయుడయ్యేవాడు చంద్ర. నెప్పితో తీవ్రంగా బాధపడ్తూనే సంస్కృత కావ్యాల అనువాదాలు చదవడం మొదలు పెట్టాడు.

చరిత్ర పురుషులకన్న పురాణ పురుషులే యెక్కువ ప్రభావశీలురు అంటాడు రామ్ మనోహర్ లోహియా. శంకరుడు చంద్రని ప్రభావితం చేసింది అందువల్లే. ఇంతకీ చంద్రుడు శివుని సిగపువ్వేకదా. శివుని చుట్టూ యెన్ని అద్భుత కల్పనలు? మన్మథుణ్ణి దహించింది శివుడే. అదే సమయంలో పార్వతిని అర్ధనారీశ్వరిగా స్వీకరించిందీ శివుడే. నాట్యానికి మూలం శివుడే. అక్షరమాలని ఢమరుకం ద్వారా వెలువరించింది శివుడే. శివుడే ప్రపంచానికి వ్యాకరణం.

చూడండి భోళా శంకరుణ్ణి తలవగానే ఎలా ఊహాలోకంలోకి వెళ్ళి పోతున్నానో! కావ్యం కాని, పురాణం కాని మానవ అనుభవాల నుంచి పుట్టినవి కావు. ఒకరి అనుభవం మరొకరికి ఎందుకూ పనికి రాదు. వ్యక్తిగత అనుభవాల్ని కుప్పబోయడం, దాన్ని కథ అనడం ఆధునిక రుగ్మత.

కావ్యం ఒక నూతన సృష్టి, అదొక బ్రహ్మసృష్టి. కవి బ్రహ్మ. అతడొక దైవం. అందువల్ల బయట కనబడే వాస్తవాల నుంచి కాక, అనుభవం నుంచి కాక అంతరంగంలోనే సృష్టి చేస్తాడు కవి. అందుకే అంత అద్భుత కల్పనలు

సాధ్యమయ్యాయి.

ఆధునికత మనుషుల్ని కాలబద్ధుల్ని చేయడంతో కాలాతీత స్థితిలో సాగే ఊహావిహారం కాల్పనిక జగత్తూ ముగిసిపోయి, స్థల కాలబద్ధమైన నేలబారు రచనలు ప్రారంభమయ్యాయి. మృత్యుంజయరావుగారిని చంద్ర ఒకసారి అడిగాడు "తనికెళ్ళ భరణిగారు గొప్ప శివభక్తులు కదా, ఆయన శంకరుని స్తుతిస్తూ మంచి కవితలు గానం చేశారు కదా? ఆయన అదే భక్తి ప్రవాహంలో మునిగితేలుతున్నారా?" యిది చంద్ర అడిగిన ప్రశ్న.

చంద్ర క్రమేపీ పురాణాలలోకి, కావ్యాలలోకి పురాణ పురుషుల కథా మాధుర్యంలోకి తిరోగమించాడనిపిస్తుంది. యిది ఆధునికతకి ప్రతిక్రియ. ఇదొక గెరిల్లావార్ అన్నాడు నరహరి.

చెట్టుచాటునుంచి శ్రీరామచంద్రుడు బాణాలు వేసినట్లు సనాతనంలోంచి ఆధునికతపై బాణాలు వెయ్యడం మొదలుపెట్టాడు చంద్ర. ఇదీ ప్రజాయుద్ధభేరియే. ఇది అతని వ్యంగ్య రచనల్లో స్పష్టంగా కనబడ్తుంది.

సనాతనం అంటే ప్రీమోడర్నిటీయే. ఆ ఊబిలోకి కూరుకుపోయిన శర్మ నిన్ను కూడా లాగుతున్నాడు, దూరంగా తరమమని సలహా యిచ్చిన వాళ్ళు ఉన్నారు. ఈ సంగతి చంద్రయే చివరిసారి ఆసుపత్రిలో కలిసినప్పుడు చెప్పాడు.

ఏకోహి దోషో గుణ సన్నిపాతే

నిమజ్జతీందోః కిరణేష్వివాంకః (కుమార సంభవం - కాళిదాసు)

చంద్రునిలోని మచ్చ అమృత కిరణుని కిరణ పుంజంలో మునిగిపోతుంది. అలాగే చిన్నదోషం అనేది చంద్రశేఖరుని ప్రగతిశీల గుణాల వెల్లువలో కొట్టుకుపోతుంది అని నేను సమాధానం చెప్పాను.

చంద్ర అన్నాడు గంభీరంగా

"చంద్రునితో నాకు పనిలేదు. చంద్రునిలోని నల్ల కుందేలే నాకు కావాలి. అదే సనాతనం. అసలు కాంతి నలుపే. నల్లాని సూర్యుడు అని శివసాగర్ పాడాడు. కారు నలుపు నుంచే జగత్తు పుట్టింది. జగదీశ్వరుడు నలుపే. నువ్వు పురాణవేదం పుస్తకంలో చెప్పలేదా?"

ఇవే చంద్రతో నా చివరి మాటలు. ఇప్పుడు చంద్ర లేడు. చంద్ర తెచ్చిన ఆ ఉత్సాహోద్రేకమూ లేదు.

చీకటిలో మునిగిపోయిన మెలికలు తిరిగిన మెట్లమీంచి సత్తెనపల్లిలోని నా ఇంటి లోపలికి చేరాను.

ఇప్పుడు చీకటే, నలుపే నాతో మాట్లాడ్తోంది.

చంద్ర అభావం కూడా నాచేత వాక్యాల్ని పరుగుపెట్టిస్తోంది.

అదీ చంద్ర.

అదీ సనాతనం.

అదీ చంద్ర దర్శనం.

రచయిత సెల్ :7396666942

